# లేపాక్షి

## వాస్తు శిల్ప చిత్రలేఖనాలు


సి. పూర్ణచంద్

లెక్చరర్

హిస్టరీ అండ్ ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్

బి. టి. కాలేజ్, మదనపల్లె



చైతన్య పబ్లికేషన్స్

మదనపల్లె

LEPAKSHI

Architecture, Sculpture & Painting

C. POORNACHAND



Copies : 1000

First Edition : 1985

Price : Rs. 27-00

Published with the Financial Assistance of
T. T. Devasthanams, Under the Scheme
Aid to Publish Religious Books



Cover Design : Chandra, Hyderabad

For Copies :

CHAITANYA PUBLICATIONS
XVII-470-2, Nehru Nagar
MADANAPALLE - 517 325

Printed at OMKAR PRINTERS, TIRUPATI

# FORE WORD

Lepakshi, an insipid village in Hindupur Taluk of Anantapur District (A.P), is well-known for its Virabhadra Temple. This temple is a telling testimony for the adroitness of the sculptor of the day and the culmination of the Vijayanagara temple grandeur. Its temple architecture is a model-complex of the Vijayanagara temple building style and every inch of its walls is the glyptic resplendent expression of Vijayanagara life-style. Indeed, in the firmament of Indian Art, Vijayanagar sculptures shine resplendently. Its hues illumine succeeding glyptic accomplishments through the ages. They have crystallised in its celebrated apogee at Lepakshi in a refulgent national expression The young author Shri C. POORNACHAND registers coherently in his book this fascinating panorama.

It is no less a task to write on Lepakshi temple and its plastic art. Fully conscious of his limitations, the author has expressed himself candidly and has made the book informative and impressive. Readers of this book "LEPAKSHI — *Vastu Silpa Chitra Lekhanalu*" will appreciate his method of approach, his clarity of ideas and his comparative treatment. I am glad he has chosen to study the Lepakshi temple which requires fund of knowledge. I am sure this study will be useful to art-lovers and laymen alike and receive their approbation which is deserved mostly.

**Dr. K. Krishna Murthy**
M.A ,Ph.D.,D.Litt.,F.R.A S (Lond)
*Superintending Archaeologist*
*Archaeological Survey of India*
*Temple Survey Project (S.Regn.)*
MADRAS-600 009

# ముందుమాట

చరిత్రలో ఏదశలోనైనా కళలూ మొదలయిన వ్యవస్థ వుపరితల అంశాలు అభివృద్ధి చెంది వున్నతిని సాధించాయంటే అప్పటి ఆర్థిక, రాజకీయ పరమైన స్థిరత, దృఢత్వం అందుకు కారణాలుగా వుంటాయి. దక్షిణ భారతదేశంలోని విజయనగర సామ్రాజ్యం అలాంటి రాజకీయమైన, ఆర్థికమైన గట్టిపునాదులతో రూపొందబడింది. అందుకు తార్కాణంగానే అప్పటి శిల్ప, చిత్రలేఖన, సాహిత్యాది కళారంగాలు ఎంతో వైభవోన్నతిని చాటుతూ నేటికీ సజీవంగా మిగిలివున్నాయి.

క్రీ. శ. 1336వ సంవత్సరాన సంగమ వంశీయులు మొదటి హరిహరరాయలు, కంపన, మొదటి బుక్కరాయలు విజయనగరసామ్రాజ్యాన్ని స్థాపించారు. ఇది దక్షిణ భారతదేశంలో గొప్ప చరిత్ర, సంస్కృతి కలిగిన చిట్టచివరి హిందూ రాజ్యంగా పేర్కొనవచ్చు. విజయనగర రాజులలో ముఖ్యులుగా శ్రీకృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలును చెప్పుకోవచ్చు. శ్రీకృష్ణదేవరాయలు పరాక్రమవంతుడు, పరిపాలనాదక్షుడు మాత్రమేకాక స్వయంగా కవీ, పండితుడూను. ఆయన శిల్ప, చిత్ర, నాట్య, సంగీత, సాహిత్యాది కళల నాదరించి పోషించాడు.

లేపాక్షి, హంపీ, తాడిపత్రి, పెనుగొండ, పుష్పగిరి, ఒంటిమిట్ట, వల్లూరు, మార్కాపురం, సోంపాలెం, తిరుపతి, తిరుమల, శ్రీకాళహస్తి, నారాయణవనం, నాగలాపురం, శ్రీనివాస మంగాపురం, శ్రీశైలం, శ్రీరంగం, అహోబిలం, వేలూరు, చిదంబరం, తిరువణ్ణామలై మొదలయిన ప్రాంతాలలోని ఆలయాలువిజయనగర కాలంలో నిర్మించబడ్డాయి. శిల్ప, వర్ణ చిత్రలేఖనాలకు సంబంధించి విశిష్టమైన సౌందర్యానికి పరిపూర్ణతకు పేరెన్నిక గన్నాయి.

'లేపాక్షి' ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా, హిందూపురం తాలూకా కేంద్రానికి 8 మైళ్ళ దూరంలోవుంది. లేపాక్షి వీరభద్రాలయం విజయనగర కాలంనాటి శిల్ప సంపదకు, వర్ణచిత్రాలకు నిలయం.

లేపాక్షి వీరభద్రాలయం చాలామంది చరిత్రకారులను, చరిత్ర పరిశోధకులను ఆకర్షించింది. కానీ వీరందరి పరిశీలన ఆలయానికి సంబంధించిన బాహిర్వర్ణనలకు మాత్రమే పరిమితమయింది. వీరంతా వాస్తు పరిణామ చరిత్రగానీ, శిల్ప సాంకేతిక చరిత్రకానీ దృష్టిలో వుంచుకొని సమగ్ర పరిశీలన చేయలేదు. లేపాక్షి చిత్రలేఖనాలను, అందులోని ప్రధాన సాంకేతిక విలువలను, విజయనగర వర్ణచిత్ర రీతులను,ఆచిత్రాలలో ప్రతిబింబించే ఆనాటి సంస్కృతి, నాగరికతా విశేషాలను లోతుగా, విశ్లేషణాత్మకంగా అధ్యయనం చేయడానికి ప్రయత్నించలేదని తెలుస్తోంది. కాబట్టి పైన పేర్కొన్న లోపాలన్నిటిని పరిహరించుకొంటూ వాస్తు, చిత్ర, శిల్పకళా చరిత్రల నేపథ్యంలో లేపాక్షి వీరభద్రాలయాన్ని సమగ్రంగా పరిశీలించేందుకీ వ్యాసంలో ప్రయత్నం జరిగింది. ఒక కాలంలోని ఆలయాలను తదితర విశేషాలను పరిశీలించేటప్పుడు దాని పూర్వ, సమకాలీన, శిల్ప, చిత్రలేఖన నిర్మాణాపరమయిన సాంకేతిక విలువలతో తులనాత్మకంగా పోల్చాల్సి వుంటుంది. లేపాక్షి వీరభద్రస్వామి ఆలయ ప్రాముఖ్యతను అ విధంగా సహేతుకంగా నిరూపించడానికి చేసిన ప్రయత్నమూ, శ్రమా ఫలితమే యీవ్యాసంగా రూపుదిద్దుకొని మీముందుంది.

రచయిత

నాలో పరిశోధనా జిజ్ఞాసను రగిల్చి, వెన్నుతట్టి ప్రోత్సాహమిస్తూ చేసినవారు, యీ రంగంలో నాకు తొలినుంచి నేతృత్వం వహించినవారు, స్వయంగా చరిత్ర పరిశోధనా తత్పరులు, ఉత్తమ ఉపాధ్యాయులు, సౌజన్యమూర్తి, నాకాత్మీయులు డాక్టర్. వై. గోపాల రెడ్డి (లెక్చరర్, యస్. కె. ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గూడూరు) గారికి....

ఈ వ్యాసానికి 'Fore word' వ్రాసిన డా॥ కె. క్రిష్ణమూర్తి గారికి....

స్నాతకోత్తర విద్యార్థిదశనుంచి విద్యైకరంగంలో నాకు గురువైన డాక్టర్. వి. కామేశ్వరరావు (ప్రొఫెసర్, చరిత్రశాఖ, యస్. వి. యు. కాలేజ్, తిరుపతి) గారికి....

తొలినుంచి యీ ప్రయత్నంలో అనేక విధాలుగా సహకరించి, నాఅభివృద్ధిని ఆకాంక్షించే నాఆత్మీయ డి. కిరణ్ క్రాంత్ చౌదరి(లెక్చరర్, ఇండియన్ కల్చర్, యస్. వి. యు. కాలేజ్, తిరుపతి) కి....

వ్యాసానికి స్పష్టమైన, సరళమైన, సమగ్ర ఆకృతి నివ్వడానికి సహకరించిన నా మిత్రుడు డాక్టర్. కె. యస్. పసులాడు....

చరిత్ర విద్యార్థినిగా తనకు గల సహజ ఆసక్తితో యీ రచనను ప్రోత్సాహాన్నందించిన నా శ్రీమతి కె. వేదవతీదేవి ఎం.ఏ., బి.ఇడి., కి

ముఖపత్రరచన చేసిన ఆర్టిస్ట్ చంద్ర (హైదరాబాదు) గారికి....

దీన్ని వెలుగులోకి తేవడానికి ఆర్థిక సహాయంచేసిన తిరుమల - తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారులకు....

ఈ పుస్తకం అందంగా రూపుదిద్దుకోవడానికి కారకులైన శ్రీ యం. గురుమూర్తి (గురు ఏజన్సీస్, తిరుపతి), శ్రీ యం. మణి (మణి స్టుడియో, తిరుపతి), ఓంకార్ ప్రింటర్స్ (తిరుపతి) యాజమాన్యానికి, సిబ్బందికి, యింకా....

కృతజ్ఞతలు

# విషయ సూచిక

మొదటి అధ్యాయం

# చారిత్రక అంశాలు

లేపాక్షి, ఆంధ్రప్రదేశ్ అనంతపూర్ జిల్లా, హిందూపూర్ తాలూకా కేంద్రానికి తూర్పుగా 8మైళ్ళ దూరంలో వున్న చిన్న గ్రామం. శాసనాలలోను, గ్రంథాలలోను దీనిని లేపాక్షి నగరం లేక పాప వినాశేశ్వర క్షేత్రమని పేర్కొనబడింది. స్కాంధపురాణంలో యిది 108 శైవ క్షేత్రాలలో వొకటిగా వివరించబడింది. ఈ గ్రామానికి దక్షిణంగా వున్న కొండ కూర్మాకారంలో వుండడం చేత దీనిని కూర్మశైలం అని కూడా అంటారు. లేపాక్షి విజయనగర ప్రభువుల కళాభిమానానికి మచ్చు తునకగా ప్రసిద్ధి చెందిన 'వీరభద్రస్వామి' ఆలయానికి నిలయం. ఈ ఆలయ ప్రాంగణంలో పాపవినాశేశ్వర, రఘునాథ, వీరభద్ర, కాళి మొదలయిన ఆలయాలున్నాయి. విజయనగర శిల్పాలకు, వర్ణ చిత్రాలకు యిది ప్రసిద్ధ కళానిలయంగా చెప్పవచ్చు.

## శాసనాధారాలు :

శాసనాల ప్రకారం లేపాక్షి అనే గ్రామం పెనుగొండ రాజ్యం లోని పడమటి వెంతె భాగంలో రొడ్డనాడు అనే చిన్న విభాగంలో వుంది. పెనుగొండలో దొరికిన శాసనాలలో లేపాక్షి గురించి వివరించబడింది. అప్పట్లో లేపాక్షి గొప్పకీర్తి కలిగి వుండటమే గాకుండా స్థల విభాగానికి ముఖ్య స్థావరంగా కూడా వుండేది. రొడ్డనాడు లోని స్థలాలలో లేపాక్షి స్థల విభాగం చాలా ముఖ్యమైంది. అప్పటి పెనుగొండ రాజ్యమంటే యిప్పటి అనంతపూర్ జిల్లాలోని హిందూపూర్, పెనుగొండ, మడకసిర తాలూకాలు. పైమూడు తాలూకాలలో అక్కడక్కడ లభించిన శాసనాల వలన నాటి పెనుగొండ, లేపాక్షిల స్థితిగతులు తెలుస్తున్నాయి.

ఇక్కడ దొరికిన తొలి శాసనాల ప్రకారం హిందూపూర్, మడక సిర తాలూకాలను నొలంబరాజులు పాలించారు. వీరు గాంగరాజులు, రాష్ట్రకూటులు, చోళులు, పశ్చిమ చాళుక్యుల క్రింద సామంతులుగా

పాలించేవారని తెలుస్తోంది. పర్వాలికాలంలో (క్రీ.శ.9-10శతాబ్దాలలో) నొలంబరాజులు చాలా పరాక్రమవంతులై హిందూపూర్ ప్రాంతాన్ని పాలించారు. కానీ లేపాక్షి వీరి ఏలుబడిక్రింద వుండినదీ, లేనిదీ ఖచ్చితంగా తెలియడంలేదు. నొలంబరాజుల తర్వాత పెనుగొండ రాజ్యాన్ని చోళులు, పశ్చిమ చాళుక్యులు, హొయసలలు పాలించారు. హిందూపూర్, మడకసిర తాలూకాలలో చోళుల శాసనాలులభించాయి. బూదిలిలో లభించిన శాసనం ప్రకారం యీ ప్రాంతాన్ని చోళులు పాలించినట్లు తెలుస్తూంది. యర్రగుంట శాసనం ప్రకారం మహామండలేశ్వర యిరుగున దేవచోళ మహారాజు యర్రగుంటే అనే గ్రామాన్ని వీరభద్రునికి దత్తుగా యిచ్చినట్లు తెలుస్తూవుంది. శక 1148 అమరాపురం శాసనం మహామండలేశ్వర త్రిభువనమల్ల యిరుంగోల దేవచోళ మహారాజును గురించి తెలుపుతుంది. హేమావతి, కొట్టశివారం, మడకసిరలలో, మూడవ కులోత్తుంగ, రాజేంద్ర కాలంనాటి శాసనాలు లభించాయి. శక 1084, 1090, 1091, 1197 సం॥లలో పశ్చిమ చాళుక్యుల హేమావతి, కొర్రేవు, మడుడి, పాతశివారం మొదలైన ప్రాంతాలలోని శాసనాలు విక్రమదేవ, జగదేకమల్ల, వీరసోమేశ్వరుల పరిపాలనగురించి తెలుపుతున్నాయి. శిరివరం, సంజీవరాయునిపల్లె, తూనేపల్లి, కొడెగపల్లి, పరిగి, అలుడి, హేమావతి, సరజమ్మనహళ్ళి మొదలయిన హిందూపూర్, మడకసిర తాలూకాలలో హొయసల మూడవ వీరబల్లాలుని కాలంనాటి శక 1243, 1245, 1250, 1262వ సంవత్సరాలకు సంబంధించిన శాసనాలు లభించాయి. ఈ శాసనాలలో లేపాక్షి గురించి గానీ, వీరభద్రస్వామిని గురించి గానీ వివరించలేదు. కాబట్టి లేపాక్షిగాని, వీరభద్రాలయంగాని చోళుల, పశ్చిమ చాళుక్యుల, హొయసలుల కాలంలో వెలసి వుండలేదని నిర్ధారణ అవుతూ వుంది.

క్రీ.శ. 14వ శతాబ్దం మూడవ భాగంనుండి పెనుగొండ రాజ్యం విజయనగర రాజుల ఏలుబడిలో వున్నట్లు కొన్ని ఆధారాలను బట్టి తెలుస్తూవుంది. అనంతపూర్ జిల్లా, హిందూపూర్ తాలూకాలో విజయ

సంగమరాజుల పూర్వకాలానికి సంబంధించిన శాసనాలు చిలమత్తూరు (శక 1289) కొండాపురం (శక 1301) మారెడ్డిపల్లె (శక 1305) గొనివారిపల్లె (శక 1339) కొటిపి (శక 1354) మొదలైన ప్రాంతాలలో లభించాయి. ఇవి వీర బుక్కరాయ, హిరీయదేవరాయ, దేవరాయ మొదలయిన ప్రభువుల కాలంనాటివి. పైన కనబరచిన విజయనగర కాలంనాటి వివిధ శాసనాలలో కూడ లేపాక్షి గురించి వివరణ లేదు.

భారతీయ పురావస్తుశాఖ (దక్షిణ విభాగం) యీ మధ్యకాలంలో లేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలోని అధిష్ఠాన భాగంలో శాసనం కనుగొనింది. ఇప్పటి వరకు కనుగొన్న శాసనాలన్నిటి కన్నా యీశాసనం ప్రాచీనమైనది. ఈ శాసనం ప్రకారం విజయనగర ప్రభువైన సాళువ నరసింహ లేపాక్షి వీరభద్రాలయాన్ని కొన్ని మరమత్తులు చేసినట్లు తెలుస్తూవుంది. మాదవగుండ కుమారుడైన సాళువ నరసింహ విజయనగర సింహాసనాన్ని క్రీ.శ. 1486వ సంవత్సరం అధిరోహించి క్రీ.శ. 1492వ సంవత్సరం వరకు పాలించారు. వీరభద్రాలయం కాలాన్ని కనుగొనేందుకు యీ శాసనం ఎంతో వుపయోగపడ్తుంది.

పైన తెలిపిన సాళువనరసింహుని శాసనమే కాకుండా యింకా 17 శిలాశాసనాలు, 4 తామ్రశాసనాలు లేపాక్షిలో లభించాయి. ఇందులో 15 శిలాశాసనాలు అచ్యుతదేవరాయల కాలానికి సంబంధించినవి. ఈ శాసనాల ద్వారా వీరభద్రాలయానికి సంబంధించిన ఎన్నో ఆసక్తికరమైన విషయాలు తెలుస్తున్నాయి. ఈ ఆలయం అచ్యుతదేవరాయల కాలంలో ఎంతో అభివృద్ధి చెందింది. శక 1450వ సంవత్సర శాసనం ప్రకారం రెండు గ్రామాలను వీరేశ్వరాలయానికి అచ్యుతదేవరాయ ఇచ్చినట్లు తెలుస్తూవుంది. మరొక శాసనం (శక 1453) ప్రకారం యిద్దేప్రభువు విరూపణ్ణ కోరికమేరకు చెలువిందలనేక అచ్యుతరాయపురమనే గ్రామాన్ని విరూపాక్షస్వామి సమక్షంలో లేపాక్షి వీరభద్రస్వామికి, రఘునాథాలయానికి, పాప వినాశేశ్వరునికి దానంగా యిచ్చినట్లు తెలుస్తున్నది. అచ్యుత

దేవరాయలకు సంబంధించిన మరొక శాసనంలో హంపసహళ్ళి, పంపల్లి హళ్ళి, తిమ్మగౌండనహళ్ళి అనే మూడు గ్రామాలు లేపాక్షి వీర భద్రాలయ పోషణకుగాను దాన మిచ్చినట్లు తెలుస్తూంది. శక 1456వ సంవత్సరపు శాసనం ప్రకారం వీరేశ్వరదేవపురంలో ప్రతి ఆదివారం జరిగే సంతలో వ్యాపారస్థుల నుండి వసూలు చేసే సుంకం, మరియు హరునాడు, హోసుర నాడులలో సుంకం పెంచగా వచ్చే ఆదాయాన్ని లేపాక్షిలోని వీరేశ్వర, రఘునాథేశ్వర, పాపవినాశేశ్వరుల పోషణకు వుపయోగించినట్లు తెలుస్తూంది.

అచ్యుత దేవరాయలకాలంలో వున్నరాధికారి అయిన పెనుగొండ విరూపణ్ణ లేపాక్షి వీరభద్రస్వామికి గొప్ప సేవచేశాడు. ఇతడు లేపాక్షి నందిలక్కిశెట్టి, ముద్దమ్మల కుమారుడు. ఇతడు అచ్యుత దేవరాయ ప్రభువద్ద ద్వారపాలకుడుగా తన జీవితాన్ని ప్రారంభించి, మెల్ల మెల్లగా స్వయం శక్తితో ద్వారపాలక పనినుండి పెనుగొండ, చంద్ర గిరి లలో అధికార పదవుల్ని పొందాడు. విరూపణ్ణ లేపాక్షిలోని వీరేశ్వరుని భక్తుడు. స్వామి భక్తుడుగా, ఆరాధకుడుగా యితడు చేసిన సేవలను శాసనాలద్వారా తెలుసుకోవచ్చు. లేపాక్షిలోని శక 1459వ సంవత్సరపు శాసనంలో విరూపణ్ణ కలనూరులోని కొంత భూమిని కొని వీరభద్రస్వామికి దానమిచ్చినట్లు వివరించబడింది. శక 1460వ సంవత్సరానికి సంబంధించిన శాసనం చిక్కనాది చెఱువు లేదా దేవరాయ పురం అనే గ్రామాన్ని విరూపణ్ణ స్వామికిచ్చినట్లు చెప్పుచున్నది. శక 1461వ సంవత్సరపు తామ్రశాసనంలో అచ్యుతదేవరాయల గౌరవార్థం పెనుగొండ విరూపణ్ణ కొత్తూరు అనే గ్రామాన్ని బ్రాహ్మణులనుండి కొని లేపాక్షి వీరభద్రుని పోషణ కొసగినట్లు చెప్పబడినది. వెంకటాద్రిరాయ మహారాజ గౌరవార్థం పెనుగొండ విరూపణ్ణ నారాయణ పురంలో కల్యాణ వెంకటేశ పెరుమాళ్ ఆలయం నిర్మించెను. అంతే గాక అచ్యుత దేవరాయల గౌరవార్థం తిరుపతి, శ్రీకాళహస్తి ఆలయాల పోషణకు ఎన్నో గ్రామాల నొసగెను.

సదాశివరాయల (శక 1471) శాసనంలో లేపాక్షి స్వామికి కొంత దాన మొసగినట్లు తెలుపబడినది. లేపాక్షిలోని పర్వాలిపాలెం నాటి (శక 1600) శాసనం కుతుబ్‌షాహీ సుల్తానులది. దీని ప్రకారం కొంత భూమిని సుల్తానుల గౌరవార్థం లేపాక్షిలోని శెట్లు, కరణాలు సంత నంజుండేశ్వర స్వామికి దాన మొసగినట్లు తెలుస్తూవుంది. శక 1602వ సంవత్సరానికి సంబంధించిన తామ్రశాసనం పెనుగొండలో లభించినది. ఇందులో లేపాక్షికి సంబంధించిన శాసనాలు కలవు. కర్ణాటక పాలనాధికారి పెనుగొండ రాజ్యంలోని కొంతభూమిని లేపాక్షి ఆలయ ఆరాధ్యుడైన కుమరయ్య కొసగినట్లు తెలుపబడినది. అంతేగాక కొన్ని వస్తువుల మీద, జంతువులమీద మరియు పెళ్ళిళ్ళవలన వచ్చే సుంకాలను స్వామి వారి ధూప, దీప, నైవేద్యాల కోసం కుమరయ్య కొసగినట్లు తెలుస్తున్నది. బహుశ లేపాక్షిని గురించి తెలిపే చివరి శాసనం యిదే కావచ్చు.

ఇప్పటివరకు లేపాక్షిలోను, పరిసర ప్రాంతాలలోను లభించిన శిలాశాసనాల గురించి వివరించడం జరిగింది. ఈ క్రింద లేపాక్షి ఆలయ ప్రాంగణంలో లభించిన ఐదు తామ్ర శాసనాలలోని విషయాలను తెలుసుకొందాం. ఇందు మొదటిది (శక 1346) ప్రౌఢదేవ మహారాజు కాలం నాటిది. దీని ప్రకారం కొత్తూరు లేదా ప్రౌఢదేవ రాయపురం అనే గ్రామాన్ని వేదపండితుని కొసగినట్లు తెలుస్తూవుంది. మరొక తామ్ర శాసనం (శక 1361) దేవరాయల కాలానికి సంబంధించినది. దీని ప్రకారం గనద్రి రాజ్యంలోని తుంబెకల్లు విభాగంలోని కొత్తూరు అనే గ్రామాన్ని దేవనార్య అనే బ్రాహ్మణునికి వొసగినట్లు చెప్పబడినది. శక 1455, 1461వ సంవత్సరాల రెండు శాసనాలలో లప్పుశెట్టి కుమారుడు మానిక్‌శెట్టి మనుమడైన విరూపణ్ణ కొన్ని గ్రామాలను లేపాక్షి వీరభద్రాలయాన్ని కొసగినట్లు తెలుపబడింది. ఇక చివరిది శక 1463వ సంవత్సరపు శాసనంలో సిరివర, మంచనహళ్ళి, మయినాయకహళ్ళి అను గ్రామాలను లేపాక్షి వీరభద్రస్వామికి ప్రతిరోజు పూజలకు మరియు సంవత్సరాని కొకసారి జరిగే తేరోత్సవానికి వొసగినట్లు తెలుపబడింది.

ఇప్పటి వరకు వివరించిన శాసనాధారాలను బట్టి లేపాక్షి పెను
గొండ రాజ్యంలోని రొద్దనాడులోని భాగంగా చెప్పవచ్చు. విజయనగర
కాలంలో యిది స్థలం విభాగానికి కేంద్రం. ఈ పెనుగొండ రాజ్యం
(అనంతపూర్ జిల్లా) నొలంబ, పశ్చిమ గాంగుల, చోళ, పశ్చిమ
చాళుక్య, హొయసల, విజయనగర, కుతుబ్‌షాహి మొదలైన రాజ్యాధి
నేతల పాలనను చవిచూసింది. కాని విజయనగర కాలానికి ముందు
లేపాక్షి ఏ స్థితిలో వుండేదో తెలియదు. లేపాక్షి గురించి తెలిపే మొట్ట
మొదటి ఆధారం సాళువ నరసింహునికాలంలో (క్రీ.శ. 1486-1492)
లేపాక్షి వీరభద్రస్వామి ఆలయాన్ని మరమ్మత్తులు చేసినట్లు శాసనం
ద్వారా తెలుపబడింది [Itihas, Journal of the Andhra
Pradesh Archieves, Vol. II, 1974, P. 69]. కాబట్టి యీ ఆల
యాన్ని సాళువనరసింహుని పరిపాలనకు కొంతకాలం ముందే నిర్మించి
వుండవచ్చు. అయినప్పటికీ అచ్యుత దేవరాయలు మరియు క్రింది అధి
కారి అయిన పెనుగొండ విరూపణ్ణల కాలంలో యిది పరిపూర్ణ స్థితికి
చేరటమే గాకుండ విజయనగర శిల్పాలను, కళను, వర్ణ చిత్రాలను విజ
మైన నిదర్శనంగా మనకీనాడు మిగిలివుంది.

## పురాణగాథలు :

లేపాక్షి అనగా 'నాశనం కాని నేత్రం' లేదా నేత్రాన్ని వర్ణ
చిత్రంలో చూపటం అని అర్థం [S.G K. Murthy, The Art of
Lepakshi, Hyderabad, P.I ] లేపాక్షి గురించి చాలాకథలు
వాడుకలో వున్నాయి. సీతారాములు అరణ్యవాసం చేసేటప్పుడు ఒక
రోజు రావణుడు రాముడు లేని సమయంలో సీతనపహరించుకొని వెళ్తు
తగా జటాయువు అను పక్షి అడ్డుపడి రావణునిచేత దెబ్బతిని క్రింద పడి
పోతుంది. సీతను వెతుకొంటూ వచ్చిన రామునికి జటాయువు సీతజాడ
తెలుపగా రాముని హృదయం కరిగి పక్షిని 'లే పక్షి' అన్నాడని, వెంటనే
పక్షి లేచి ఎగుర గలిగిందనీ, లే పక్షి రాను రాను 'లేపాక్షి' అయిందని
ఎస్. గోపాలక్రిష్ణమూర్తిగారు వివరించారు [S. G. K. Murthy,

'The Art of Lepakshi, P.2]. ఋగ్వేద రచన కర్త అయిన
గస్త్యముని చిన్న ఆలయాన్ని కూర్మశైల దగ్గర నిర్మించాడు. కాబట్టి
ది దక్షిణ భారతదేశంలోని శైవ క్షేత్రాలలో పాతది అయిందట
. Gopal Rao, Lepakshi, Hyderabad, 1970, P.45]
రి కొందరి అభిప్రాయం ప్రకారం—'లేపాక్షి' అంటే లేపనములు గం
క్షులు కలది. ఇక్కడ వర్ణ చిత్రాలందు స్త్రీల నయనాలు లేపనంతో
ందంగా తీర్చిదిద్ది నట్లుండటం చేత దీనికి లేపాక్షి అనే పేరువచ్చిందట.
. కృష్ణమూర్తి, రాయలసీమలోని ముఖ్యదేవాలయాలు, తిరుపతి,
82, P.77).

ఇప్పటికీ యీ ఆలయ నిర్మాణాన్ని గురించి వచ్చే కథనుబట్టి
నుగొండ కోశాధికారి అయిన విరూపణ్ణ మొదట విజయనగర రాజుల
లువులో ద్వారపాలకుడుగా వుండి ప్రజ్ఞతో అచ్యుతదేవరాయల వద్ద
శాధికారిగా నియమించబడ్డాడు. ఇతనికి లేపాక్షిలో వీరభద్రుని
గ్రహం లభించడంవల్ల విగ్రహం లభించినచోట స్వామికి ఆలయాన్ని
ర్మించాలనుకొన్నాడు. ప్రభువు రాజధానిలోలేని సమయంలో విరూపణ్ణ
శాగారాన్నంతా లేపాక్షి ఆలయనిర్మాణానికి వెచ్చించాడు. ప్రభువుతో
కున్న సాన్నిహిత్యాన్ని పురస్కరించుకొని ప్రభువుకు చెప్పకనే ఆల
న్ని నిర్మించి ప్రభువును ఆశ్చర్యచకితుని చేయాలనుకొని నిర్మాణ
కార్యక్రమాన్ని పూర్తిచేస్తాడు. విరూపణ్ణ అంటే గిట్టనివారు ఆలయం
ర్తయ్యే సమయాన తమ కక్ష సాధింపుకై విరూపణ్ణ కోశాగారాన్ని
చేసి ఆలయం నిర్మించాడని రాజుతో చాడీలుచెప్పి రాజుకు ఆగ్రహం
ించారట. ఇందులోని నిజా నిజాలు తెలుసుకోకుండానే ప్రభువు
పణ్ణ కళ్ళు తీయమని సేవకుల నాజ్ఞాపిస్తాడు. ఇది తెలుసుకొన్న
పణ్ణ స్వామి భక్తి పరాయణుడు కాబట్టి రాజాజ్ఞను తానే ఆచరించ
పెట్టి తనకళ్ళను తానే పూడబెరుకు కున్నాడట. ఈ ఆలయ ముఖ
తప దక్షిణ ద్వారం దగ్గర యీనాటికీ రెండు నల్లని మరకలు కని
యి. ఈ మరకలను విరూపణ్ణ తన కళ్ళనూడబెరికి విసరివేయగా

అని గోడను ఒరిసిన పోటుగా చెప్తుంటారు. కాబట్టే కళ్యాణమండపం అర్ధాంతరంగా ఆగిపోయిందట. ఇప్పటికీ గ్రుడ్డి విరూపణ్ణ ఆత్మ గుడి చుట్టూ తిరుగుతూ వుంటుందట [V. Kameswara Rao, Select Vijayanagaia Temples of Rayalaseema, Hyderabad, 1976, P. 77; The Lepakshi Temple, P.1 ; S.G.K. Murthy, Ihe Art of Lepakshi, P.6].

ఇది కేవలం కట్టుకథ మాత్రమే. ఏ మాత్రమూ నమ్మశక్యం కాదు. ఆలయ నిర్మాణం తర్వాత కూడా విరూపణ్ణకు రాజుతో సత్సంబంధాలున్నట్లు శాసనాలద్వారా తెలుస్తోంది. అలాగే ప్రభువు కూడా లేపాక్షి వీరభద్రస్వామికి అంగ, రంగ, భోగాలకు కొన్ని గ్రామాలు దానమిచ్చినట్లు తెలుస్తోంది. లేపాక్షిలో లభించిన క్రీ.శ. 1532వ సంవత్సరపు శాసనం ప్రకారం విరూపణ్ణ కోరిక మేరకు అచ్యుత దేవరాయలు లేపాక్షి వీరభద్ర, రఘునాథ, పాపవినాశేశ్వరులకు దాన మిచ్చారు. క్రీ.శ. 1534వ సంవత్సరపు తామ్రశాసనం ప్రకారం విరూపణ్ణ కోరికమేరకు ప్రభువు పెనుగొండ రాజ్యంలోని హంబనహళ్ళి, కప్పలేహళ్ళి, తిమ్మగొండనహళ్ళి అనే మూడు గ్రామాలు లేపాక్షి వీరభద్రుని కిచ్చాడు. ఇంకొక తామ్రశాసనం ప్రకారం (క్రీ.శ. 1540) పెనుగొండ మహీపతిఅయిన విరూపణ్ణ కొత్తూరు గ్రామాన్ని వీరభద్రుని కిచ్చినట్లు తెలుస్తుంది. పై శాసనాధారాలను పరిశీలిస్తే రాజాజ్ఞ మేరకు విరూపణ్ణ 'తనకు తానే కళ్ళు పొడచుకుని గోడమీదికి విసిరేయడం' కల్పితమని నిశ్చయంగా చెప్పవచ్చు.

లేపాక్షి వీరభద్రాలయంలో చాలా ముఖ్యమైనదైన కళ్యాణ మండపం పూర్తి కాలేదన్నది మాత్రం నిజం. కాని దానికి పైన తెలిపినకథ కారణం కాదు. ఎందుకు కళ్యాణమండప నిర్మాణం అర్ధాంతరంగా ఆగిపోయిందో చెప్పటం పెద్ద కష్టంకాదు. శ్రీకృష్ణదేవరాయల శౌర్యపరాక్రమాలకు అణగివుండిన గజపతిరాజు, ఇతని ముస్లిం అనుచరులు మరలా పొక్కడై పోయిన ఖ్యాతిని తిరిగి సంపాదించు

కొనేందుకు గాను అచ్యుత దేవరాయల రాజ్యంపై దండయాత్ర చేశారు. క్రీ.శ. 1530 లో అచ్యుతదేవరాయలు వీరిని ఓడించాడు. దేవకాపుర శాసనం ప్రకారం అచ్యుతదేవరాయలు మహమ్మదీయులను, హిందూ రాజులను ఓడించిన విజేతగాను, రాజులకే రాజుగాను, సింహళ రాజు కూడా యితనికి కప్పం చెల్లించేవాడనీ తెలుస్తుంది. కాబట్టి అచ్యుత దేవరాయల కాలంలో గజపతి రాజులతోను, మహమ్మదీయ కూటమి తోను ఎడతెగని యుద్ధాల వలన శాంతి సహనాలతో బాటు ఆర్థికంగా కూడ చాలావరకు నష్టపోవలసి వచ్చింది. కాబట్టి యిలాంటి పరిస్థితులలో అచ్యుతదేవరాయలు కానీ, విరూపణ్ణ కానీ లేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలోని కల్యాణమండపం పూర్తి చేయలేక పోయి వుండవచ్చు.

# వాస్తు

దక్షిణ భారతదేశంలోనే చిట్టచివరిగా గొప్ప చరిత్ర, సంస్కృతిలో వర్ధిల్లింది విజయనగర సామ్రాజ్యం. క్రీ.శ. 1335-'36 లో మొదటి హరిహరరాయలు, కంపన, మొదటి బుక్కరాయలు (సంగమ వంశీయులు) ధర్మాన్ని ప్రబోధించేందుకు హిందూమతాన్ని పునరుద్ధరించడానికి స్వామి విద్యాతీర్థ ఆశీస్సులతో యీ సామ్రాజ్యాన్ని స్థాపించారు. దీనిని సాళువ, తుళువ ప్రభువులు విస్తరించి మహా సామ్రాజ్యంగా చేశారు. తుళువవంశ రాజైన శ్రీకృష్ణదేవరాయలు అందరిలోకి గొప్పవాడు. ఈ ప్రభువు సర్వసేనానాయకుడు, పరిపాలనాదక్షుడు, కవి, పండితుడు, కళాభిమాని, గొప్ప గొప్ప నిర్మాణాలను చేపట్టినవాడు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో విజయనగర ఖ్యాతి యినుమడించింది. అచ్యుతదేవరాయలు, సదాశివరాయలు ఆకీర్తిని, వైభవాన్ని నిలుపుకో గలిగారు. ఇంతటి మహోన్నత స్థితిలో వుండిన విజయనగర మహా సామ్రాజ్యం క్రీ.శ. 1565వ సంవత్సరంలో జరిగిన తళ్లికోటయుద్ధంలో కోలుకోలేని దెబ్బతినింది. ఉప్పెనలా విజయనగర వైభవాన్ని, ఘనతను తుడిచిపెట్టింది.

విజయనగర ప్రభువులు అన్నిరకాల నిర్మాణ విషయాలలోనూ ఆసక్తి, అనురక్తి చూపించారు. అందుకు తార్కాణాలే యీనాటి దక్షిణ భారతదేశంలోని గొప్ప గొప్ప ఆలయాలు, కోటలు, రాజప్రాసాదాలు.

విజయనగర శిల్పుల ప్రతిభకు, రాజుల అభిరుచికి, ఆదరణకు నిదర్శనాలే లేపాక్షి, హంపి, శ్రీరంగం, తిరుపతి, తిరుమల, శ్రీకాళహస్తి, పెనుగొండ, తాడిపత్రి, మార్కాపురం, ఒంటిమిట్ట, పుష్పగిరి, గండికోట, వల్లూరు, సోంపాలెం, గోరంట్ల, చినకోపర్ల, నాగలాపురం, మంగాపురం, నారాయణవనం, అహోబిలం, తిరువణ్ణామలై, వేలూరు, చిదంబరం మొదలయిన ప్రాంతాల్లోని ఆలయాలు,

లేపాక్షిలోని వీరభద్రస్వామి ఆలయంలోని వాస్తు, శిల్పం, వర్ణ చిత్రాలు చూడడానికి వొక పెద్ద ప్రదర్శనశాలలాగా వుంటుంది. ఆనాటి కళాకారుల నేర్పు, నైపుణ్యం, కళాభినివేశం మనకు చాలాఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలగజేస్తాయి.

ఆలయాలు గురించి వివరించేటప్పుడు వివిధ భాగాలను గురించి అవి ఆలయంలో ఎక్కడెక్కడ వుండవలసినదీ చెప్పవలసి వుంటుంది. ప్రాకారాలు, గోపురద్వారాలు, మరి యితర భాగాల గురించి అంటే ఉపాలయాలు, కల్యాణమండపం మొదలైన ఆలయ భాగాల గురించి యీ అధ్యాయంలో విపులీకరించటం జరిగింది. విజయనగర వాస్తును గురించి వివరించేటప్పుడు వారేకాలంనాటి వాస్తు పద్ధతులను చూచి వుత్తేజితులైనారో తెలుపుతూ వాటిని ప్రేరకాలుగా, మార్గదర్శకాలుగా స్వీకరించి యీ వాస్తు పద్ధతుల్ని ఏవిధంగా వాడుకొన్నారో వివరించటం జరిగింది.

## ప్రాకారాలు :

లేపాక్షిలోని వీరభద్రాలయం చిన్న కొండమీద నిర్మించబడింది. ఇది చూడడానికి కూర్మాకారం కలిగి వుండటం చేత కూర్మశైల అనికూడా అంటారు. ఈఆలయానికి రెండు ప్రాకారాలు కలవు. ఈ ప్రాకార గోడలు బాగా మలచిన పెద్ద పెద్ద రాతి దిమ్మలతో కట్టబడినాయి. వెలుపల వున్న ప్రాకారం స్థూలమైనదిగావుండి సుమారు 25 అడుగుల ఎత్తుంటుంది. ఈ ప్రాకారం మధ్య మధ్యలో చిన్న చిన్న ఆలయాలు యిటుక, సున్నంతో నిర్మించబడి వున్నాయి. బహుశ వొకప్పుడీ ఆలయాలలో దేవుళ్ళ ప్రతిమలుండి వుండవచ్చు. ఈ ప్రాకారాన్ని ఆనుకొని లోపలిభాగంలో స్తంభాలతో నిర్మించిన వసారావుంది (ఫోటో.2). లోపలున్న రెండవ ప్రాకారం కూడా యిలాగే వుంది కానీ చాలా వరకు శిధిలమైంది.

మిగిలిన విజయనగర ఆలయాలలోకూడా స్థూలమైన ప్రాకారాలు వొకటి లేదా అంతకన్నా ఎక్కువ కనిపిస్తాయి. అందులో హంపీలోని

పసుపతి, హజారారామ, విఠల, అచ్యుతరాయ ఆలయాలలోని ప్రాకారాలు చాలా పెద్దవి. ఇంకా గోరంట్ల, ఒంటిమిట్ట, పుష్పగిరి, చంద్రగిరి, కదిరి, తిరుపతి, తాడిపత్రి, శ్రీరంగం, వేలూరు, నాగలాపురం, మార్కాపురం, శ్రీకాళహస్తిలలోని విజయనగర ఆలయాలలో ప్రాకారాలు కనిపిస్తాయి. శ్రీశైల మల్లికార్జునాలయం, హంపీలోని హజారారామాలయం ప్రాకారాల వెలుపలి గోడలు చాలా అందంగా శిల్పాలతో అలంకరించబడి వున్నాయి. ఒక్కొక్కసారి యీ ప్రాకారాలకు వెలుపలి, లోపలి భాగాలలో స్తంభాలతో నిర్మించిన వసారాలుండటం గమనించవచ్చు. మార్కాపురంలోని చెన్నకేశవాలయం, హంపీలోని విఠల, అచ్యుతరాయాలయాలు, తాడిపత్రిలోని వెంకటరమణాలయం, నారాయణవనంలోని వెంకటేశ్వరాలయం మొదలగు ఆలయాల ప్రాకారాల లోపలి భాగాన వసారాలున్నాయి. ఒంటిమిట్టలోని కోదండరామస్వామి ఆలయంలో ప్రాకారానికి వెలుపలి భాగంలో స్తంభాలతో నిర్మించిన వసారావుంది.

ఆలయాలకు ప్రాకారాలు నిర్మించడమనేది బౌద్ధ వాస్తునుండి అలవాటులోవుంది. సాంచిస్తూపానికి చుట్టూ నాలుగు తోరణాలున్నాయి. తర్వాతి కాలంలో హిందువులు దీనినాచరించారు. బాదామి చాళుక్యుల కాలంనాటి ఐహోళే, అలంపూర్ ఆలయాలలో ప్రాకారం కనిపిస్తుంది. తూర్పు చాళుక్యుల, కాకతీయుల ఆలయాలలో కూడా ప్రాకారాలు నిర్మింపబడినాయి. సోమనాథ్‌పూర్ నందలి ప్రాకారంయొక్క లోపలిభాగంలో చిన్న చిన్న వసారాలున్నాయి. దక్షిణ భారతదేశంలో ద్రవిడ శిల్ప పద్ధతులను ప్రారంభించినవారు పల్లవులు. వీరి కాలంనాటి మహాబలిపురం నందలి తీరదేవాలయం చుట్టూ స్థూలమైన ప్రాకారముంది. కంచిలోని కైలాసనాథాలయం కూడా పెద్ద ప్రాకారంతోను లోపలి భాగంలో చిన్న చిన్న గదులూ, స్తంభాలతో నిర్మించిన వసారాను కలిగివుంది. ప్రాకారం పై భాగంలో వరుసగా చిన్న చిన్న శిఖరాలున్నాయి. వైకుంఠ పెరుమాళ్ ఆలయానికి కూడా ప్రాకారం వుంది.

లోపలి భాగంలో దీర్ఘమైన వసారావుంది. వీరి తర్వాత వచ్చిన చోళులు కొంతవరకు పల్లవ సాంప్రదాయాలను ఆలయాల నిర్మాణంలో అనుసరించారు. వీరి కాలంలో ద్రావిడ వాస్తుశిల్పం అత్యున్నత స్థాయికి ఎదిగింది. వీరి ఆలయాలలో ఒకే ప్రాకారం మాత్రం కనిపిస్తుంది. అంతే వివిధ కాలాలనాటి ఆలయాలలో లాగా ఒకటి కన్నా ఎక్కువ ప్రాకారాలు కన్పించవు. కొడుంబలూరు లోని శివాలయం, సింగవరం లోని సుందరేశ్వరాలయం, తిరుక్కలుపూర్ లోని ముచవనేశ్వరాలయం, కిల్యూర్ లోని శివాలయం ప్రాకారాలు కలిగివున్నాయి. తంజావూర్ లోని బృహదీశ్వరాలయం, గంగైకొండ చోళపురాలయం చాలా పెద్ద ప్రాకారాలు కలిగివున్నాయి. తూర్పు చాళుక్యుల ద్రాక్షారామంలోని భీమేశ్వరాలయ ప్రాకారం లోపలి వైపున స్తంభాల వసారావుంది.

హిందూ శిల్పులు దాక్షిణాత్య వాస్తు చూసి ప్రేరితులై హిందూ ఆలయాలలో కూడా ప్రాకారాలు నిర్మించారు. పల్లవ, చోళ ఆలయాలలో స్థూలమైన ప్రాకారాలుండేవి. ప్రాకారానికి లోపలి వైపున స్తంభాల వసారాను నిర్మించడం పల్లవుల కాలంలోనే మొట్టమొదట కనిపిస్తుంది. అంతేగాకుండా వీరి కాలంలోనే ప్రాకారం పైభాగంలో చిన్న చిన్న శిఖరాలు నిర్మించారు. చోళులీవిషయంలో పల్లవుల ననుసరించారు. విజయనగర శిల్పులు ప్రాకార లోపలి వైపు వసారాలు నిర్మించడంలో పల్లవుల ననుసరించారు. విజయనగర ఆలయాలలో కొన్ని ఆలయ ప్రాకార వెలుపలివైపు కూడా స్తంభాలతో నిర్మించిన వసారాలుండటం గమనించవలసిన విషయం. ఇలా వెలుపలివైపు వసారాలు పల్లవ, చోళ, పాండ్యఆలయాలలో కన్పించవు. పెద్ద పెద్ద ప్రాకారాల విషయంలో విజయనగర శిల్పులు చోళుల రీతి ననుసరించారు, ఇవి చూసేందుకు కోటగోడల వలె కన్పించేవి. ఇవి చోళుల ప్రాకారాలను పోలి వున్నప్పటికీ విజయనగర ప్రాకారాలలో కొంత క్రొత్తదనంకూడా వుంది. విజయనగర ఆలయ ప్రాకారాల లోపలి, వెలుపలి గోడలపై వివిధరకాల శిల్పాలు, రామాయణాది పురాణగాథలు మలచబడినాయి.

ఈ పద్ధతి శ్రీశైల మల్లికార్జునాలయం, హంపి హజారారామాలయం ప్రాకారగోడలు గమనిస్తే తెలుస్తుంది.

ప్రాకారాల నిర్మాణానికే పద్ధతి నుపయోగించినదీ తెలుసుకోవటం చాలా ముఖ్యం. ప్రాకార గోడలు నున్నగా మలచిన పెద్ద పెద్ద రాతి దిమ్మెలను లోపల, వెలుపల అడ్డంగావుంచి మధ్యలో యిటుకలు, సున్నంతో నిర్మిస్తారు. ఈ నిర్మాణంలో ముఖ్యంగా గమనించదగ్గది గోడలలో అక్కడక్కడ దీర్ఘ చతురస్రాకారపు రాతి దిమ్మెలనుంచడం. దీనివల్ల ప్రాకారానికి స్థిరత్వం ఏర్పడి గట్టిగా వుంటుంది.

## గోపురద్వారాలు :

గోపురద్వారాలు విజయనగర ఆలయాలలో చాలా గంభీరంగా కన్పిస్తాయి. విజయనగర గోపురద్వారాలను గురించి తెలుసుకొనేముందు గోపురద్వారాల పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడం అవసరం. పురాతనకాలంలో ప్రతి పట్టణానికీ చాలా ద్వారాలుండేవట. చాలా పెద్ద పట్టణాలు నూరుకుపైగా ప్రవేశద్వారాలు కలిగివుండేవట. ఈ ప్రవేశ ద్వారాలు రెండురకాలు — (1) తోరణం (2) గోపురం. ద్వారతోరణం చాలాఅందంగా తీర్చబడివుండి తలుపులేకుండా వుంటుంది. ఇది బహిర్ద్వారంగా వర్ణించబడింది. గోపురం అనేది పట్టణ ద్వారబంధం. 'గోపుర' అను పదం 'గో' (ఆవు) 'పుర' (భద్రనగర పట్టణం) అనే పదాల సమ్మేళనమని కొందరి అభిప్రాయం. కానీ ధాతుకల్ప్రుమ ప్రకారం గోపుర అనేపదం 'గుప' నుండి వచ్చినట్లుగా తెలుస్తుంది. 'గుప' అంటే రక్షించటం లేదా కాపాడటం అని అర్థం (M. K Dhavalikar, Ajanta, A cultural study, Poona, 1973, P.6).

మానసార, మయమతంలో వివిధరకాల గోపురాల గురించి వాటి పరిమాణాలగురించి వివరించబడింది. ద్వారశోభ, ద్వారశాల, ద్వార ప్రాసాద, ద్వారహర్మ్య, ద్వారగోపుర అనే ఐదురకాల ద్వారాల గురించి వివరించబడింది.

ద్వారశోభకు ఒకటి లేక రెండు తలములు, ద్వారశాలకు రెండు నుండి నాలుగు తలములు, ద్వారప్రాసాదకు మూడునుండి ఐదుతలములు, ద్వారహర్మ్యకు ఐదునుండి ఏడు తలములు, ద్వారగోపురకు ఏడునుండి పదహేడు తలములు వుంటాయి.

గోపురంయొక్క క్రింది వెడల్పు భాగాన్ని మూడుగా విభజించవచ్చు. అందులో మధ్య భాగం ద్వారంకోసం ఖాళీగా వుంచబడి వుంటుంది. ఈద్వారం ఎత్తు మామూలుగా ద్వారం వెడల్పుకు రెండింతలుంటుంది.

ఒకతలము కలిగియున్న గోపురవ్యాసం ఆరుభాగాలుగా విభజించబడి అందులో మూడుభాగాలు లోపలి ఖాళీ స్థలానికి, మిగిలిన మూడు భాగాలు గోపుర గోడల మందానికి కేటాయించబడతాయి. రెండుతలములు కలిగియున్న గోపురవ్యాసం ఏడుభాగాలుగా వుండి నాలుగు భాగాలులోపలి ఖాళీ స్థలానికి పోనూ మిగిలిన మూడుభాగాలు గోడల మందానికి కేటాయించబడతాయి. మూడు తలములు కలిగియున్న గోపుర వ్యాసం తొమ్మిది భాగాలుగావుండి నాలుగు భాగాలు లోపలి ఖాళీ స్థలానికి, మూడుభాగాలు గోడల మందానికి పోను మిగిలిన భాగాలు అలింద్రమ కేటాయించబడతాయి. నాలుగు తలములు కలిగియున్న గోపురవ్యాసం పదిభాగాలుగా విభజింపబడి అందులో ఐదుభాగాలు లోపలి ఖాళీ స్థలానికి నాలుగు భాగాలు గోడమందానికి మిగిలిన వొకభాగం అలింద్రమ కేటాయించబడుతుంది. ఏడుతలములు కలిగియున్న గోపురవ్యాసం పదమూడు భాగాలుగా విభజింపబడి అందులో ఎనిమిదిభాగాలు లోపలి ఖాళీ స్థలానికి, మూడుభాగాలు గోడమందానికి యిక మిగిలిన రెండుభాగాలు అలింద్రమ కేటాయింపబడుతుంది (Ram Raj, Essay on the Architecture of the Hindus, Varanasi, 1972, PP. 58 ff).

గోపుర ద్వారాలు హిందూవాస్తులో ఎప్పుడు ప్రవేశించినాయో చరిత్రకారుల మధ్య ఏకాభిప్రాయం లేదు. మహాబలిపురంలోని ద్రౌపది రథ ప్రవేశద్వారం మకరతోరణంలో అందంగా అలంకరించబడింది.

మహాబలిపురంలోని తీరదేవాలయానికి గోపురద్వారముంది. ఇక్కడ మొట్టమొదటి సారిగా తోరణాన్ని గోపురద్వారంగా మార్చటం జరిగిందని ఎస్.ఆర్. బాలసుబ్రహ్మణ్యం అభిప్రాయపడ్డారు (S.R. Balasubrahmanyam, Early Chola Temples, New Delhi, 1971, PP. 331 ff). పల్లవుల ఆలయాలలో ప్రాకారాలు, గోపురాలు మొట్ట మొదటివని వి. కామేశ్వరరావు అభిప్రాయం (V. Kameswara Rao, Select Vijayanagara Temples of Rayalaseema, P.219). ఆర్. ఎస్. గుప్తే అభిప్రాయం ప్రకారం బాదామి చాళుక్యుల కాలంనాటి ఐహోళేలోని కొంటిగుడిలోని గోపురం మొట్ట మొదటిది (R. S. Gupte, The Art and Architecture of Ạihole A study of the Early Chalukyan Art Throuh Temple Architecture and Sculpture, P.14,Fig 2). ఐ. కె. శర్మ నాగార్జున కొండలోని మహాదేవ పుష్పభద్రస్వామి ఆలయానికున్న నాలుగు ద్వారాలు మొట్టమొదటివని వివరించారు (I. K. Sarma, The Development of Early Saiva Art and Architecture (with Special Reference to Andhradesa), Delhi, 1982, P.112). ఆర్. ఎన్. సాలెటోర్ సాంచి స్తూపంనుండే యీపద్ధతి మొదలైందని తెలిపారు (R. N. Saletore, Vijayanagara Art, New Delhi, 1982, P.35) కాని సాంచీ తోరణానికి దక్షిణ దేశంలోని గోపురద్వారానికి చాలా తేడా కనిపిస్తుంది.

ఇక్ష్వాకుల కాలంనాటి పుష్పభద్రస్వామి ఆలయంలోని గోపుర మండపాలు మొట్ట మొదటివిగా చెప్పవచ్చు. తర్వాత ఐహోళే కొంటి గుడిలోని గోపురాలు వెలిసినట్లు తెలుస్తోంది. బాదామి చాళుక్యుల అలంపూర్ విశ్వబ్రహ్మాలయంలో కూడా గోపురాలు కన్పిస్తాయి. ఎల్లోరాలోని కైలాసాలయ ప్రవేశానికి రెండుతలముల గోపురంవుంది. పట్టదక్కల్ విరూపాక్షాలయం కూడా గోపురద్వారం కలిగివుంది. పల్లవుల మహాబలిపురంలోని భీమ, సహదేవ, గణేశరథాలు గోపురాలను కలిగివున్నాయి. తర్వాత తీర దేవాలయంలోనూ, కంచిలోని కైలాస నాథాలయంలోనూ గోపురద్వారం విడిగా కనిపిస్తుంది. పల్లవులకు

మిగిలిన విజయనగర గోపుర ద్వారాలతో పోల్చి ఏరీతిగా అభివృద్ధి చెందాయో పరిశీలించడం వలన లేపాక్షి గోపురద్వారం ప్రాముఖ్యత, స్థానం తెలుస్తుంది.

గోపురద్వారంలో ఉపపీఠం, అధిష్ఠానం, కుడ్యభాగం, కపోతం, శిఖరం ముఖ్యభాగాలు. వీటి పుట్టుపూర్వోత్తరాల గురించి, లేపాక్షి మరియు మిగిలిన విజయనగర ఆలయాలలో యీ భాగాల అభివృద్ధి గురించి యీ క్రింద వివరించబడింది.

**ఉపపీఠం :** ఇది గోపుర క్రిందిభాగం, దీనిపైన అధిష్ఠానముంటుంది. విజయనగరకాలంలో అలంకరణలేని సాదా ఉపపీఠాలు, అందంగా తీర్చి దిద్దబడిన ఉపపీఠాలున్నాయి. ఉపపీఠం సాదాగావున్నా, అలంకరణతో వున్నా ఉపానం, రెండుపట్టీలు, గళ, ఆలింగన పట్టిక మొదలైనభాగాలు కలిగివుంటుంది. గళభాగం వెడల్పుగావుండి, అందులో చతురస్రాలు, దీర్ఘచతురస్రాలుండి, నకుల పాదాలుంటాయి. ఒక్కొక్కసారి ఆలింగన పట్టికమీద సాదా కూటులు లేదా బాగా అలంకరించబడిన చైత్యాలంకరణయుంటాయి.

లేపాక్షి వీరభద్రాలయంలోని గోపురద్వార ఉపపీఠం సుమారు పది అడుగులువుంది. ఈ ఉపపీఠం అలంకరణలేని సాదా ఉపానం కలిగివుంది. దీనికి పైభాగంలో వరుసగా వివిధ ఆకారాలలోవున్న ఏనుగులు అందంగా మలచబడినాయి. దీని పైభాగంలో సాదా పట్టిక వుంది. దీని పైభాగంలో పుష్ప సంబంధిత రేఖలున్నాయి. తర్వాత మహాపద్మ, వెడల్పాటిగళ, ఆలింగన పట్టికవుంది. ఆలింగన పట్టికమీద వరుసగా కూటులుండి, యీ కూటులపైన కీర్తిముఖాలంకరణవుంది. ఈ ఉపపీఠంలో ముఖ్యంగా గమనించదగ్గది — సుందరమైన నాట్యకత్తెలను పద్మభాగంలో చూడటం. గళభాగంలో చిన్న చిన్న స్తంభాలుండి శీర్షకభాగాలు విజయనగర పుష్ప సంబంధమైన బ్రాకెట్లు కలిగివున్నాయి. ఈ స్తంభాల మధ్యలో కుంభపంజరాలు, అందంగా అలంకరించిన చిన్న చిన్న దేవకోష్ఠలున్నాయి. వీటి మధ్యలో ఆసీనదేవతా ప్రతిమ

ఉన్నాయి. గూడు పైభాగంలో అర్ధ చంద్రాకారపు మకరతోరణముంది. కుంభపంజరంలో కుంభం, పంజరం మాత్రమున్నాయి. ఈ రెండింటి మధ్యలో వుండవలసిన చిన్న స్తంభం కనిపించదు. ఈ లక్షణాలు కలిగి వున్న కుంభపంజరం మరే విజయనగర ఆలయాలలోనూ కనిపించదు. ఇదే గోపురమందు తూర్పుదిక్కున వున్న ఉపపీఠం కొన్ని విషయాలలో వేరుగా కనిపిస్తున్నది. గళభాగంలో చిన్న, పెద్ద దేవకోష్ఠాలున్నాయి. పెద్ద దేవకోష్ఠాలు ఎత్తైన స్తంభాలను కలిగివుండి, పైభాగంలో ఏకతల ద్రావిడ శిఖరాలు కలిగివున్నాయి. శిఖరభాగంలో గూడువుండి, గూడులో మనిషి తలవుంది. రెండు పెద్ద దేవకోష్ఠాలమధ్య చిన్న దేవ కోష్ఠాలున్నాయి. వీటికి రెండు స్తంభాలు ఇరువైపులా వున్నాయి. పైన గజపృష్ఠాకార శిఖరంవుంది. క్రొత్తదనం చూపించేందుకే విజయ నగర శిల్పులు ఇలా చిన్న, పెద్ద కోష్ఠాలను గళభాగంలో మలచినట్లు తెలుస్తుంది.

హంపి, సోంపాలెం, పుష్పగిరి, తాడిపత్రి, మంగాపురం, తిరుపతి, నారాయణవనం, మిల్లంపల్లి మొదలైన విజయనగర ఆలయాలలో సింగారంగా మలచబడిన ఉపపీఠాలెన్నోవున్నాయి. అన్ని ఉప పీఠాలలోనూ ఉపాన, గళ, పద్మ, మహాపట్టికలున్నాయి. మిల్లంపల్లి చెన్నకేశవాలయ ఉపపీఠ గళభాగంలో సకల పాదాలున్నాయి. మధ్య భాగంలో మాత్రం కోష్ఠముంది పైభాగంలో కపోతం, అర్ధచంద్రాకారపు మకరతోరణముండి, మధ్యభాగంలో అందమైన శిల్పంవుంది. ఇలాంటి ఉపపీఠాలు మంగాపురం, నారాయణవనంలోని కల్యాణ వెంకటేశ్వరా లయాలలో కనిపిస్తాయి. ఇంకొంచెం అభివృద్ధిదశలో తాడిపత్రి వెంకట రమణాలయం, హంపీలో అచ్యుతరాయ ఆలయం, విఠలాలయాలలో చూడవచ్చు. ఇక్కడ పైన చెప్పబడిన లక్షణాలుకాక పద్మపట్టిక, కుముద, ఆలింగన పట్టికలో కీర్తిముఖం కలిగిన చైత్యకనిపిస్తాయి. దేవకోష్ఠాలుండిన శిఖర పైభాగం కలశాంతో చూపబడింది. హంపిలోని అచ్యుతరాయాలయ ఉపపీఠంలో కూడా ఇదేవిధంగా కనిపిస్తుంది.

వారసులైన చోళుల కాలంలో గోపురద్వారాలు చాలా ప్రముఖంగా కన్పిస్తాయి. వీరికాలపు మొట్టమొదటి గోపురద్వారం కిలయూరులోని అవనికందర్ప ఈశ్వరాలయంలో చూడవచ్చు. చోళులలో ప్రముఖు డైన మొదటి రాజరాజ కాలంనాటి తంజావూర్‌లోని బృహదీశ్వరాలయం రెండు పెద్ద గోపురాలు కలిగివుంది, వెలుపలి గోపురం ఐదుతలములు, లోపలిది మూడు తలములు కలిగివుంది. రెండవ కులోత్తుంగ, మూడవ కులోత్తుంగ కాలాలలో గోపురద్వారాలు ఎంతో అభివృద్ధికి నోచుకున్నాయి. పాండ్యుల ధారాసురంలోని ఐరావతేశ్వరాలయం. త్రిభువనంలోని త్రిభువనేశ్వరాలయం, తిరువణ్ణామలైలోని అరుణాచలేశ్వ రాలయం, చిదంబరంలోని శివాలయ తూర్పుగోపురం, వెలుపలి గోవింద రాజస్వామి ఆలయ లోపలిగోపురం మొదలైన ఆలయ గోపురాలు వీరి కళాసృష్టికి నిదర్శనాలు. వీరికాలంలో ఆలయాలకన్నా గోపురాలకు ప్రాముఖ్యత యివ్వబడింది. ఎత్తయిన గోపురాలు నిర్మించటంలో వీరు చాలా ఆసక్తి చూపారు.

ఇప్పటివరకు గోపురద్వారం గురించి దాని మూలం గురించి అలాగే వివిధకాలాలలో దీని అభివృద్ధి గురించి పైన వివరించటం జరిగింది. ఇప్పుడు లేపాక్షిలోని, ఉత్తర విజయనగర ఆలయాలలోని గోపుర ద్వారం గురించి తెలుసుకొందాం. ఈకాలపు గోపురాలు పొడవు కంటె నిడివి ఎక్కువగావుంటాయి. ఒక్కొక్కసారి 50 అడుగులుండే ఎక్కు వగా వుండి, మధ్యలో దీర్ఘచతురస్రాకారపు ద్వారముంటుంది. ఈ గోపురద్వారాలు క్రిందిభాగం గట్టిగా వుండేందుకు మరియు అంతటి బరువు మోసేందుకుగాను దృఢమైన రాతితో నిర్మించి పైభాగం బరువు తగ్గిం చుటకు యిటుకలతో నిర్మించారు.

లేపాక్షి వీరభద్రస్వామి ఆలయానికి గంభీరమైన గోపురద్వారం వుంది. ఇది ఆలయానికి దక్షిణంవైపున, ప్రాకారానికి మధ్యలో వుంది. ఈగోపుర ఉపపీఠ, అధిష్ఠాన, కుడ్యభాగాలు తప్ప మిగిలిన పైభాగం (శిఖరం) చాలావరకు శిథిలమైవుంది (ఫోటో.1). ఈ గోపురద్వారాన్ని

విశాలమైన ఉపపీఠం యొక్క గళభాగంలో మాత్రం కుంభపంజరాలు కనిపిస్తాయి. ఉపపీఠం పూర్తి అభివృద్ధిదశ తాడిపత్రిలోని రామలింగేశ్వరాలయ గోపురద్వారంలో కనిపిస్తుంది. ఇది నల్లటి గట్టిరాతితో నిర్మించబడింది. ఉపాన భాగంలో చిన్న చిన్న గూడులు కలవు. మిగిలిన ఆలయాలలో యిలాంటి వుదాహరణ కానరాదు. పట్టిక భాగంలో దేవతల, మనుష్యుల ప్రతిమలున్నాయి. ఆ తర్వాత మహా పద్మ పట్టికవుంది. ఇక్కడున్న త్రిపట్టభాగంలో, పద్మపు మొగ్గలు చూపబడినాయి. గళభాగంలోని స్తంభాలు పుష్ప సంబంధమైన బ్రాకెట్లుతో వున్నాయి. మనుష్యులు ధారావాహిక స్థితిలో చూపబడినారు. ఉపపీఠంలో గమనించదగ్గ విషయం శిల్పాలను నిలుపును అడ్డానికి మలచి యివ్వటం, అడ్డంగా మలచివున్న శిల్పాలను అడ్డుకొంటూ నిలువుకు ద్వితల శిఖరం కలిగిన చిన్న గుడి మలచబడివుంది, పై భాగాన కీర్తి ముఖముంది. ఇలాగా ప్రతి అంగుళమూ శిల్పుల పనితనంతో అందంగా తీర్చి దిద్దబడివుంది. ఇలాంటి అలంకరణలు మనకు హొయసల దేవాలయాలైన బేలూరు, హళేబీడు, సోమనాథ్‌పూర్ ఆలయాలలో కనిపిస్తాయి.

**అధిష్ఠానం :** ఇది ఉపపీఠానికి పై భాగంలో, కుడ్యభాగానికి క్రింది భాగంలో వుంటుంది. అలంకరణ లేకుండ సాదాగాను, అందమైన అలంకరణలతోనూ వుండే అధిష్ఠానాలు విజయనగర ఆలయాల గోపురద్వారాలలో కనిపిస్తాయి. పుష్పగిరి చెన్నకేశ్వరాలయం, హంపీలోని చంద్రశేఖరాలయం, సోంపాలెం చెన్నకేశవాలయం, మంగాపురం కల్యాణ వెంకటేశ్వరాలయాలలోని గోపురద్వారాలలోని అధిష్ఠానాలు అలంకరణ లేకుండ సాదాగా కనిపిస్తాయి. వీటన్నిటిలో వెతల్పాటి ఉపాన, త్రిపట్టి, పట్టీలుంటాయి. లేపాక్షి వీరభద్రాలయంలోని గోపురద్వార అధిష్ఠానంలో మహాపద్మపట్టిక, మహాపట్టిక, క్షుద్రపట్టిక, త్రిపట్టి, అల్పపద్మపట్టిక మొదలయినవి కనిపిస్తాయి (ఫోటో.1). అందంగా తీర్చి దిద్దబడిన అధిష్ఠానాలు మిల్లయపల్లి చెన్నకేశవాలయం, తాడిపత్రిలోని వెంకటరమణ,

రామలింగేశ్వరాలయాలు, హంపి విఠలాలయం, తిరుపతి గోవిందరాజా లయాలలో కనిపిస్తాయి. మిల్లంపల్లిలోని అధిష్ఠాన పైభాగంలో అలింగన పట్టిక వుంది. అందు వరుసగా చైత్యాలంకరణలుండి, మధ్యంలో మనిషి తలవుంది. హంపి విఠలాయంలోని ఉపాన, త్రిపట్ట, అలింగన పట్టికలలో ఆసీన శార్దూలాలు మలచబడినాయి. తాడిపత్రి వెంకట రమణాలయంలోని అధిష్ఠానంలో ఏనుగుల ప్రతిమలు, ఆసీన శార్దూ లాలు, చైత్య అలంకరణలున్నాయి. తాడిపత్రి రామలింగేశ్వరాలయ గోపుర అధిష్ఠానభాగంలో మరుగుజ్జులు భారవాహక స్థితిలోనూ, చిన్న చిన్న గుడులు, వీటిపైన ఎక్కువ తలములున్న శిఖరాలు, హంసలు మొదలైనవి కన్పిస్తాయి. ఇలాంటి అలంకరణ హొయసల ఆలయాల లోని అధిష్ఠానాలలో గమనించవచ్చు. తాడిపత్రి రామలింగేశ్వరాలయ ఉపపీఠ, అధిష్ఠానాలు అన్ని ఆలయాలలోని ఉపపీఠ అధిష్ఠానాలకంటే అందమైనవిగా గుర్తించవచ్చు.

**కుడ్య అలంకరణ :** గోపురద్వారంలో కుడ్యభాగం అధిష్ఠాన పై భాగంలో, కపోతానికి క్రిందిభాగంలో వుంటుంది. విజయనగర ఆలయా లలో కుడ్యా లంకరణకు వివిధ రకాల పద్ధతులు వుపయోగించినట్లు గమ నించవచ్చు. పుష్పగిరి, సోంపాలెం, హంపి, రాయచోటి ఆలయాల లోని గోపురద్వార కుడ్యభాగాలు ఎలాంటి అలంకరణలేకుండా సాదాగా కనిపిస్తున్నాయి. లేపాక్షి వీరభద్రాలయంలోని కుడ్యభాగంలో చిన్న చిన్న స్తంభాలుండి, పైభాగంలో పంజర అలంకరణవుంది (ఫోటో.1). హంపిలోని చంద్రశేఖర, వరాహస్వామి ఆలయ కుడ్యభాగంలో కుంభ పంజరాలు, కోష్ఠాలుండి, కోష్ఠ పైభాగంలో శాలశిఖరం లేదా సింహల లాట మకరతోరణం కనిపిస్తాయి. తాడిపత్రి వెంకటరమణాలయం, మిల్లంపల్లి చెన్నకేశవాలయం, తిరుపతి గోవిందరాజాలయం (రెండవ గోపురం) మొదలైన గోపుర కుడ్యభాగంలో కొంచెం అభివృద్ధి దశ కనిపిస్తుంది. కుంభపంజర, కోష్ఠాలుండి, మంచ[illegible] [illegible] రకాల శిల్పాలు కనిపిస్తాయి. కోష్ఠంయొక్క [illegible] క్రిందిభాగంలో

లోను, కోష్టానికీ కోష్టానికీ మధ్యలోను కనిపిస్తాయి. సుస్పష్టమైన విషయమేమిటంటే యీ శిఖరం చాలావరకు ఛిద్రమైవుండటం(ఫోటో.1).

పుష్పగిరి, హంపీ, తాడిపత్రి, తిరుపతి, శ్రీకాళహస్తి, కదిరి, నారాయణవనం, మార్కాపురం ఆలయాల గోపుర శిఖరాలలో శైవ, వైష్ణవులకు సంబంధించిన ప్రతిమలు, ద్వారపాలకులు. మదుగుట్టలు నారవాహికస్థితిలో, విగ్రహాలు, శృంగార ప్రతిమలు కనిపిస్తాయి. విజయనగర శిల్పాలు పెద్ద పెద్ద ఆకారాలు నిర్మించినప్పటికీ ఎంతో జాగ్రత్తగా నిలువుకు, అడ్డానికీ సమానమైన విలువ నిచ్చారు. చిన్న చిన్న స్తంభాలు, కోష్టాలు, ద్వారాలు నిలువుకు సంబంధించినవి, అడ్డానికున్న పట్టీలు తలములను వేరుచేస్తాయి. ఈ పట్టీలు, శిఖరాగ్రం అడ్డానికి సంబంధించినవి.

**గోపుర ప్రవేశద్వారాలు:** ప్రతిగోపురం దీర్ఘచతురస్రాకారపు ప్రవేశద్వారం కలిగివుంటుంది. ద్వార పైభాగం, ద్వారానికిరుపైపులా వున్న భాగాలు వివిధ రకాల పుష్పాలంకరణలు, మదుగుట్టలు. విష్ణు అవతారాలు, ఆసీనశార్దూలాలతో నింపబడివుంటాయి. ప్రవేశద్వారంలో స్త్రీ నిలుచొనివుండి ఒకచేతిని పైకిలేపి పైనున్న తీగను పట్టుకొని వున్నట్లుంటుంది. ఒక్కొక్కసారి చిన్న చిన్న గుడులుకూడా మలచబడి వుంటాయి. ద్వారాని కిరుపైపుల పెద్దపెద్ద రాతి స్తంభాలు నిలువుగా వుంటాయి. వాటికి కొయ్యతోచేసిన తలుపులను యినుప మేకుల బంధంతో అమర్చివుంటారు. ప్రవేశద్వారంలో రెండువైపులా గదులుంటాయి. ఇక్కడనుండి పై తలం చేరేందుకు మెట్లదారిగాని, రాతిదారిగాని నిర్మించిన నిచ్చెనల నుపయోగించే వారట.

లేపాక్షి వీరభద్రస్వామి ఆలయ గోపురద్వారం యిరుపైపులా రెండు పెద్ద స్తంభాలున్నాయి. పైభాగం ద్వారబంధం కలిగివుంది. ఈ రెండుభాగాలు పుష్పతోరణాలలోను, చిన్న చిన్న శిల్పాలలోను అందంగా అలంకరించబడి వున్నాయి. ఇరుపైపులా వున్న స్తంభాల

త్రివిక్రమంలోనూ స్త్రీ పనసు పట్టుకొని వున్న ప్రతిమలు కలవు. ఇలాంటి స్త్రీ ప్రతిమలను సాలభంజిక లంటారు.

విజయనగర కాలంలోని గోపురాలు ఒక తలమునుండి పద కొండు తలములవరకున్నాయి. ఒక తలము కలిగిన గోపురానికి మంచి వుదాహరణ పుష్పగిరి చెన్నకేశవాలయానికి సమీపంలోని చిన్న ఆలయం. ఏడు, తొమ్మిది, పదకొండు తలముల గోపురాలు మార్కాపురం, నారాయణవనం, తిరువణ్ణామలై, శ్రీరంగంలో కనిపిస్తాయి.

ఆలయంలోని గోపురద్వారం, గర్భగుడిపైన వుండే విమానం చాలా ముఖ్యమైనవి చూచిన వెంటనే ఆకర్షించేవి. వి. కామేశ్వరరావు విమానం, గోపురద్వారాన్ని పోల్చుతూ యీవిధంగా అన్నారు "పల్లవుల కాలంలోని గర్భగుడిపై నున్న విమానం గోపురానికన్నా పెద్దది. దీనికి వుదాహరణ కంచిలోని కైలాసనాథ దేవాలయం. ఈపద్ధతిని తొలి, మధ్య కాలపు చోళులు కూడా పాటించారు. ఈపద్ధతికి స్వస్తిచెప్పి పాండ్యులు గోపురాల ఎత్తును పెంచి, విమానాల ఎత్తును పూర్తిగా తగ్గించారు. రాయలసీమలోని విజయనగర ఆలయాలలో యీపద్ధతి మరలా సమాన మైంది. అంటే గోపురం, విమానం ఒకే ఎత్తులో వున్నాయి. ఉదాహరణలు లేపాక్షి, సోంపాలెం, నారాయణవనం, మంగాపురం" (V. Kameswara Rao, Select Vijayanagara Temples of Rayalaseema, P.219). పల్లవ, చోళ, పాండ్యుల విమాన, గోపురాల విషయంలో వి. కామేశ్వరరావు అభిప్రాయంతో ఏకీభవించవచ్చు. కాని చివరన చెప్పిన "రాయలసీమలోని విజయనగర ఆలయాలలోని గోపురం, విమానం సమానంగావున్నవి" అనడం అసమంజసం. లేపాక్షి, సోంపాలెం, తాడిపత్రి ఆలయాలలోని గోపురాలు శిథిలమై వున్నాయి (ఫోటో.1). పడిపోయినప్పటికీ తాడిపత్రిలోని వెంకటరమణాలయ గోపురం విమానంకంటె ఎత్తుగావుంది. అలాగే పుష్పగిరి, మార్కాపురం, ఒంటిమిట్ట, మంగాపురం, శ్రీనివాస మంగాపురం, తిరుపతి, శ్రీకాళహస్తి, కదిరి ఆలయాలలోని గోపురాలు విమానంకంటే వాస్తు

వానికి పెద్దవే. హంపీలోని విఠలాలయం, చంద్రశేఖరాలయాలలో కూడా గోపురాలే ఎత్తుగా వున్నాయి.

గోపురద్వారాల వివరణ ముగించే ముందు గోపురాలను నిర్మించేందుకుపయోగించిన పద్ధతి తెలుసుకోవటం అవసరం. ఇంతకుముందు తెలిపినట్లు గోపుర క్రిందిభాగాలైన ఉపపీఠం, అధిష్టానం, మధ్యభాగాలను గట్టిరాతితో నిర్మించేవారు. 'పిరమిడ్' ఆకారంలోవున్న శిఖర భారాన్ని మోసేందుకుగాను క్రిందిభాగాన్ని గట్టి పునాదులతో నిర్మించారు. శిఖరాన్ని ఇటుకలు, సున్నంలో నిర్మించి పైభారాన్ని తగ్గించారు. ఇలా యిటుకలు వుపయోగించి పైభారాన్ని తగ్గించుటయేగాక శిఖర లోపలి భాగాన్ని ఖాళీగా చేక డోలుగావుంచుతారు. శిథిలమైవున్న తాడిపత్రి వెంకటరమణాలయం, హంపీ విఠలాలయ గోపురాల అవశేషాలను గమనిస్తే యిది విదితమవుతుంది. శిఖరానికి వాడిన యిటుకలను క్షుణ్ణంగా పరిశీలిస్తే మందమైనవి కావని, చాలా సూక్ష్మమైనవని తెలుస్తుంది. ఇలాంటి యిటుకలను వాడటంవలన శిఖరభారం మరింత తగ్గుతుంది.

## ఉపాలయాలు :

ప్రాకారానికి లోపలి భాగంలో వివిధ పరిమాణాల్లో వివిధ రకాల ఉపాలయాలను నిర్మించడంలోనూ విజయనగర శిల్పులు విజయం పొందారు. ఆలయాలలో వుత్సవాలను పెంచేందుకుగాను ఉపాలయాల సంఖ్య పెంచారు. ప్రతి ఉపాలయమూ ప్రత్యేక ప్రతిపత్తి కలిగి వుంటుంది. ఏ ఏ ఉపాలయం ఎక్కడెక్కడ వుండవలసిందీ నిర్దిష్టంగా విజయనగర శిల్పులు పాటించారు. ఉదాహరణకు దేవీ ఆలయం ఎల్లప్పుడూ ఉత్తర - పశ్చిమ (వాయవ్యదిశ) గా గర్భగుడికి ప్రక్కగా వుండి, ప్రధానాలయంలో వున్న స్వామియొక్క పత్ని విగ్రహం దేవీ ఆలయ గర్భగుడిలో వుంటుంది.

లేపాక్షి వీరభద్రాయంలో ఎక్కడెక్కడ ఏమేమి వున్నవో యీ క్రింద వివరించబడింది. ఈ ఆలయం రెండు ప్రాకారాలను కలిగివుంది.

ప్రధానాలయం రెండవ ప్రాకారం మధ్యభాగంలోవుంది. వీరభద్ర స్వామి ప్రధానాలయానికి గర్భగృహం, అంతరాళం, ముఖమండపం, నాట్యమండపాలున్నాయి. ప్రధానాలయానికి తూర్పు, పశ్చిమలుగా పాపనాశేశ్వర, రఘునాథ, ఆంజనేయ, అమ్మాన్, దుర్గ, శయనాగారం మొదలయిన ఉపాలయాలు కలవు. ఆలయానికి బైట నైఋతివైపుగా కల్యాణమండపం (ఫోటో.3), ఒకే రాతిలో మలచిన నాగలింగం (చిత్రపటం), ఇంకా ఎన్నో మండపాలు, చిన్నచిన్న గుడులు వున్నాయి. మొదటి ప్రాకారపు లోపలిభాగంలో దక్షిణ, పశ్చిమగా మరొక మండపంవుంది. దీని శిఖరాన్ని అందంగా మలచబడిన 10 స్తంభాలు మోస్తున్నాయి. రెండుప్రాకారాల మధ్యలో ప్రధానాలయానికి పశ్చిమగా కొండలో చిన్న కొలనువుంది. ప్రధానాలయానికి తూర్పుగా పార్వతి ఆలయంవుంది. వీరభద్రాలయం నిర్మించబడిన కొండ కూర్మం వెనుకభాగం లాగా కనిపిస్తుంది. కొండ ప్రాంతంలో నిర్మించటం చేత ఇప్పుడు ఉపాలయాలు నిర్మించటంలో ఏక పద్ధతి అవలంబించలేక పోయారు (చిత్రం.1).

ఉపాలయాల విషయంలో మిగిలిన విజయనగర ఆలయాలలో గమనించిన ఏక పద్ధతిలో నిర్మించివుండటం కనిపిస్తుంది. హంపీలోని విఠలాలయం 500 అడుగుల పొడవు, 310 అడుగుల వెడల్పు కలిగిన దీర్ఘచతురస్రాకారపు ప్రాంగణంలో వుంది. హంపీలోని పంపాపతి, హజారా రామాలయాలు ప్రధానాలయంతోబాటు అమ్మాన్ ఆలయం, కల్యాణమండపం, ఇతర ఉపాలయాలున్నాయి. కదిరి లక్ష్మీనరసింహాలయం, తాడిపత్రిలోని వెంకటరమణ, రామలింగేశ్వరాలయాలు, చిదంబరంలోని శివాలయం, వేలూరులోని జలకంఠేశ్వరాలయాలలో ప్రధానాలయం చుట్టూ ఉపాలయాలు, అమ్మనార్ ఆలయం, కల్యాణ మండపం ఏకపద్ధతి ప్రకారం నిర్మించినట్లు కనిపిస్తుంది. తాడిపత్రి వెంకటరమణాలయానికి, హంపీలోని విఠలాలయానికి రాతి రథాలున్నాయి.

పరివారదేవతలున్న ఉపాలయాలు, కల్యాణమండపం పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకోవటం వలన విజయనగర శిల్పులు ఏ కాలం నాటి శిల్పరీతి వుత్తేజపరిచిందో తెలుస్తుంది. తొట్టతొలుత ఉత్తరదేశం లోని ఆలయాలలో పంచాయతన విధానం వాడుకలో వుండేది. తర్వాత అష్టపరివార విధానం అవలంభించారు. పంచాయతన విధానంలో ఎత్తైన వేదికమీద ప్రధాన విగ్రహముంటుంది. చుట్టూ గణేశ ఆగ్నేయంవైపు, సూర్యభగవానుడు నైఋతివైపు, దుర్గ వాయువ్యంవైపు, విష్ణువు ఈశాన్యంవైపు వుంటారు. అష్టపరివార విధానంలో ప్రధాన విగ్రహంతో పాటు సప్తమాతృక లుంటాయి (K.V. Soundararajan, Indian Temple Styles, The Personality of Hindu Architecture, New Delhi, 1972, P.83). పంచాయతన విధానానికి మొట్టమొదటి వుదాహరణ ఒసియానందలి ఆలయం (రాజస్థాన్), అష్టపరివార దేవతల మొట్టమొదటి వుదాహరణ ధమ్నార్‌లోని గుహాలయం, దక్కన్‌లో మంచి వుదాహరణలు ఎల్లోరాలోని కైలాసాలయం, పట్టదకల్‌లోని విరూపాక్షాలయం (Ibid.). పల్లవుల కాలంలో రాజసింహ మొట్టమొదటి సారిగా ప్రధానాలయం చుట్టూ పరివారదేవతలను నిర్మించాడు. ఈకాలంలో పరివారదేవతలలో సోమాస్కందుని కూడా కలిపారు. ఈ కాలంలో చాలావరకు పరివార దేవతలు తూర్పుముఖంగా వున్నాయి. పైన పేర్కొన్న విషయాన్నిబట్టి పరివార దేవతలు క్రీ.శ. 8వ శతాబ్దంలో రాజసింహకాలంలోనే వెలిసినట్లు తెలుస్తున్నవి. ఈపరివార దేవతలను గురించి వి. కామేశ్వరరావు "చోళులకాలంనుండి యీదేవతలకు ప్రాకారం లోపల ఆలయాలు నిర్మించడం ప్రారంభమైంది" అనడం అసమంజసమే (V. Kameswara Rao, Select Vijayanagara Temples of Rayalaseema, P.218). ఉపాలయాలను నిర్మించటంలో చోళులు పల్లవుల ననుసరించారు. వీటి నిర్మాణాన్ని గురించి చోళశాసనాలలో కూడ వివరింపబడింది. చోళులకాలంలో ముఖ్యంగా గమనింపదగింది అమ్మన్‌కు ప్రత్యేకాలయాలు నిర్మించడం. దేవికి ప్రత్యేక ఆలయాలు పల్లవుల కాలంలోగాని, తొలిచోళుల కాలంలోగానీ కానరావు. చిదంబర

నటరాజ ఆలయంలో శివకామి అమ్మాన్ ఆలయాన్ని మొట్టమొదటిదిగా చెప్పవచ్చు. ఇలా ప్రత్యేకాలయాలు నిర్మించడం మొదటి కులోత్తుంగ కాలంనుండి ఆరంభమై పాండ్యులు, విజయనగర శిల్పులు కూడా యీ విధానం ఆచరించారు. తూర్పు చాళుక్యులు, పశ్చిమచాళుక్యులు, కాకతీయులు కూడా ఉపాలయాలు నిర్మించారు.

ప్రధానాలయానికి ప్రక్కగా వుండే ముఖ్యమైనభాగం కల్యాణ మండపం. పల్లవులకాలంలో ప్రధానాలయానికి దగ్గరలో స్తంభమండపాలు నిర్మించేవారు. కంచిలోని కైలాసనాథ దేవాలయంలో దీనికి చక్కని వుదాహరణ కనిపిస్తుంది. చోళులు పెద్ద పెద్ద సభామండపాలు నిర్మిం చారు. తంజావూరులోని బృహదీశ్వరాలయం, గంగైకొండ చోళపురం లలో ప్రత్యేక స్తంభాల మండపాలున్నాయి. పాండ్యులుకూడా ప్రత్యేక మండపాలు నిర్మించారు. ఉదాహరణగా దారాసురం ఆలయం తీసుకో వచ్చు. వీరేకాకుండా పశ్చిమచాళుక్యులు, కాకతీయులు కూడా యిలాంటివి నిర్మించారు.

విజయనగర ఆలయాలలో దక్షిణ-పశ్చిమ (నైఋతి దిక్కున) లందే కల్యాణమండపం వుండుట గమనించదగ్గ విషయం. ఇలా నైఋతి వైపే కల్యాణమండపాలను నిర్మించటం విజయనగర కాలపు వాస్తు ప్రత్యేకతగా గుర్తించవచ్చు. కల్యాణమండపంలో ఆలయ వార్షిక వుత్సవాలలో ప్రధానాలయంలోని స్వామికి తనపత్ని (దేవేరి) తో పెళ్ళి చేస్తారు. లేపాక్షి వీరభద్రాలయంలో నైఋతివైపు రెండవ ప్రాకారంలో చాలా అందమైన కల్యాణమండపముంది (ఫోటో.3). దీని నిర్మాణ అసంపూర్తిగానే నిలిచిపోయింది. ఇది 38 స్తంభాలు కలిగివుంది. పెద్ద పెద్ద దిక్పాలుర ప్రతిమలు, శివుని కల్యాణ సుందరమూర్తి, వృష వాహనమూర్తి, సదాశివమూర్తి, దేవలమూర్తి ప్రతిమలు మరియు గణపతి, విష్ణు, బ్రహ్మ మొదలగు ప్రతిమలు యీ మండపంలోకలవు. ఉత్తరదిక్కునవున్న స్తంభాలమీద నిలువెత్తుఋషుల ప్రతిమలున్నాయి. (కొన్ని ముఖ్యమైన ప్రతిమలను గురించి 'ప్రతిమా-లక్షణాలు' అనే

ప్రత్యేక అధ్యాయంలో వివరించడం జరిగింది). ఈ కల్యాణమండపం ఆరడుగుల ఎత్తున్న అధిష్ఠానంపై నిర్మించబడివుంది. ఈమండపానికి మధ్యలో వేదికలేదు. దీని నిర్మాణం మధ్యలో ఆగిపోయినందువల్ల యీ మండపం మధ్యలో ఎలాంటివేదిక కన్పించదు. మిగిలిన విజయనగర ఆలయాలలోని కల్యాణమండపం మధ్యలో వేదిక వుండటం గమనించవచ్చు.

సోంపాలెం, మార్కాపురం, హంపీ, శ్రీరంగం, వేలూరు, కంచి, తాడిపత్రి, చంద్రగిరి, కదిరి మొదలైన విజయనగర ఆలయాలలో కల్యాణమండపాలున్నాయి. ఇవి కూడా అధిష్ఠానం కలిగివున్నాయి. చాలామండపాలలో మధ్యభాగంలో అందంగా మలచబడిన వేదిక వుంటుంది. దీని పైభాగంలో ప్రధానాలయాన్ని పోలిన శిఖరం స్తంభాలపై నిర్మించబడివుంటుంది. ఈవేదికమీద స్వామి దేవేరి ప్రతిమలుంచి ఆలయ వుత్సవ సమయాలలో కల్యాణం చేస్తారు. ఇలా మధ్యలో చిన్న వేదికకలిగివున్న కల్యాణమండపాలు కదిరి లక్ష్మీనారాయణాలయంలోనూ, చంద్రగిరి మల్లికార్జునాలయంలోనూ, తాడిపత్రి వెంకటరమణ, రామలింగేశ్వరాలయంలోనూ, హంపీ హజారా రామాలయంలోనూ, తిరుపతి గోవిందరాజస్వామి ఆలయంలోనూ వున్నాయి.

ఈ కల్యాణ మండపం కాకుండా విజయనగర ఆలయాలలో ఎక్కువ స్తంభాలు కలిగిన మండపాలు ప్రధానాలయానికి ప్రత్యేకంగా కనిపిస్తాయి. ఈ మండపాలను వంద స్తంభాల మండపం, వేయి స్తంభాల మండపం అని అంటారు. ఇలాంటిమండపం లేపాక్షిలో కానరాదు. శ్రీరంగం, తిరువణ్ణామలై, తిరుపతి, కాంచీపురం, శ్రీకాళహస్తిలలోని ఆలయాలలో యీ మండపాలున్నాయి.

ఈ అధ్యాయంలో యిప్పటివరకు లేపాక్షి వీరభద్రాలయం మరియు యితర విజయనగర ఆలయాలలో ఎక్కడెక్కడ ఏ ఏ భాగాలుంటాయో అంటే ప్రాకారాలు, గోపురద్వారాలు, ఉపాలయాలు,

కల్యాణమండపాలు, నూపు, వేయి స్తంభాల మండపాలు మొదలయిన వాటినిగురించి పూర్తి వివరాలు తెలుసుకొనే ప్రయత్నం జరిగింది. వీరు నిర్మాణంలో విజయనగరశిల్పులను ఏకాలంనాటి వాస్తు ఉత్తేజపరిచిందో తులనాత్మకంగా పరిశీలించితే విజయనగర ఆలయాలలోని పెద్ద పెద్ద ప్రాకారాలు, ప్రాకారాం లోపలిభాగంలో పెద్ద పెద్ద వసారాలు, వివిధ రకాల శిల్పాలతో అందంగా తీర్చి దిద్దబడిన గొప్ప గొప్ప గోపురాలు, పరివారదేవతలకు ఉపాలయాలు, దేవికి ప్రత్యేకమందిరం, కల్యాణ మండపం, వేయి స్తంభాల మండపాలు మొదలయినవి పల్లవ, చోళ, పాండ్యుల ఆలయాలలో వుండటం గమనించవచ్చు. కాబట్టి విజయ నగర శిల్పులపై చాలావరకు పల్లవ, చోళ, పాండ్యుల వాస్తు ప్రభావం ప్రధానంగా వున్నట్లు మనం గుర్తించవచ్చు.

మూడవ అధ్యాయం

# బహిర్వాస్తు

ఈ అధ్యాయంలో లేపాక్షి వీరభద్రస్వామి ఆలయ బహిర్వాస్తును గురించి వివరణ యివ్వటం జరిగింది. వీరభద్రాలయంలోని వాస్తు (వొక్క విమానం తప్ప) చాలావరకు పెద్దఅలంకరణ లేకుండా సాదాగా కన్పిస్తుంది. ప్రధానాలయం కొండమీద నిర్మించబడింది. దీనిపైభాగం ఎత్తుపల్లంగావుంది. గర్భగృహం, అంతరాళం, మహామంటపం, అమ్మాన్ మందిరం, పార్వతిమందిరం కొంచెం ఎత్తుగా వున్న ప్రాంతంలో నిర్మించారు. కాబట్టే శిల్పులు యీ మందిరాలలో ఉపపీఠ, అధిష్ఠానాలను ప్రవేశపెట్టలేదు. గర్భగృహం, సభామంటపం కొన్ని ఉపాలయాల వెలుపలి గోడలు ఎలాంటి అలంకరణ లేకుండా కనిపిస్తున్నాయి. నాట్య, ముఖమంటపాల వెలుపలి గోడలు మాత్రం కిరాతార్జునీయ, భక్తశిరియాళ కథలు అందంగా తీర్చిదిద్దబడి వున్నాయి. వీరభద్రాలయాన్ని మిగిలిన విజయనగర ఆలయాలతో జాగ్రత్తగా పోల్చి చూస్తే బహిర్వాస్తు గురించి చాలా ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి.

విజయనగర ప్రధానాలయాలలోని బహిర్వాస్తును యీ క్రింది విభాగాలుగా విభజించి, వివరించబడింది—ఉపపీఠం. అధిష్ఠానం, పాద భాగం, కపోతం, వేదిబంధం, వజనన లేదా ఉపపట్టిక, విమానము.

## ఉపపీఠం :

ఇది ఆలయ క్రింది భాగంలో వుంటుంది. వివిధ కాలాల్లో దీని అభివృద్ధిని గురించి తెలుసుకుంటే, విజయనగర ఉపపీఠం దేన్ని పోలివుందో తెలుస్తుంది. మహాబలిపురంలోని పల్లవులనాటి ద్రౌపది, అర్జున, భీమరథాలలో మొట్టమొదటి సారిగా ఉపపీఠ ప్రారంభాన్ని చూడవచ్చు. ద్రావిడ వాస్తులో ఉపపీఠానికి నాంది యిక్కడే జరిగిందని

చెప్పవచ్చు. కంచిలోని మాతంగేశ్వర, ముక్తేశ్వరాలయాలలో కూడ యీ భాగం వుంది. ఈ ఉపపీఠాలు ఉపాన, గళ, పట్టికలను కలిగి వున్నాయి. గళ భాగంలో సగల పాదాలున్నాయి. బాదామిచాళుక్యుల కాలంలో ఉపపీఠం కనిపించదు. ఐహోళే, పట్టదక్కల్, అలంపూర్ ఆలయాలలో దీన్ని గమనించవచ్చు. అలాగే రాష్ట్రకూటులు, తొలి చోళులు, పాండ్యులు కూడా ఉపపీఠ విషయంలో ఆసక్తి చూపలేదు. మలిచోళుల ఆలయాలలో యిది కనిపిస్తుంది. మలిచాళుక్యుల, హోయ సల ఆలయాలలో ఉపపీఠం తప్పనిసరి అయింది. చాలా అందంగా అలంకరించబడిన ఉపపీఠాలు కాకతీయుల హనుమకొండ, పాలంపేట, ఘనపూర్, కొత్తపల్లి, నగనూరు, నాగులపాడు, మంథాని, గార్ల మొదలైన ఆలయాలలో కనిపిస్తాయి. మలిచాళుక్య, కాకతీయ, హోయసల ఉపపీఠాలపైన ప్రదక్షిణాపథముంటుంది.

విజయనగర ఆలయాలలో ఉపపీఠం చాలా అరుదుగా కనిపిస్తుం దని కొంతమంది చరిత్రకారులు అభిప్రాయ పడ్డారు (V. Kameswara Rao Select Vijayanagara Temples of Rayalaseema P. 223). ఈ ఆలయాలలో అధిష్ఠానం వివిధ కాలాలలోని అధిష్ఠానం కంటే చాలా ఎత్తుగా వున్నాయని కూడా అభిప్రాయపడ్డారు. తుల నాత్మకంగా పరిశీలించితే యీ అభిప్రాయం తప్పనిపిస్తుంది. ఎందుకంటే విజయనగర శిల్పులు ఉపపీఠానికి వో ప్రత్యేకత, ప్రాముఖ్యత యిచ్చారు. పుష్పగిరి భీమలింగేశ్వరాలయం, మార్కాపురంలోని చెన్నకేశవాలయం, హంపీలోని హజారారామ, విఠల, చంద్రశేఖరాలయాలు, తాడిపత్రిలోని రామలింగేశ్వర, వెంకటరమణాలయాలు, చినకొమర్లలోని రామా లయంలో ఉపపీఠాలుండటం గమనించవచ్చు. మలిచాళుక్య, హోయసల, కాకతీయ ఆలయాలలో ఉపపీఠం పైభాగం వెడల్పుగా ఖాళీభాగం వుంటుంది. కాబట్టి యీఆలయాల్లో ఉపపీఠ, అధిష్ఠానాలను సులభంగా గుర్తించవచ్చు. కానీ విజయనగర ఆలయాలలో అలా కన్పించదు. ఈ ఆలయాలలోని ఉపపీఠ, అధిష్ఠానాల మధ్యభాగం (విడిపోవుభాగం)

చాలా తక్కువగా వుంటుంది. పరిశీలనా దృష్టితో గమనించనివారు విజయనగర ఆలయాలు అధిష్టానం మాత్రం కలిగివుండి ఉపపీఠం లేకుండా వుంటుంది అన్న అభిప్రాయానికి వస్తారు. కాబట్టే కొంతమంది విజయ నగర ఆలయాలలో అధిష్టానం వివిధ కాలాల అధిష్టానం కంటే ఎత్తుగా వుంటుందని భ్రమపడ్డారు.

విజయనగర ఆలయాలలో ఉపపీఠంలోని ఉపానం (క్రిందిభాగం) వెడల్పాటి పట్టీ ఆకారంలో వుంది (మహాపట్టిక). పుష్పగిరి భీమలింగే శ్వరాలయం, హంపీలోని విఠల, చంద్రశేఖర, విష్ణు, అచ్యుతరాయ ఆలయాలలో వెడల్పాటి ఉపానముండి అలంకరణ లేకుండా సాదాగా వున్నాయి. మిగిలిన విజయనగరాలయాలలో వివిధ రకాలుగా వివిధ పరిమాణాలలో కనిపిస్తాయి. విజయనగర ఉపపీఠాలలో కనబడే మరో ముఖ్యభాగం పద్మం. ఇది ఊర్ధ్వపద్మ, అధః పద్మ అనే రెండురకాలు. ఒక్కొక్కసారి ఆలింగన పట్టికకూడా మహాపద్మం లాగవుంది. క్షుద్ర పట్టికలు కలిగివున్నాయి. విజయనగర ఆలయాలలో త్రిపట్ట చాలావరకు అరుదుగా కనిపిస్తుంది. హంపీ అచ్యుతరాయాలయంలో మాత్రం త్రిపట్ట కనిపిస్తుంది. ప్రతి ఉపపీఠంలోనూ గళ భాగం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ భాగం చతురస్ర, దీర్ఘ చతురస్రాలుగా విభజింపబడి గళ పాదాలు కలిగివున్నాయి. తాడిపత్రి రామలింగేశ్వరాలయం, హంపీలోని హజారా రామాలయం, పుష్పగిరి భీమలింగేశ్వరాలయాల ఉపపీఠభాగం దేవతలు, వ్యాళప్రతిమలు, హంసలదారులు, కృష్ణలీలలు, రామాయణ శిల్పాలతో అందంగా తీర్చిదిద్ద బడివుంది. ఆలింగన పట్టికలో వరుసగా కూటములుండి పైన కీర్తిముఖాలున్నాయి.

## అధిష్టానం :

ఇది కూడా ఉపపీఠం లాగే ఆలయ అందాన్ని, ఎత్తును పెంచు తుంది. ఉపపీఠానికి పైన మధ్యభాగానికి క్రింది భాగంలోవుంటుంది.

లేపాక్షి వీరభద్రాలయ ప్రాంగణంలోని రఘునాథాలయం మరి కొన్ని ఉపాలయాలు అధిష్టానం కలిగివున్నాయి. రఘునాథాలయ అధి

ష్టానం ఉపాన, రెండుపట్టికలు, పద్మ, క్షుద్రపట్టిక, పట్ట, త్రిపట్ట, క్షుద్ర పట్టికలుండి పై భాగంలో ఆలింగనపట్టిక వుంది. ఇవన్నీ చాలావరకు సాదాగానే వున్నాయి. ఉపానానికి పై భాగంలో వున్న పట్టీమాత్రం దీర్ఘ చతురస్రాకారపు దిమ్మెలు అమర్చబడి వున్నాయి (ఫోటో.4). ఇంకొక చిన్నఆలయం రెండు వెడల్పాటి పట్టికలు, గళ, ఆలింగనపట్టిక వుండి, అన్నిభాగాలు ఎలాంటి అలంకరణా లేకుండా సాదా గావున్నాయి (ఫోటో.4).

విజయనగర అధిష్టానాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే యీ క్రింది విష యాలు తెలుస్తాయి. అధిష్టానంలోని ఉపాన, ఉపపీఠంలోని ఉపానం లాగే వెడల్పాటి పట్టీలాగా వుంటుంది. త్రిపట్ట అధిష్టానంలో కనీసం పాకసారయినా కనిపిస్తుంది. త్రిపట్ట మూడు ముఖాలను కలిగివుంటుంది. విజయనగర అధిష్టానంలోని త్రిపట్ట పల్లవ, తొలిచాళుక్య, రాష్ట్రకూట, చోళుల అధిష్టానంలోని త్రిపట్టను పోలివుంటుంది. మలి చాళుక్య, హోయసల, కాకతీయ అధిష్టానమందలి త్రిపట్ట మొనదేలినట్లుంటుంది. విజయనగర ఆలయాలలోని త్రిపట్ట మొనదేలినట్లుగా కాక కొంచెం చద రంగా వున్నట్లు కనిపిస్తుంది. కాబట్టి త్రిపట్టను మలచడంలో విజయ నగరశిల్పులు పల్లవ, తొలిచాళుక్య, రాష్ట్రకూట, చోళుల ననుసరించారు. అధిష్టానంలో పద్మాన్ని పాకసారికంటె ఎక్కువగా విజయనగరాల యాలలో చూడవచ్చు. ఉపపీఠంలో వున్న గళంకంటె అధిష్టానంలో వున్న గళం తక్కువ వెడల్పు కల్గివున్నది. ఈగళభాగం మామూలుగా రెండు క్షుద్రపట్టికల మధ్యలోగానీ; పట్టిక, త్రిపట్టల మధ్యలోగాని, పట్టిక, మహాపట్టికల మధ్యలోగాని వుంటుంది. అతర్వాత వృత్తకుముద, త్రిపట్టకుముద, బాదామి చాళుక్య, చోళుల ఆలయాలలో కనిపిస్తాయి. కానీ మలిచాళుక్య, కాకతీయ ఆలయాలలో యీ రెండుభాగాలు కన్పిం చవు. విజయనగర శిల్పులీవిషయంలో చోళుల ననుసరించడంవల్ల అధి ష్టానంలో వృత్తకుముద, త్రిపట్టకుముద కనిపిస్తాయి. ఇవి పుష్పగిరి భీమలింగేశ్వరాలయం, తాడిపత్రి వెంకటరమణ, రామలింగేశ్వరాయా లలో కనిపిస్తాయి.

విజయనగరాలయాలలో అలంకరణ లేని సాదా అధిష్ఠానాలూ, పూర్తి అలంకరణతో వున్న అధిష్ఠానాలూ కనిపిస్తాయి. లేపాక్షి వీర భద్రాలయంలోని రఘునాథాలయం, దానిని ఆనుకొని వున్న ఉపాలయం (ఫోటో.4) మరియు హంపీలోని అచ్యుతరాయ, చంద్రశేఖర, విష్ణు మొదలయిన ఆలయాల్లో అధిష్ఠానాలు చాలా సాదాగా కనిపిస్తాయి. హంపీలోని హజారా రామాలయంలోని అధిష్ఠాన ఉపానభాగంలో రామాయణంలోని కొన్ని ఘట్టాలకు సంబంధించిన శిల్పాలు కనిపిస్తాయి. పుష్పగిరి భీమలింగేశ్వరాలయంలోని అధిష్ఠానంలో ఆసీన శార్దూలాలు, పైన కీర్తిముఖలున్న కూడులు కనిపిస్తాయి. తాడిపత్రి రామలింగేశ్వ రాలయంలో చిన్న చిన్న గుడులు, హంసలు, పుష్పాలంకరణలు, మరు గుజ్జులు మొదలయినవి అధిష్ఠానంలో చూడవచ్చు. అధిష్ఠానభాగంలో పూర్తిస్థాయి అభివృద్ధి దశ పుష్పగిరి చెన్నకేశవాలయంలో చూడవచ్చు. ప్రతిఅంగుళం, గుర్రాలు, ఏనుగులు, ఆసీన శార్దూలాలు, వింతైన మక రాలు మొదలయిన జంతువులతోను, దేవతలు, ఎగిరే గంధర్వులు, రామాయణ పురాణగాథలతో ఎంతో అందంగా తీర్చి దిద్దబడివుంది. ఇలాంటి అలంకరణ పశ్చిమచాళుక్య, హోయసల, కాకతీయ ఆలయాలలో కూడా గమనించవచ్చు. కాబట్టి అధిష్ఠానాన్ని అందంగా తీర్చిదిద్దడంలో వీరు చాలావరకు పశ్చిమచాళుక్య, హోయసలులను అనుసరించివుండవచ్చు. ఇంకొక ఆసక్తికరమైన విషయం ఏమిటంటే విజయనగర అధిష్ఠానంలో కుంభపంజర యొక్క క్రిందిభాగమైన కుంభం అధిష్ఠాన భాగంలోకి చొచ్చుకొని పోయినట్లు కనిపిస్తుంది. పుష్పగిరి భీమలింగేశ్వర, చెన్న కేశవాలయాలలో, వల్లూరులోని శివాలయం, తాడిపత్రిలోని వెంకట రమణ, రామలింగేశ్వర ఆలయాలలో కుంభపంజరమిలా వుండటం గమనించవచ్చు.

లేపాక్షిలోనూ యితర విజయనగర ఆలయాలలోని ప్రధానాలయ అధిష్ఠానాల గురించి పైన వివరించబడింది. ఇప్పుడు సభా, నాట్య, కల్యాణమండపాల అధిష్ఠానాలగురించి యీక్రింద విపులీకరించటం జరి

గింది. ఈ అధిష్ఠానాలను కూడా రెండుగా అంటే అలంకరణ చేసినవి సాదాగావున్నవి. మరియు అంతరణ కలవిగా విభజించవచ్చు. అలం కరణలేని సాదాగావున్న అధిష్ఠానాలు ఉపానం, మహాపద్మ, అల్పపద్మ, త్రిపట్ట, ఆలింగనపట్టిక కలిగివుంటాయి. రెండవరకంలో వివిధరకాలైన అలంకరణలతో అందంగా తీర్చి దిద్దబడివుంటాయి. రెండవరకానికి హంపి విఠలాలయంలోని నాట్యమండపం అధిష్ఠానాన్ని ఒక్కటి వుదాహరణగా చెప్పవచ్చు. దీని ఉపానంలో అందంగా అలంకరింపబడివున్న గుర్రాలు న్నాయి. తర్వాత భాగంలో రెండు పట్టికలున్నాయి. ఈపట్టీలు ప్రతి అంగుళమూ పుష్పసంబంధితమైన అలంకరణతో నింపబడివున్నాయి. తర్వాత మహాపద్మముంది. దీనిఅంచుల క్రిందిభాగంలో కూర్చొనివున్న చిన్న చిన్న శార్దూలాలున్నాయి. మహాపద్మం పైభాగంలో వృత్తకుముద వుంది. ఆలింగన పట్టిక భాగంలో సింహాలలాట కలిగిన కూడులుండి లోపల గూడులలో మనిషి తలలు, మనిషి ప్రతిమలు, పుష్పసంబంధిత అలంకరణలు వున్నాయి. ఈఅధిష్టానంలో ముఖ్యంగా గమనించవలసింది నిలువుకున్న శాల కోష్టం. దీనికి అధిష్టానముండి ఉపానం, పద్మ, త్రిపట్ట, కుముద, ఆలింగనపట్టికలు వున్నాయి. దీని పైభాగంలో ఏకతల శిఖరముంది. ఈకోష్టం స్తంభాలమీదవుంది. ఈ అధిష్టానంలో విజయ నగరశిల్పులు నిలువుకు, అడ్డానికి సమానవిలువల నివ్వటం గమనార్హం. తాడిపత్రి వెంకటరమణాలయ నాట్యమండప అధిష్టానం ఉపానం, ఆలింగన పట్టికమాత్రం కలిగివుంది.

లేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలోని నాట్యమండపం యొక్క అధిష్టానం చాలా అందంగావుంది. అధిష్టాన క్రిందిభాగంలో ఉపానం వెడల్పుగావుంది. ఉపానం పైభాగంలో క్షుద్రపట్టిక, పద్మ, త్రిపట్ట, కుముద, గళ, ఆలింగనపట్టిక మొదలైనవి వున్నాయి. పైనున్న ఆలిం గన పట్టిక భాగంలో కూడులున్నాయి. గళ పైభాగంలో వృషభలింగసంబం ధిత శిల్పాలు వున్నాయి (ఫోటో.5). ఇదే అధిష్టానంలోని తూర్పు వైపు చాలా ఆసక్తికరమైన విషయాలు తెలుస్తున్నాయి. ఆలింగన

పట్టికలలో ఎగిరే గంధర్వులు నారిపాహిక స్థితిలో చూపబడ్డారు. ఈ నాట్యమండప అధిష్ఠానం ఎత్తు సుమారు 5 1/2 అడుగులుంటుంది. ఇదే ఆలయంలో దక్షిణ-పశ్చిమంగా (నైరుతిదిక్కున) కల్యాణమండప మున్నది. దీని అధిష్ఠానంలో ఉపాన, పట్టిక, పద్మ, వృత్తకుముద. పట్టిక, సన్ననిగళ, ఆలింగనపట్టిక వున్నాయి. ఈ అధిష్ఠానంపైన కల్యాణమండప స్తంభాలున్నాయి.

విజయనగర ఉపపీఠ, అధిష్ఠానాల గురించి ముగించేముందు వీటి ఆధారాలను గురించి తెలుసుకోవటం అవసరం. విజయనగర కాలం నాటి ఉపపీఠ, అధిష్ఠానాల విడిపోయే భాగం చాలా సన్నగా వున్న విషయం గమనించవచ్చు. విజయనగర ఉపపీఠంలోని గళభాగం చాలా వెడల్పుగా వుండి, గళ పాదాలు కలిగివుంది. వృత్తకుముద, త్రిపట్ట కుముద విజయనగర అధిష్ఠానాలలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ లక్షణాలు కలిగియున్న ఉపపీఠ, అధిష్ఠానాలు పల్లవ, చోళ ఆలయాలలో కనిపిస్తాయి. కాబట్టి పల్లవ, చోళుల రీతిని విజయనగర శిల్పులు ఉపపీఠ, అధిష్ఠానాల్ని మలచడంలో ఎక్కువగా ఆచరించారనడం సమంజసమే. అయినప్పటికీ పుష్పగిరి చెన్నకేశవాలయంలోని అధిష్ఠానం హొయసల, చాళుక్యుల రీతిని పోలి వుండటం గమనించ దగ్గ విషయం.

## కుడ్యాలంకరణ :

వివిధ ప్రాంతాలలోను, విభిన్న కాలాలలోను ఉన్నతమైన శిల్ప కళాకారులు తమ మేధా ప్రతిభలతో ఆలయం వెలుపలి గోడలను మనోహరంగాను, రమ్యంగాను తీర్చిదిద్దటంలో ఎంతో శ్రమపడ్డారు. ఈ భాగ చేత పాద లేదా కుడ్యభాగం సాధారణంగా అధిష్ఠానానికి పైన, కపోతానికి క్రింది భాగంలో వుంటుంది. విజయనగర కాలంనాటి ఆల

చూం వెలుపలి కుడ్యభాగాలను పరిశీలిస్తే ఎన్నోరకాల అలంకరణలు అప్పటి శిల్ప రీతిని తెలియజేస్తాయి.

ఈ కుడ్యభాగం అలంకరణ లేకుండానూ, అలంకరణతోను కని పిస్తాయి. మొదటి రకంలో గర్భగృహం, అంతరాళం వెలుపలి గోడలు సాదాగా కనిపిస్తాయి. దీనికి లేపాక్షి వీరభద్రాలయం పోచర్కాటి వుదా హరణ. దీని వెలుపలి గోడలు అలంకరణ లేకుండా కనిపిస్తాయి. రఘు నాథాలయానికి ప్రక్కగావున్న ఉపాలయ కుడ్యభాగం మీద మాత్రం పెద్ద చేపను చూపించారు (ఫోటో. 4). ఇలా సాదాగావున్న వెలుపలి గోడల్ని హంపీ, కదిరి, సోంపాలెం, గోరంట్ల, రాయచోటి ఆలయాలలో చూడవచ్చు. కొన్ని ఆలయాలలో మాత్రం పట్టీ లాంటిది ముందుకు పొడుచుకొని వచ్చినట్లుగా కుడ్య మధ్యభాగంలో కనిపిస్తుంది. ఉదాహర ణగా హంపీ దగ్గరలో కొండమీద నిర్మించిన ఆలయాన్ని తీసుకోవచ్చు. రెండవరకంలో కుడ్యభాగం వివిధ భాగాలుగా వుండి, చిన్న చిన్న స్తంభాలు (స్తంభికలు) గోడలో అమర్చబడి వున్నాయి. వీటిని హంపీ, పుష్పగిరి ఆలయాలలో చూడవచ్చు. మూడవ రకంలో స్తంభికలతో బాటు దేవకోష్ఠలు కనిపిస్తాయి. ఉదాహరణగా పుష్పగిరి ఉమామహేశ్వ రాలయానికి దగ్గరలో వున్న చిన్న ఆలయం, చంద్రగిరిలోని రెండు ఆలయాలు, కదిరి లక్ష్మీనారాయణ ఆలయాలను పేర్కొనవచ్చు. నాలు గవ వుదాహరణలో దేవకోష్ట స్తంభికలతోబాటు కుంభపంజర ముంటుంది. హంపీ అచ్యుతరాయ, పట్టాభిరామ, విఠల, విష్ణు ఆలయాలలోను, పుష్ప గిరి ఉమామహేశ్వరాలయం, మార్కాపురం చెన్నకేశవాలయం, శ్రీని వాసమంగాపురంలోని కల్యాణ వెంకటేశ్వరాలయం, మిట్లంపల్లి వేణు గోపాలస్వామి ఆలయాంలో పై అలంకరణలను గమనించవచ్చు. ఐదవ రకంలో యీ అలంకరణలు వుచ్చ స్థాయిలో కనిపిస్తాయి. పైన రస బరచినవే గాక వెలుపలి గోడలు కోష్టం కూడ కలిగి వుంటాయి. అంతే గాక విజయనగర శిల్పులు దేవతా ప్రతిమలు, మహాభారత, రామాయణ

గాథలను చక్కగా తీర్చిదిద్దారు. వల్లూరులోని శివాలయం, పుష్పగిరిలోని భీమలింగేశ్వరాలయం, చెన్నకేశవాలయం, హంపీలోని హజారా రామాలయం, చినకొమ్మర్లలోని చెన్నకేశవాలయం, తాడిపత్రి వెంకటరమణాలయం, పెనుగొండ రామ, శివాలయాలు మొదలైనవి వుదాహరణలుగా చెప్పవచ్చు. ఈ ఆలయాలలోని వెలుపలి గోడలమీద స్తంభికలు, దేవకోష్టలు, కుంభపంజరాలు ఎక్కువగా కనిపిస్తాయి.

## కపోతం :

ఇది గర్భగృహ, అంతరాళ, సభా మండపాల వెలుపలి భాగంలో ఉద్యాగానికిపైన, శిఖరానికి క్రిందవుంటుంది. గర్భగృహ, అంతరాళాల మీదున్న కపోతానికి కల్యాణ, సభామండపాల మీదున్న కపోతానికి కొన్ని విషయాలలో తేడా వస్తుంది. ఆ తేడాను యీ క్రింద వివరించడం జరిగింది.

గర్భగృహ, అంతరాళాల మీదున్న కపోతం పట్టీలాగా వుండి ఉద్య భాగాన్నుండి విమానాన్ని వేరు చేస్తున్నట్లుగా వుంటుంది. విజయనగరాలయాలలో కపోతం ఆరు అంగుళాల నుండి, పదహారు అంగుళాల వరకుండి ముందుకు చొచ్చుకొని వచ్చినట్లనిపిస్తుంది. వివిధ రకాల కపోతాల్ని యీ కాలంలో చూడవచ్చు.

లేపాక్షి వీరభద్రాలయంలోని రఘునాథాలయానికి కపోతం గర్భగృహం వెలుపలి గోడపైభాగంలోను, విమానానికి క్రిందిభాగంలోనూ వుంది. ఇది చూచేందుకు మందంగా వున్న పట్టీలాగావుండి ముందుకు వచ్చినట్లుగా కనిపిస్తుంది. ఈ కపోతం ఎలాంటి అలంకరణ లేకుండా సాదాగా కనిపిస్తుంది. దీని క్రింది భాగం కొంచెం ఏటవాలుగా వుంది. అడ్డానికి గీతలుకూడా వున్నాయి (ఫోటో 1).

రెండవ రకంలో కొద్ది మార్పులతో కపోతం కనిపిస్తుంది. ఈ విధమైన కపోతం త్రిపట్టను పోలివుండి, క్రింది భాగంలో చిన్న చిన్న

స్తంభాలుంటాయి. మధురైలోని ఆలయాల్లో యిలాంటి కపోతాలు న్నాయి. మూడవ రకంలోకూడా త్రిపుట్టలాగా ముందరికి వచ్చినట్లుండి సాదాగా వుంటుంది. ఉదాహరణగా హంపికి సమీపాన కొండ మీద నిర్మించిన ఆలయాలని చెప్పుకోవచ్చు. నాలుగో రకంలో కపోతం కూడులతో అలంకరించబడి వుంటుంది. ఉదాహరణగా హంపికి సమీపాన చిన్న కొండమీద నిర్మించిన ఆలయాలలో చూడవచ్చు. చివరిరకంలో అందంగా అలంకరించిన సింహలలాట కూడులుంటాయి. ఈ కూడుల లోని గూడులలో దేవతలు, మనిష తలలు, పుష్పాలంకరణలు వుంటాయి. ప్రభుగిరిపట్నం చెన్నకేశవాలయంలోని కపోత క్రింది భాగంలో పద్మం మొగ్గల వరుసవుంది.

పల్లవ, చోళ, చాళుక్య, హొయసల, కాకతీయ దేవాలయాల లోని కపోతాల్ని గమనిస్తే విజయనగర శిల్పులను ఏకాలపు కపోతాలు వుత్తేజపరిచాయో తెలుస్తుంది. పల్లవుల గుహాలయాలైన త్రిమూర్తి, వరాహ మండపాలు కపోతాన్ని కలిగివున్నాయి. ఇలాంటి కపోతమే మహాబలిపురంలోని రథాలలో కనిపిస్తుంది. వీరికాలంనాటి కంచిలోని కైలాసనాథ, వైకుంఠ పెరుమాళ్, ముక్తేశ్వర, మాతంగేశ్వర ఆల యాలలోనూ, మహాబలిపురంలోని తీరదేవాలయంలోను కపోతం చైత్య లేదా కూడులను కలిగివున్నాయి. వీరి తర్వాత పాలన కొచ్చిన చోళుల ఆలయాలలోని కపోతం కూడు వరుసలను కలిగివుంది. పల్లవ, చోళుల కాలంనాటి కపోతం ఎక్కువగా ముందుకు చొచ్చుకొని వచ్చి వుండదు. బాదామి, తూర్పు చాళుక్యుల ఆలయాలలోని కపోతం కూడా పల్లవులను పోలివుంటుంది. పరిచాళుక్య, హొయసల, కాకతీయ ఆలయాలలోని కపోతంలో మార్పు కన్పిస్తుంది. కాకతీయ కపోతం మూడు నుండి నాలుగు అడుగులు ముందుకు చొచ్చుకొని వచ్చినట్లు కనిపిస్తుంది. పైన వివరించిన వివరాల్నిబట్టి విజయనగర శిల్పులు కపోతాన్ని మలచటంలో పల్లవ, చోళుల ననుసరించారు.

విజయనగర సభా, కల్యాణమంటపాలు కొంచెం గుండ్రని ఆకారంలో వుండే చూరు కలిగివున్నాయి. ఈచూరు మామూలుగా భూమి నుండి నాలుగు అడుగులుంటుంది. ఇది మంటపం చివరలలో వున్న స్తంభాలను ఎండ వానలనుండి కాపాడుతుంది. దీనిని అందంగా మలచడంలో విజయనగర శిల్పులు ప్రతిభనంతా చూపారు. వీటిలో కూడా అలంకరణ లేకుండా కనిపించేవి, పూర్తి అలంకరణలో వున్నవి వున్నాయి.

లేపాక్షి వీరభద్రాలయంలో నాట్యమండపం చూరును కలిగివుంది (ఫోటోలు.4,5). దీని పై భాగం సాదాగావుంది, లోపలిభాగం గీతలు లాంటి అలంకరణను కలిగివుంది. ఈచూరు పైభాగంలోవున్న గోడ తక్కువ ఎత్తును కలిగివుంది. మొదటి ప్రాకారంలోవున్న స్తంభాల వసారాకూడ అర్ధచంద్రాకారపు చూరు కలిగివుంది (ఫోటో.2).

ఒక్కొక్కసారి యీ చూరులు లోపలి చివరి భాగాలందు గుండ్రని రింగులు కలిగివున్నాయి. బహుశ వుత్సవ సమయాలలో యీ రింగులకు దీపాలను వ్రేలాడదీసి వుండవచ్చు. తాడిపత్రి వెంకటరమణాలయంలో చూరు భాగంలో మరుగుజ్జులను చూపించారు. ఇక్కడ గమనించదగింది కోతిని పావురాలపైకి, మరుగుజ్జులపై కెదూకేనట్లు చూపడం. ఇక్కడ జంతువులను, పక్షులను వాస్తవంగా చూపించారు. ఇలాంటి వుదాహరణలు తిరుపతి గోవిందరాజాలయంలోను, కంచి వరదరాజాలయంలోనూ కనిపిస్తాయి.

కల్యాణ, సభామంటపాల చూరుల పై భాగంలో పిట్టగోడలుంటాయి. వివిధ రకాల పిట్టగోడలు విజయనగర ఆలయాలలో కనిపిస్తాయి. మొదటిరకంలో యీగోడల ఎత్తు తక్కువగావుంది, సాదాగా కనిపిస్తాయి. ఉదాహరణలు లేపాక్షి వీరభద్రాలయం (ఫోటోలు.4,5), హంపీ విరూపాక్షాలయానికి సమీపంలో కొండమీదున్న ఆలయాలు. రెండవరకం తాడిపత్రి వెంకట రమణాలయపు దేవి మండప ముఖ

మండపం పైభాగంలో గమనించవచ్చు. ఇక్కడ గోడ వాకటిస్సర అడుగుల ఎత్తునుండి అల్ప, మహాపట్టికలు కలిగివుంది. ఇంకా యిక్కడ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే పిట్ట గోడపైభాగంలో చిన్న చిన్న గుడులుండటం. అందులో ఆసీనదేవతా ప్రతిమలున్నాయి. ఇక అభివృద్ధి దశకు వుదాహరణగా హంపి, తాడిపత్రి, సోంపాలెం, శ్రీకాళహస్తి, మార్కాపురం ఆలయాలలో గమనించవచ్చు. ఇటుకలు, సున్నంతో నిర్మించిన పిట్టగోడల పైభాగాన స్తంభికలలో నిర్మించిన మండపాలున్నాయి. ఇవి తోరణం కూడా కలిగివున్నాయి. కొన్నింటికి ఏక తల ద్రావిడ విమానాలున్నాయి. ఇలా పిట్టగోడపై చిన్న చిన్న విమానాల్ని నిర్మించడం పల్లవుల కాలంనుండి వాడుకలోవుంది. మహాబలిపురంనందలి త్రిమూర్తి గుహాలయం, కంచిలోని కైలాసనాథ, వైకుంఠపెరుమాళ్, ముక్తేశ్వరాలయాలలో గమనించవచ్చు. చోళ ఆలయాలలో యీ భాగంలో మరుగుజ్జులు, ఏనుగులు, చైత్యమొదలైన అలంకరణలు కనిపిస్తాయి. మరికొన్ని వుదాహరణలలో శాలా శిఖరాలుండి పైనకలశాలు కూడా కలిగివున్నాయి. బాదామి చాళుక్యుల, మలిచాళుక్యుల, హొయసల, కాకతీయ ఆలయాలలో కూడా పిట్టగోడలు వివిధాలంకరణలతో వుండటం కనిపిస్తుంది. విజయనగర ఆలయాలలోని పిట్టగోడలు చాలా వరకు పల్లవ, చోళుల పిట్టగోడలను పోలివుండి కొంచెం క్రొత్తదనం కూడా కలిగివున్నాయి.

తర్వాత బహిర్వాస్తులో వేదిబంధ, ఆసనపట్టిక లేదా కక్షాసన వుంటాయి. వేదిబంధ మామూలుగా అధిష్ఠానం చుట్టూ వుంటుంది. ఇది మూడునుండి నాలుగు అడుగుల ఎత్తుండి స్తంభాలకు పీఠంగా వుపయోగపడ్తుంది. కక్షాసన లేదా ఆసనపట్టిక మామూలుగా సున్నటి పలకలాగుండి, వేదిబంధ అంచులలో అమర్చబడి వుంటుంది.

లేపాక్షి వీరభద్రాలయంలోని ప్రధానాలయంలో వేదిబంధ, ఆసన పట్టికాలేవు. మిగిలిన విజయనగర ఆలయాలలో వేదిబంధ కనిపిస్తుంది. ఆసనపట్టిక మాత్రం చాలా అరుదుగా ఈ ఆలయాల్లో కనిపిస్తుంది.

ఎందుకీ శిల్పులు ఆసనపట్టికపట్ల అయిష్టత చూపారో కూడ చెప్పవచ్చు సాధారణంగా సగా, కల్యాణమండపాలలో పెద్ద పెద్ద స్తంభాలుండి వీటి పీఠం చాలా వెడల్పుగా వుండి ఆసనపట్టిక లాగా వుపయోగపడుతుంది. ఆసనపట్టిక అంతగా అవసరంలేదు కాబట్టి శిల్పులు అయిష్టత చూపారు. అయినప్పటికీ హంపీ విరూపాక్షాలయం దగ్గరలో కొండ మీదున్న ఆలయాలలోనూ, తాడిపత్రి వెంకటరమణాలయంలోనూ కనిపిస్తుంది.

## విమానం :

ఇది గర్భగుడి గోడలమీద నిర్మించబడి వుంటుంది. బహిర్వాస్తులో విమానం చెప్పుకోదగ్గ ప్రాముఖ్యత గలభాగం. ఇది గోపురంలాగా దూరంనుండే చూపరులను ఆకట్టుకొనటమే కాకుండా, ఆలయ గాంభీర్యానికి తోడ్పడుతుంది. శిల్పులు తమ పనితనాన్ని, నైపుణ్యతను, శిల్పరచనాశక్తిని ప్రదర్శించుకోడానికి యిది వుపయోగపడుతుంది.

లేపాక్షి వీరభద్రాలయంలోని ప్రధానాలయం, ఉపాలయాలు 'పిరమిడ్' ఆకారంలో గల విమానాలను కలిగివున్నాయి. కానీ కొన్ని విజయనగర ఆలయాల గర్భగుడులు మెట్లాకారంలో పిరమిడ్లను పోలిన విమానాలను కూడా కలిగి వున్నాయి. ఈ రెండు రకాల విమానాల గురించి తెలుసుకోగలిగితే విజయనగర విమానాల పూర్తి వివరాలు తెలుస్తాయి.

మెట్ల ఆకారంలోవున్న విమానాలు విజయనగర ఆలయాలలో అరుదుగా కనిపిస్తాయి. హంపీ విరూపాక్షాలయానికి సమీపంలో కొండ మీదున్న త్రికూటాలయంలోనూ, పుష్పగిరి చెన్నకేశవాలయానికి దక్షిణంగావున్న ఉపాలయాలలోను, ముసలపాక ఉపాలయాలలోను యిలాంటి విమానాలు కనిపిస్తాయి. క్షుణ్ణంగా పరిశీలించినచో మూడు రకాల వుదాహరణలు కనిపిస్తాయి. మొదటి రకానికి వుదాహరణ పుష్పగిరి సమీపంలో వున్న ఆలయాలలో గమనించవచ్చు. ఇవి చతురస్రాకారంలోవుండి వీటి సోపానాలు పైకి పోను పోను తగ్గుముఖంగా వుంటాయి. ఈ సోపానాలు

సమంగా రెండు బయటికి, మరొకటి లోపలికి వున్నట్లుగా అమర్చబడి వున్నాయి. పైభాగంలో గ్రీవ చతురస్ర శిఖరం కలిగి వున్నాయి. రెండవ రకం హంపిలోని త్రికూటాలయాలలో కనిపిస్తుంది. ఇక్కడ కూడా పైలాగే చతురస్రాకారంలో పైకి పోను పోను తగ్గుముఖంగా ఎనిమిది పంసానాలు వున్నాయి. ఇంకా వేది, గ్రీవ, చతురస్ర శిఖరా లున్నాయి. పంసానానికీ యింకొక పంసానానికీ మధ్యలోని భాగం లోప లికి వుంది. ఈ విమానాల మధ్యభాగంలో క్రిందనుండి పైకి రాహాపాగ వుండి పైకిపోను యిదికూడా తగ్గుముఖంగా కనిపిస్తుంది. ఇందులో కీర్తిముఖం కలిగినకూటములున్నాయి. రాహాపాగా నిలువుకూ, పంసానాలు అడ్డానికీ వుండి యీ విమానాలలో శిల్పులు నిలువుకు, అడ్డానికి సమాన ప్రాముఖ్యానిచ్చారు. మూడవరకం మునులపాక సమీపంలోని ఉపాల యాల విమానాలలో గమనించవచ్చు. పై రెండు రకాల విమానాలు రాతితో నిర్మించినవి. కానీ యీ వుదాహరణలో యిటుకలు సున్నంతో నిర్మించబడి వున్నాయి. ఇది చాలావరకు పై రెండు వుదాహరణలో తెలిపినట్లే వుండి కొద్దిపాటి మార్పు కనిపిస్తుంది. విమానం క్రిందిభాగం త్రిపట్టులాగే వుండి కపోతంగా వుపయోగపడుతుంది. దీని విమానం చతురస్ర శిఖరం కలిగివుండి, రెండుభాగాలుగా విభజింపబడి వుంటుంది. దీని క్రిందిభాగం వెడల్పుగావుంది. నాలుగు మూలలా వ్యాళ ప్రతిమ లున్నాయి. ఇలాంటి లక్షణాలున్న శిఖరాగ్రం తలములు కలిగిన విమా నాలలో కనిపిస్తుంది. ఎందుకోగాని యిలాంటి విమానాలను విజయనగర శిల్పులు ఎక్కువగా ఆదరించలేదు. ఇలాంటి విమానాలు బాదామి చాళుక్య, కాకతీయ ఆలయాలలో మనం గమనించవచ్చు.

ఇక రెండవ రకమైన విమానాలు తలములను వొక దానిపై వొకటి కలిగివుంటాయి. ఇలాంటి విమానాల్లో పంసానాలుండవు. ఈ రకపు విమానాలను విజయనగర శిల్పులు అధికంగా నిర్మించారు. ఈ విమానాన్ని ద్రావిడ విమానమంటారు.

ఇలాంటి విమానాలు విజయనగర కాలానికి చెందిన మొట్ట మొద టివి హంపిలో కొండమీద నిర్మించిన ఆలయాల గర్భగుడులపై కని

పిస్తాయి. ఇవి ద్వితలములు కలిగివున్నాయి. వీటి నిర్మాణానికి రాతిని యిటుకలను వాడారు. దీని చతురస్ర శిఖరం రెండు భాగాలుగా వుండి క్రిందిభాగం చతురస్రంగా వుంది. ఇంకొక విమాన చతురస్ర శిఖరం గ్రీవకోష్టమును కలిగివుంది. తర్వాతి అభివృద్ధి దశను చంద్రగిరి ఆలయాలలో గమనించవచ్చు. ఈ విమానాలు కర్ణకూట కోష్ట, భద్రశాల కోష్ట, నేత్రకోష్టలు కలిగివున్నవి. పూర్తిస్థాయి అభివృద్ధి దశలోవున్న విమానాలు కర్ణ, భద్ర, నేత్ర, క్షుద్రకోష్టాలు కలిగివున్నాయి. కోష్టాల లోపల, వెలుపల విమానదేవతల ప్రతిమలున్నాయి. గ్రీవ భాగాలలో ఆసీనదేవతా ప్రతిమలున్నాయి. చతురస్ర లేదా వృత్త శిఖరాలుండి సింహాలలాట కూడులు కలిగివున్నాయి.

లేపాక్షి వీరభద్రాలయంలోవున్న విమానాలు అభివృద్ధి దశను చూపిస్తున్నాయి. ఇవి యిటుక సున్నంతో నిర్మించినవి. ప్రతి తలము కర్ణ కోష్ట, నేత్రకోష్ట, భద్రకోష్టలు కలిగివున్నాయి. ఒక తలానికి మరొక తలానికి మధ్య నున్న స్థలం తక్కువగా వుండటం వల్ల దూరం నుండి చూసినప్పుడు పాకే ముద్ద ఆకారంలో కనిపిస్తుంది. తలములపై నున్న వేది చతురస్రాకారంగా వుండి మనోహరంగా మలచబడివుంది. వేదిలోపలి భాగాన మరుగుజ్జులు భారవాహక స్థితిలో చూపబడ్డారు. లేపాక్షిలోని విమానాల శిఖరాగ్రం చతురస్ర శిఖర, వృత్త శిఖరాకారాలలో కనిపిస్తాయి. రఘునాథాలయ విమానం చతురస్ర శిఖరాన్ని కలిగి వుండి కూడు అలంకరణలలో వుంది. ప్రధానాలయ విమానం, పార్వతి మందిర విమానం వృత్త శిఖరాన్ని కలిగివుంది (ఫోటోలు, ఉపరి లట్టు, 4). ఇలాంటి విమానాలు సోంపాలెం, హంపి, పుష్పగిరి ఆలయాలలో కనిపిస్తాయి.

హంపిలోని అచ్యుతరాయ, విఠల, హజారా రామ, నారాయణ వన కల్యాణ వెంకటేశ్వర, తాడిపత్రి రామలింగేశ్వర ఆలయాలలోని దేవి మందిరాల విమానాలు శాల శిఖరాలు కలిగి వుండటం గమనించవగ్గ

విషయం. ద్వితల విమానాలు చతురస్రాకారంలో వున్నాయి. శాలా శిఖరాలున్న విమానాలు విజయనగర ఆలయాలలో తక్కువగా కనిపిస్తాయి. ఎందుకంటే చతురస్ర విమానానికి శాలా శిఖరానికి పొంతన లేకపోవడమే.

ఇక చివరగా విమాన భాగానికి అంటివున్న మహానాసికం గురించి తెలుసుకొంటే విజయనగర విమానం గురించి పూర్తిగా తెలుసుకొన్నట్టే. ఇది విమాన భాగంలో కలిసివుండి గర్భగుడికి ఆనుకొనివుండే అంతరాళ పైకప్పు పైకి వ్యాపించి వుంటుంది. ఇది రెండు విధాలుగా వుపయోగపడ్తుంది. గర్భగృహం మీదున్న విమానానికి యింకొంచెం పట్టుగా వుండి విమానం బరువును అంతరాళపు గోడలుకూడా మోసేటట్లు చేస్తుంది. మరియు శిల్పుల పనితనాన్ని నిరూపించుకోవడానికి ప్రదర్శించుకోవడానికి కూడా వుపయోగపడుతుంది.

లేపాక్షివీరభద్రాలయ ప్రాంగణంలో మహానాశిక కనిపించదు. కానీ విజయనగర అలయాలైన హంపీ సమీపంలోని కొండమీద నిర్మించిన ఆలయాలలోనూ, హజారారామ, శివాలయాలలో మహానాశికం కనిపిస్తుంది. మహానాశికాన్ని మొదట ప్రవేశపెట్టింది బాదామి చాళుక్యులు. తరువాత మలిచాళుక్యులు, హోయసలులు అనుసరించారు. పల్లవ, చోళ, పాండ్య లీవిషయంలో ఆసక్తి చూపలేదు. కాబట్టి విజయనగర శిల్పులు మహానాశికాన్ని నిర్మించడంలో మలిచాళుక్య, హోయసలులను అనుసరించినట్లు తెలుస్తుంది.

ఇప్పటి వరకు తెలుసుకున్న బహిర్వాస్తు వివరాలను బట్టి విజయనగర శిల్పులు ఆలయాలు గట్టిగానూ, భద్రతగానూ వుండుటకు ఉపపీఠ, అధిష్ఠానాలను ఏర్పరచారని గ్రహించవచ్చు. ఈ రెండు భాగాలు విడిపోవు భాగం చాలా తక్కువగా వుంటుంది. అంతేగానీ కొంతమంది చరిత్రకారులు తెలిపినట్లు ఉపపీఠం విజయనగరాలయాలలో కానరాదనడం పరిశీలనాలోపమే. విజయనగర ఉపపీఠ, అధిష్ఠానాలు

చోళ, పాండ్యులను పోలివున్నాయి. కుడ్యభాగాన్ని స్తంభాలు, కోష్ఠాలు, శిల్పాలు, కుంభపంజరాలు మొదలయిన అలంకరణలతో ఎంతో అందంగా విజయనగర శిల్పులు తీర్చిదిద్దారు. ఈ విషయంలో పల్లవులే మొట్ట మొదట స్తంభాలు, కోష్ఠాలను తమ ఆలయాలలో వాడారు. మహాబలిపుర రథాలలోను, తీరదేవాలయంలోను, కంచిలోని కైలాసనాథ, మాతంగేశ్వర, ముక్తేశ్వర, వైకుంఠ పెరుమాళ్ ఆలయాలలో గమనించవచ్చు. చోళుల ఆలయాల్లో కుడ్యభాగం అలంకరణ తారాస్థాయినందుకొన్నది. ఈ కుడ్య అలంకరణలో విజయనగర శిల్పులు పల్లవ, చోళుల ఆలయాల్ని చూసి వుత్తేజపడినట్లుగా చెప్పుకోవచ్చు. ఈ విషయంలో పుష్పగిరి చెన్నకేశవాలయ కుడ్యభాగం మాత్రం ప్రతి అంగుళమూ శిల్పులపనితనానికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు. ఇలాంటి అలంకరణను హొయసలుల హళేబీడులో గమనించవచ్చు. పుష్పగిరి చెన్నకేశవాలయ అధిష్టానంకూడా హొయసల రీతిని పోలివుండుట గమనించవచ్చు. కాబట్టి విజయనగర శిల్పులు హొయసలులను కూడా వొకొక్కసారి అనుసరించినట్లు తెలుస్తున్నది. విజయనగర విమానాలు ద్రావిడ విమానాలను, మెట్ల ఆకారంలోవున్న విమానాలు, మహానాసికను కలిగివున్నవి. మెట్ల ఆకారంలో వున్న విమానాలు, మహానాసికలు బాదామి, పులిచాళుక్యుల ఆలయాల్లో కనిపిస్తాయి. ఇలాంటివి పల్లవ, చోళ, పాండ్యాలయాలలో కనిపించకుండుట గమనార్హం. విమానాలు శాల శిఖరాలను కలిగివుండటాన్ని పల్లవ, చోళ, పాండ్య ఆలయాలలో కనిపిస్తాయి. కానీ బాదామి, పులిచాళుక్య, హొయసల ఆలయాలలో యీ లక్షణం కనిపించదు. కాబట్టి విజయనగర శిల్పులు చాలా విషయాలలో చాళుక్య, పల్లవ, చోళ, పాండ్యులను అనుసరించి తమ మేధస్సును, నైపుణ్యాన్ని ప్రదర్శించి ఆలయాలను అందంగా తీర్చిదిద్దారు.

నాల్గవ అధ్యాయం

# అంతర్వాస్తు

ఈ అధ్యాయంలో లేపాక్షి వీరభద్రాలయ అంతర్వాస్తును గురించి వివరించటం జరిగింది. మిగిలిన విజయనగరాలయాలలో అంతర్వాస్తు అభివృద్ధి కూడా తులనాత్మకంగా వివరించే ప్రయత్నం జరిగింది. అంత ర్వాస్తులో స్తంభాలు, ద్వారాలు, వితానాలు ముఖ్యమైనవి. ఈ భాగాలలో శిల్పుల మేధా సంపత్తి వుచ్ఛ స్థాయిలో కనబడుతుంది. అంతర్వాస్తు లోని ప్రతిభాగాన్ని విడదీసి పూర్తి వివరాలతో యీ క్రింద పరిశీలించ డం జరిగింది.

## స్తంభాలు :

లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్య, కల్యాణ, సభామండపాలు, స్తంభాలతో నిర్మించిన వసారాలు వివిధ రకాలకు చెందిన స్తంభాలను కలిగి వున్నాయి. అందులో ముఖ్యమైనవి చతురస్ర, దీర్ఘచతురస్రా కారపు స్తంభాలు మరియు నిటారుగా వాకక్రమ పద్ధతిలో లోపలివైపుకి కొంత లోతుకి అంచులు కలిగి వున్నట్లు మలచివున్న స్తంభాలు మొద లైనవి. ఈ స్తంభాల గురించి పోల్చి చూచేందుకుగాను మిగిలిన విజయనగర స్తంభాలను కూడా పరిధిలోనికి తీసుకోవడం జరిగింది. ఆల యాలలోనూ, ఆలయాల ముందు కనిపించే ఏక స్తంభాల గురించి, ఆల యాల ముందుండే తోరణాలను గూర్చి కూడా యీ క్రింద వివరించ బడింది.

ఆలయ లోపలి భాగంలో స్తంభాలు చాలా ముఖ్యమైనవి. గర్భ గృహం, అంతరాళం, విమానం ఎత్తు, గాంభీర్యం ఉపపీఠ, అధిష్ఠానాల మీద ఆధారపడి వుంటుంది. ముఖ, సభా, కల్యాణ, నాట్యమండపాల ఔన్నత్యం స్తంభాల మీద ఆధారపడివుంటుంది. మండపాలకు ఔన్నత్యం చేకూర్చుటమేగాక శిల్పుల నైపుణ్యాన్ని ప్రదర్శించుకోవడానికి అవకాశం

దొరుకుతుంది. విజయనగర ఆలయాలలో విగ్రహము కలిగించే స్తంభాలు కూడా వున్నాయి.

లేపాక్షి, ఇతర విజయనగర స్తంభాలు గురించి తెలుసుకునేముందు స్తంభ భాగాల్ని గురించి తెలుసుకొనుట అవసరం. పీఠం, పాదపైన మధ్యభాగం, స్తంభఫలకం లేదా శీర్షిక, బ్రాకెట్టు మొదలైన భాగాలను స్తంభం కలిగివుంటుంది. మలిచాళుక్యుల కాలంలో స్తంభం వొకేరాతిలో మలచినదిగా కాకుండా పైన తెలిపిన విడిభాగాలను స్తంభంగా ఏర్పర చాడు. పీఠం లేదా అశ్వపాదం మామూలుగా చతురస్రాకారంలో వుంటుంది. స్తంభం మధ్య భాగం చతురస్రంగా లేదా ఎనిమిది ముఖాలు కలిగి లేదా గుండ్రంగా వుంటుంది. దీనిపైభాగం గుండ్రంగావుండి పైన 'అబేకస్'కు నాలుగు వైపులా బ్రాకెట్లున్నాయి. ఇలాంటి స్తంభాలు మలిచాళుక్యుల, తూర్పు చాళుక్యుల, కదంబ, కాకతీయ ఆలయాల్లో గమనించవచ్చు. ఇలాంటి స్తంభాలు విజయనగర ఆలయాలలోకూడా కనిపించడం వలన యీ శిల్పులను మలిచాళుక్యుల వాస్తు ప్రేరేపించి నట్లు తెలుస్తుంది. విజయనగర ఆలయాల్లో వివిధ రకాల స్తంభాల ఆకారం, పరిమాణం, అలంకరణలు మొదలైన అంశాలు పరిధిలోనికి తీసుకొని క్రింద వివరించబడింది.

(1) పైన తెలిపిన మలిచాళుక్యుల రీతిని పోలివున్న స్తంభాలు లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్యమండపానికి ప్రక్కనున్న మండ పంలో కనిపిస్తాయి (ఫోటో. 6). ఇవి పీఠం, స్తంభ మధ్యభాగం, గుండ్రని చక్రాకారం, అబేకస్ (పలక క్రింది భాగంలో గుద్దాకారంలో వుంటుంది) బ్రాకెట్టు కలిగి వున్నాయి. స్తంభం క్రింది భాగమైన పీఠం లేదా అశ్వపాదం రెండు సాదా పట్టీలలో మధ్యలో గళ భాగంలోవుంది. రెండు పట్టికలను చతురస్రాకారపు రాతితో మధ్యభాగం కలుపుతుంది. స్తంభ మధ్యభాగంలో ఎనిమిది ముఖాలను చూపి క్రింద, పైన చతురస్రాకారాలు గా మలచబడివుంది. అష్ట ముఖాలున్న భాగాన్ని నిలువుకు, అడ్డానికి

స్తంభం పైన కొంతమేరకు పోతుకనిపించేలా తీర్చిదిద్దారు.
వున్న చతురస్ర భాగాలమీద శిల్పాలు చెక్కబడి వున్నాయి
బోదంపై వున్న గుండ్రని చక్రభాగం కుంభం ఆకారంలోన
భాగంలో అబేకస్ వుంది కొద్ది క్రింది భాగంలో రెండు గ
లున్నాయి. అబేకస్ పైన పలక చాలా వెడల్పుగా వుంది
కలిగివుంది. ఇలాంటి స్తంభాలే కొద్ది మార్పులతో సో
కేశవాలయముందలి ...మండపంలో కనిపిస్తాయి. ఇక్కడ
వున్న పైపట్టీ మీద కూడా అలంకరణ వుంది. ఈ రెం
ణలలో స్తంభం పై భాగంలో విజయనగర పుష్ప పోతిక

(2) ఈ రకానికి సంబంధించిన స్తంభాలు పుష్
శ్వరాలయం, హంపి హజారారామాలయంలో గమనించ
గిరి వుదాహరణలో అబేకస్ కనిపించదు. పీఠం పట్టిక
సాదాగా వున్నాయి. ఈ స్తంభాల క్రిందిభాగం దీర్ఘచత
వుంది. పైన అష్టముఖాలున్న భాగం,చతురస్రాకారం, తర
లున్న భాగం వుంది, అన్నిసాదాగావున్నాయి. హంపి
అశ్వపాదం కూడులను కలిగివుంది. పైభాగంలో వున్న
చాలా పదునుగా వున్నట్లుంది. పుష్పగిరి వుదాహరణం
కారం సరిగా మలచ బడలేదు. వీటి బ్రాకెట్లు చోళ స్తం
వున్నాయి.

(3) ఈ రకానికి వుదాహరణలను పుష్పగిరి సం
స్తంభాలలో గమనించవచ్చు. పీఠం పైభాగం గుండ్రని
వున్న స్తంభభాగం దీర్ఘ చతురస్రం, చతురస్రాకారా
మధ్యలో అష్టముఖం బాగా గుండ్రంగావుంది సింహాల
వివిధ ప్రతిమలతో నింపబడివుంటుంది. మిగిలిన భాగాల్లో

(4) ఈరకంలో విజయనగర శిల్పులు స్తంభా
తీర్చిదిద్దడంలో పూర్తిగా వుత్తీర్ణులైనట్లు తెలుస్తుంది.

తాడిపత్రి వెంకటరమణాలయంలోని దేవమండపంలో గమనించవచ్చు. ఇవిచాలావరకు పశ్చిమచాళుక్యుల స్తంభాలను పోలివున్నాయి. ఈ స్తంభాల మధ్య అష్టముఖ భాగంవుంది. పైన, క్రింద దీర్ఘ చతురస్రాకారాలు న్నాయి. స్తంభంమీద త్రితల ద్రావిడ విమానం మలచబడింది. క్రింద భాగంలో చిన్న దేవకోష్టముంది, దానిలోపలి గూటిలో మోగాడిని చూపించారు. దీనిపైన స్తంభిక విమానముంది. దాని తలపైన నాలుగు తలములు కలిగిన ద్రావిడ విమానముంది. అబేకస్ ఏర్పరించిన పద్మం లాగా వుంది. పలక క్రిందిభాగంలో నలుమూలలా పద్మం మొగ్గలు వ్రేలాడినట్లున్నాయి.

పైన వివరించిన వివిధరకాల స్తంభాలు పశ్చిమ చాళుక్యులను పోలి నప్పటికీ కొన్ని రీతులలో తేడాకన్పిస్తుంది. ఈ విజయనగర స్తంభాలు చాళుక్య స్తంభాలతో పోల్చితే చాలావరకు తక్కువ అలంకరణతో వున్నట్లు తెలుస్తుంది. స్తంభం పైభాగంలోనూ, అబేకస్ క్రిందవుండే గుండ్రని చక్రాకార విషయంలో కూడా తేడా కనిపిస్తుంది. చాళుక్యుల స్తంభాలలో యీభాగం కీర్తిముఖాలు, హంసలు, నాట్యప్రతిమలు మొదలైన అలంకరణలు కనిపిస్తాయి. ఇలాంటి అలంకరణలు విజయనగర స్తంభాలలోని చక్రభాగంలో కానరావు. చాళుక్యుల స్తంభాలలో మధ్య భాగంలో తలక్రిందలైన గంట ఆకారం వుండటం విజయనగర స్తంభాలలో కనిపించదు.

పైన పశ్చిమచాళుక్యుల స్తంభాలను పోలిన విజయనగర స్తంభాలను గురించి తెలుసుకొన్నాం. ఈ క్రింద చతురస్రాకారంగా వున్న విజయనగర స్తంభాలను గురించి వివరించడం జరిగింది.

(1) దీనికి ఉదాహరణగా లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్యమండప స్తంభాలను తీసుకోవచ్చు. ఇవి చతురస్రాకారంగా వున్నాయి. పీఠం రెండుపట్టికలతో గళభాగం చెరిగివున్నది. మధ్య భాగంలో పట్టీలను రాతిదిమ్మెలలో చలిపినట్లుంది. దీనిపైనున్న స్తంభం

మూడు చతురస్రాలుగా విభజింపబడివుంది. మధ్యభాగంలో అష్టముఖ
భాగం నిలువుకి, అడ్డానికి తీర్చబడివుంది. చతురస్రాకారపు భాగాల నలు
వైపులా ప్రతిమలున్నాయి. స్తంభ పైభాగం చోళ స్తంభాలను పోలి
వుంది. ఈ స్తంభం సుమారుగా 16 అడుగులుంది. యిలాంటి స్తంభమే
కొద్ది తేడాలతో యిదే ఆలయంలో కనిపిస్తుంది. ఇది క్రింది నుండి
పైకి చతురస్రాకారంలో వుంటుంది. ఇక్కడ గమనించదగ్గ అంశం
స్తంభం మీద స్తంభిక ప్రాసాదను చూపించడం. మామూలుగా స్తంభిక
పైన విమానముంటుంది. కానీ యిక్కడ చిన్న గుడి అతి సున్నితంగా
మలచబడివుంది. ఈ స్తంభిక ప్రాసాదను ఒక మరుగుజ్జు మోస్తున్న
ట్లుగా క్రింది భాగంలో మలచారు. ఇలాంటిదే యింకో రకమైన స్తంభం
నాట్యమండపంలో గమనించవచ్చు. ఈ స్తంభం మీద హంసలు, పుష్పా
లంకరణలు, ఆసీన శార్దూలంవుంది. ఈ స్తంభం విజయనగర పుష్పపోతిక
కలిగివుంది.

(2) సోంపాలెం చెన్నకేశవాలయంలో యీ రకానికి సంబంధిం
చిన స్తంభాలున్నాయి. ఇవి చతురస్రాకారంగా పైనుండి క్రిందివరకు
ఒకేరాతిలో మలచబడివుంది. మరుగుజ్జును ధారవాహిక స్థితిలో చూపిం
చారు. ఈ స్తంభంలో ఆసక్తికరమైన విషయమేమిటంటే పెద్ద స్త్రీ
ప్రతిమ చేతులతో పూర్ణకుంభాన్ని పట్టుకొని నిలుచొనివుండటం. ఇలాంటి
స్తంభాలు తాడిపత్రి వెంకటరమణాలయంలో కూడా గమనించవచ్చు.

(3) ఈరకమైన స్తంభం అన్ని భాగాలూ ఒకే రాతిలోమలచ
బడి వుంటుంది. మిల్లంపల్లి చెన్నకేశవాలయంలో యిలాంటి స్తంభం
వుంది. దీన్ని అన్నింటికంటే ఉత్తమమైందిగా చెప్పుకోవచ్చు. ఈ
స్తంభపు ప్రతి అంగుళమూ అందంగా తీర్చిదిద్దబడివుంది. దీని క్రింది
పైభాగాలలో ద్వితల ద్రావిడ విమానాలను కలిగివున్న ఆలయాలు
సున్నితంగా మలచబడి వున్నాయి. ఈ ఆలయాల క్రింది భాగం అధి
ష్ఠానం కలిగివుంది. అందులో మరుగుజ్జులు ధారవాహిక స్థితిలో చూప
బడ్డారు. ఈ ఆలయాల కుడ్య, కపోత, విమాన భాగాలను ఈ స్తంభం

మీద చూపడం శిల్పిని కసమా? లేక యంత్రపు పనితనమా అని పిస్తుంది. విమానాల కిరువైపులా ఎగిరే గంధర్వులు చూపబడ్డారు. ఇంకా యిక్కడ ఆశ్చర్యకరమైంది ఏమిటంటే యీ ఆలయాలకు పోవు వాటి మెట్లతో దారిచూప మంపబడి యాత్రికులను మెట్లమీద చూపడం.

(4) ఈ రకానికి సంబంధించిన స్తంభాలు లేపాక్షి వీరభద్రాలయ కల్యాణ మండపంలో కనిపిస్తాయి (ఫోటో. 7). ఇది ఏక స్తంభంగా వుండి, పైన నాలుగు వైపులా పుష్పపోతిక యుంటాయి. క్రింది పీఠం రెండు పట్టికల మధ్యలో గళభాగం వుంది. స్తంభ మధ్యభాగం మూడు చతురస్రాలుగా మధ్యలో గుండ్రని పట్టీలతో కనిపిస్తుంది. ఈ స్తంభాల మీద పుష్ప సంబంధిత అలంకరణలున్నాయి. కొద్ది తేడాతో యింకొన్ని స్తంభాలు యిదే మండపంలో కనిపిస్తాయి (ఫోటో. 7).

వీరభద్రాలయ నాట్య మండపంలోని స్తంభాలు అశ్వపాదం, పద్మపట్టిక, గళ, త్రిపట్ట, అలింగన పట్టిక, కూడు కలిగివున్నాయి. ఇవి విజయనగర పుష్ప పోతికలను కలిగివున్నాయి. ఇక్కడ గమనించ దగింది యీ స్తంభం మీద వరుసగా పైకి శాంకోష్ఠలు, కూటకోష్ఠలు మలచబడి వుండటం. ఇలాంటి స్తంభాలు మామూలుగా కల్యాణ, నాట్య మండప మధ్య భాగంలో వుండటం గమనించవచ్చు. ఉదాహరణగా సోంపాలెంలోని చెన్నకేశవాలయం, హంపీలోని విఠలాలయం, తిరుపతి గోవిందరాజాలయాలలోని స్తంభాలలో చూడవచ్చు.

స్తంభం వుప స్తంభాన్నికాని, వుప స్తంభాలను గాని కలిగివున్నవి విజయనగర కాలంలో చాలా కనిపిస్తాయి. మొదటి రకానికి సంబంధించి నవి హంపీ అచ్యుతరాయ ఆలయంలో కనిపిస్తాయి. ఈ స్తంభాలు వుప స్తంభాన్ని కలిగి వున్నప్పటికీ ప్రధాన స్తంభం నుండి వేరుచేయ లేనట్లు కలిసిపోయి వున్నాయి. రెండవ వుదాహరణ శ్రీశైలం పాతాళే శ్వరాలయంలో చూడవచ్చు. ఈ స్తంభం ప్రతి అంగుళం అందంగా

చెర్చిబడ్డబడింది. ప్రధాన స్తంభం, ఉప స్తంభం వొకే పీఠంమీద వున్నాయి. ఈ స్తంభం మీద శాలకోష్ఠలు మధ్య మధ్యలో పట్టికలు, కూడలు వున్నాయి. దీని ఉప స్తంభ పలకమీద వొక ప్రతిమను మల చారు. స్తంభ ఉప స్తంభాన్ని పుష్ప సంబంధిత డిజైనులతో కలపడం జరిగింది. మరొక రకమైన స్తంభాలను ప్రాకారాల కిరుప్రక్కలావున్న వసారాలలోని మండపాలను ఉదాహరణగా తీసుకోవచ్చు. వీటిలో ప్రధాన స్తంభం నుండి ఉప స్తంభం వేరుగా కనిపిస్తుంది. ఈ స్తంభాల కున్న మరొక లక్షణం ఏమిటంటే సింహ లేక వ్యాళ స్తంభ క్రింది భాగంలోవుండి తలమీదగానీ లేదా పైభాగంలో గానీ తనే బరువు మోస్తున్నట్లుగా వుంటుంది. ఈ రకమైన స్తంభాలు లేపాక్షి వీరభద్రా లయం (ఫోటో. 2), హంపీలోని అచ్యుతరాయ, తిరుమల వెంకటేశ్వ రాలయాలలోని వసారాలో కనిపిస్తాయి. లేపాక్షి వీరభద్రస్వామి ఆల యంలో గమనించదగ్గ విషయమేమిటంటే ఉప స్తంభాన్ని ఆసీన మాన వుడు మోస్తున్నట్లుగా వుండటం (ఫోటో. 2). ఇలాంటి రీతిని పోలిన స్తంభం మరే విజయనగర స్తంభాలలోనూ కానరాదు. ఈ స్తంభాలన్నీ వొకే ఉప స్తంభాన్ని కలిగివున్నాయి. తిరుమల వెంకటేశ్వరాలయం తిరుమలరాయ మండపంలోని ఉప స్తంభ పలక పైభాగాన వ్యాళపై మనిషి స్వారీ చేస్తున్నట్లు చూపబడింది.

ఇంకో రకంలో స్తంభానికి వొకటికంటే ఎక్కువ ఉప స్తంభాలుం టాయి. ప్రధాన స్తంభానికి చుట్టూ పన్నెండు ఉప స్తంభాలున్న ఉదా హరణలు కూడా విజయనగర ఆలయాలలో కనిపిస్తాయి. ఆ విధంగా వొకటికన్నా ఎక్కువ ఉప స్తంభాలు కలిగిన ఉదాహరణలు లేపాక్షి (ఫోటో. 5), తాడిపత్రి, హంపీ, సోంపాలెం, తిరువణ్ణామలై, తిరుపతి, మంగాపురం, మార్కాపురంలలో గమనించవచ్చు. హంపీ, విఠలాలయ మందలి యీ ఉప స్తంభాలను సప్తస్వరాలు పలికించేటట్లు అద్భుతమైన శిల్పకలా కౌశల్యాన్ని చూపెట్టిన శిల్పులు ఎప్పటికీ ఆరాధ్యులే. దృశ్య

సౌందర్యాన్ని శిల్పంలో బంధించి శాశ్వతత్వం కలిగించిన శిల్పులు శబ్ద సౌందర్యాన్ని కూడా శిల్పస్థం చేసి అమరం చేయడం మానవ నాగరిక కళా ప్రపంచంలోనే అసాధారణమైన, అపూర్వమైన సన్నివేశంగా ఎప్ప టికీ చరిత్రలో చెప్పుకోవాల్సి వుంటుంది.

ఇంకో రకమైన స్తంభాలు పుష్ప స్తంభాల బదులుగా అదేస్థానంలో వింతజంతువైన వ్యాళ ఏనుగు వెనుక భాగంలో నిలుచొని వుంటుంది. ఈ రకాన్ని 'గజ–వ్యాళ' స్తంభం అని కూడా అంటారు. ఉదాహర ణగా లేపాక్షిలోని శనివార మండపంలో గమనించవచ్చు. ఇలాంటివే అభివృద్ధి దశలో శిల్పాలు, పంభపంజరాలు స్తంభాల మీద కనిపిస్తాయి. ఏనుగు తొండం వ్యాళ కలసినట్లుగా వుండి, వ్యాళపైన మనిషి స్వారీ చేస్తున్నట్లు కనిపిస్తుంది. ఉదాహరణగా లేపాక్షి వీరభద్రాలయ నాట్య మండపం (ఫోటో. 5), హంపి విఠలాలయ కల్యాణ మండపంలలో గమనించవచ్చు. ఇంకో వుదాహరణలో శ్రీరంగం ఆలయంలో వ్యాళ బదులు గుర్రాన్ని చూపించారు.

మరోరకమైన స్తంభాలు సుమారు రెండు టన్నుల బరువు వుంటాయి. సభా, కల్యాణ, నాట్యమండపాల మధ్యభాగాన్ని యీ స్తంభాలు మోస్తున్నట్లుగా వుంటాయి. ఉదాహరణకు లేపాక్షి, హంపి ఆలయాలలో చూడవచ్చు. ఇవి విజయనగర పుష్ప పోతికలను కలిగివున్నాయి. దీనికి కొంచెం క్రింది భాగంలో చిన్న విమానాలు, ఋషులు, వారవాహిక స్థితిలో మరుగుజ్జులను చూపించారు. రెండు అంతస్తులలో రెండేసి చిన్న చిన్న వుప స్తంభాలు వుంటవు.

లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణ, నాట్య మండపాలలో ఇంకో రకమైన స్తంభాలు కనిపిస్తున్నాయి. ఇవి పైన కనబరచిన రీతి లోనే వున్నాయి. కానీ గజ–వ్యాళ కానరాదు. గజ–వ్యాళ స్థానంలో వంపు ఆకారములో వున్న రాతిని ప్రధాన స్తంభానికి అమర్చబడివుంది. ఈ స్తంభాలు దేవతల ప్రతిమలను, కూడులను, పంభ పంజరాలను,

సద్మబంధాలను కలిగివున్నాయి. ఒక్కొక్కసారి పెద్ద పెద్ద మానవ, వింత ఆకారాల ప్రతిమలు వీటిపై మలిచారు (ఫోటో. 3).

ఇప్పటి వరకు లేపాక్షి మరియు యితర విజయనగర ఆలయాల లోని వివిధ రకాల స్తంభాల గురించి వివరించడం జరిగింది. స్తంభం పుష్ప స్తంభం కలిగివున్నవి. గజ–వ్యాళ కలిగియున్న స్తంభాలు విజయ నగర ఆలయాలలో ఎక్కువగా కనిపిస్తాయి. ఇలాంటి స్తంభాలువుంటే విజయనగరాలయం అని నిర్ధారించుకొనేందుకు చాలావరకు వుపయోగ పడతాయి. ఈ గజ–వ్యాళ రకానికి సంబంధించిన స్తంభాలు పల్లవుల స్తంభాలను పోలివున్నప్పటికీ పల్లవుల స్తంభాలకంటే అన్ని రకాల విజయనగర గజ–వ్యాళ స్తంభాలు వున్నతంగా కనిపిస్తాయి.

లేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలోని నాట్య, సభా, కల్యాణ మంటపాలలోను, వసారలలోని వివిధ స్తంభాలగురించి తెలుసుకొన్నాం. ఆలయాలను వెలుపలి భాగంలో ఏక స్తంభాలుండటం కూడా విజయ నగర కాలంలో గుర్తించవచ్చు. లేపాక్షిలో యిలాంటి స్తంభాలు లేన ప్పటికీ విజయనగర స్తంభాల మీద వొక అవగాహన కోసం వీటిని కూడా పరిధిలోకి తీసుకోబడింది.

ఇలా ఏక స్తంభాలు ఆలయానికి వెలుపలి భాగంలో నిర్మించడం బౌద్ధవాస్తునుండి అలవాటులో వుంది. వీటికి నాటి మంచి వుదాహరణ ంగా అశోకుని స్తంభాల్ని చెప్పుకోవచ్చు. జైనులు దీప స్తంభాలు ప్రతిష్ఠించారు. వైష్ణవాలయాల ముందు గరుడ స్తంభం కనిపిస్తుంది. శైవాలయాలందు ధ్వజ స్తంభం వుంటుంది. ఇవేగాక మాన స్తంభాలు, రణ స్తంభాలు, కీర్తి స్తంభాలు, సువి స్తంభాలు, కలశ స్తంభాలు, లింగ స్తంభాలు, యూపస్తంభాలుంటాయి.

ఇలాంటి ఏక స్తంభాలు సోంపాలెం, తాడిపత్రి, రాయచోటి, ప్రభుగిరిపట్నం మొదలైన విజయనగర ఆలయాలలో కనిపిస్తాయి.

కొన్ని వుదాహరణలలో యీ స్తంభాలు ఉపపీఠ, అధిష్టానాలను కూడా కలిగివున్నాయి (చెన్నకేశవాలయం సోంపాలెం). ఇది విజయనగర ఆలయాలలోని అన్ని స్తంభాలకంటే పొడవైనవి.

విజయనగర ఆలయాలలో తోరణాలుండటం కూడా మనం గమనించవచ్చు. ఇలాంటి తోరణాలు హంపీలోని విఠలాలయం, తాడిపత్రి వెంకటరమణాలయం ముందరవున్నాయి. తాడిపత్రి వుదాహరణలో నాలుగున్నార అడుగుల పీఠం కూడా వుంది. స్తంభాలు 25 అడుగుల ఎత్తువుండి, రెండింటిని కలుపుతూ దూలం వుంది. ఈ తోరణం చాలా వరకు అలంకరణ లేకుండా సాదాగా కనిపిస్తుంది. హంపీ విఠలాలయం ముందున్న తోరణం చిన్నదిగా వుండి, అలంకరణ కలిగివుంది. తోరణ దూలంపై మధ్యభాగంలో ఏకతల ద్రావిడ విమానంవుంది. దూలం చివరల ఏకతల శాలవిమానాన్ని చూపారు. ఇలాంటితోరణాలను నిర్మించడం బౌద్ధ వాస్తునుండి వాడుకలోవుంది. బార్‌హూట్, సాంచి, నాసిక్‌లలో తోరణాలు కనిపిస్తాయి. తర్వాత ద్రావిడ ఆలయాలలో మొట్ట మొదటి సారిగా బాదామి చాళుక్యులు అనుసరించారు. వివిధ కాలాలలో తోరణం ప్రవేశ ద్వారంగా వుపయోగించేవారు. కాని వీటిని విజయనగర ఆలయాలలో వుత్సవ సమయాల్లో వూయలగా వుపయోగించేవారు. ఇందులో దేవుని ప్రతిమనుంచి పూజించేవారట. ఈ తోరణాల దూలాలకున్న రింగులను గమనించితే యిది నిజమనిపిస్తుంది.

ఇక చివరగా స్తంభాల పై భాగంలో వుండే బ్రాకెట్లను గురించి యీ క్రింద వివరించబడింది. ఇవి స్తంభ శీర్షిక భాగంలో అంచే ప్రస్తర క్రింది భాగంలో వుంటాయి. విజయనగర స్తంభాలు వివిధ రకాలైన బ్రాకెట్లను కలిగివున్నాయి. రెండు, నాలుగు బ్రాకెట్లున్నవి ఎక్కువగా కనిపిస్తాయి. ఇవి పల్లవ, చోళ, బ్రాకెట్లను పోలివున్నప్పటికీ విజయనగర శిల్పులు చాలావరకు క్రొత్తదనం చేకూర్చారు.

మొదటి రకంలో యిది చతురస్రంగాను, సాదాగావుండి రెండు భాగాలుగా వుంది. క్రింది భాగం 40°ల దగ్గర విడిపోయి వుంటుంది.

కోణా బ్రాకెట్టు బదులు విజయనగర శిల్పులు వృత్తాకారపు పెట్టవచ్చు. రెండవ రకంలో చతురస్ర, దీర్ఘ చతురస్రంగానూ. క్రింది భాగం పద్మ పోతికతోనూ వుంటుంది. ఉదాహరణలు సోంపాలెం, పుష్పగిరి, హంపి లలో వున్నాయి. మూడవ రకానికి సంబంధించిన బ్రాకెట్లు విజయనగర శిల్పులు అధికంగా వాడారు. ఇక్కడ బ్రాకెట్టు సన్నని లేదా వెడల్పాటి పట్టీలు కలిగివుండి, పట్టీల భాగంలో రూపులను చూపడం జరిగింది. ఉదాహరణగా లేపాక్షి వీరభద్రాలయ శనివారి మండపంలో గమనించవచ్చు. ఇంకో రకంలో గణాలు లేదా చిలుకలను చూపించారు. ఉదాహరణలు తిరుమల వెంకటేశ్వరాలయం, శ్రీశైలం మల్లికార్జునాలయంలోని స్తంభాలలో గమనించవచ్చు. మరొక రకమైన బ్రాకెట్లు పుష్పపోతిక కలిగివుంటాయి. అంటే పద్మం మొగ్గ వ్రేలాడుతున్నట్లుంటుంది. ఈ పుష్ప పోతికలు విజయనగర స్తంభాలలో వివిధ రకాలుగా కనిపిస్తాయి. లేపాక్షిలోని కల్యాణమండపంలో యీ భాగం యొక్క క్రింది భాగంలో మొగ్గ కనిపించదు. మరికొన్ని వుదాహరణలలో పోతికవుండి అర్ధ చంద్రాకారంలో చూపబడింది. ఇలాంటివి వీరభద్రాలయ కల్యాణ మండపంలో గమనించవచ్చు (ఫోటో. 7). పర్వాతి బ్రాకెట్లు అభివృద్ధి దశలో కనిపిస్తాయి. పుష్పపోతికలు బాగా చూపించబడినాయి. ఉదాహరణలు లేపాక్షి నాట్య మండపంలో చూడవచ్చు. పైన తెలిపిన అన్ని వుదాహరణలలోను యీ బ్రాకెట్లు ప్రధాన స్తంభానికి అతికించినట్లున్నాయి. లేపాక్షి, హంపి, మిట్టంపల్లి, సోంపాలెం, తిరువణ్ణామలైలో బ్రాకెట్లు వికసించిన పద్మంలాగ పూర్తి అభివృద్ధి దశలో కనిపిస్తాయి.

పుష్ప పోతికలు మొట్ట మొదటిసారిగా పల్లవుల నాటి మహాబలి పురంలోని పంచపాండవ గుహాలయ స్తంభాలలో కనిపిస్తాయి. వీరి కాలంలో స్తంభాలు సింహం మీద వుంటాయి. చోళ, పాండ్యులు పల్లవుల ననుసరించారు. కాబట్టి విజయనగర శిల్పులు ఈ పుష్పపోతికను పల్లవ, చోళ, పుష్ప పోతికలను చూచి వృత్తాకారం చెంది అనుసరించినట్లు తెలుస్తున్నది.

## ద్వారాలు :

భారతీయ శిల్పులు ద్వారాలను అందంగా తీర్చిదిద్దడంలో పూర్తిగా సఫలీకృతులైనారు. శిల్పుల నైపుణ్యతను ప్రదర్శించుకోవడానికి ద్వారాలుకూడా అవకాశమిస్తాయి. దక్షిణ దేశంలోని చాళుక్య, పల్లవ, చోళ, పాండ్య, హొయసల, కాకతీయులు ద్వారాల్ని మలచడంలోను ప్రతిభను చూపించడం కోసం పోటీపడ్డారు. అలాగే విజయనగర శిల్పులు కూడా వీరికేమాత్రమూ తీసిపోరని నిరూపించుకొన్నారు. విజయనగర ఆలయాలలో అలంకరణలేని ద్వారాలు పూర్తి అలంకరణ కలిగినద్వారాలు కనిపిస్తాయి. లేపాక్షి వీరభద్రాలయం ద్వారాలు చాలావరకు అలంకరణ లేకుండా సాదాగా వున్నాయి. అలాగే హంపీలోని హజారారామ, విఠలాలయ ద్వారాలు కూడా లేపాక్షి ద్వారం లాగా సాదాగావున్నాయి. అలంకరణ కలిగివున్న గర్భగృహ, అంతరాళ ద్వారాలు బ్రహ్మగిరిపట్నం, సోంపాలెం, పుష్పగిరి, తాడిపత్రిలో కనిపిస్తాయి. ద్వారాలు మామూలుగా కుడ్య స్తంభాలు, ఉదుంబర (ద్వార అడుగుభాగం) ద్వారాని కిరువైపులా నిలువుగా వుండే స్తంభాలు. ద్వారబంధాలు కలిగివుంటాయి. లేపాక్షి, ఇతర విజయనగర ఆలయాలలో యీ భాగాల అభివృద్ధి దశలను క్రింద వివరించబడింది.

కుడ్య స్తంభాలనేవి గోడలలో అమర్చివుండే స్తంభాలు. ఇవి ద్వారానికిరువైపులా నిటారుగా వుంటాయి. ఈ కుడ్య స్తంభాలు ఆలయ గోడలనుండి ద్వారాన్ని వేరుచేస్తున్నట్లుగా కనిపిస్తాయి. ఇవి ద్వారాన్ని గట్టిగా పట్టుకొనేందుకు వుపయోగపడ్డాయి. కుడ్య స్తంభాలు కొన్ని ఆలయాల్లో కనిపించవు. తాడిపత్రి, సోంపాలెం యొక్క అంతరాళ, ముఖమండపాల ద్వారాలలో కుడ్య స్తంభాలు లేవు. పుష్పగిరి, బ్రహ్మగిరి పట్నంలో కుడ్య స్తంభాలు చతురస్రాకారంగా వున్నాయి. సోంపాలెం చెన్నకేశవాలయ కుడ్య స్తంభం క్రింది భాగంలో స్త్రీ నిలుచొనివుండి పై భాగంలో అందమైన మకరతోరణం వుంది. ఇలా కుడ్య స్తంభాలను

ద్వారానికిరువైపులా చూపటం బాదామి చాళుక్యులకాలంనుండి వాడుకలో వుంది.

ఉదుంబర అన్నది ద్వారం క్రిందిభాగంలో అడ్డానికి వుంటుంది. మొదటి రకంలో సాదాపట్టీగా తక్కువ ఎత్తు కలిగివుంది. దీనికి వుదాహరణలు హంపీ, ప్రభుగిరిపట్నం, పుష్పగిరి ఆలయాలలో కనిపిస్తాయి. దీని అభివృద్ధిదశ సోంపాలెం, తాడిపత్రి ఆలయాలలో గమనించవచ్చు.

పద్మస్తంభాల నానుకొని ఎదురుగా వుండే స్తంభాలు ద్వారాని కిరువైపులా వుంటాయి. వీటివలన ద్వారం గట్టి భద్రతకలిగి వుంటుంది. అందమైన శిల్పాలు మలచడం వలన ద్వారం అందం పెరుగుతుంది. వీటి క్రిందిభాగంలో మామూలుగా ద్వారపాలకులను చూపించడం జరుగుతుంది. పైభాగం వివిధ రకాల అలంకరణల కుపయోగించారు. చిన్న చిన్న గీతలు, పుష్పాలంకరణలు కలిగివున్న వుదాహరణలు లేపాక్షి, తాడిపత్రి, ప్రభుగిరిపట్నం, సోంపాలెం, పుష్పగిరి ఆలయాల ద్వారాలలో చూడవచ్చు. అభివృద్ధి దశ పుష్పగిరి త్రికూటేశ్వర, రుద్రపాద ఆలయాలలోనూ, వల్లూరు శివాలయంలోనూ గమనించవచ్చు.

ద్వార బంధం మూడు భాగాలను కలిగివుంటుంది పతంగ, కపోత, మాలం. పతంగను ఊర్ధ్వపట్టిక అనికూడా అంటారు. ఇది ద్వారబంధంలో క్రింది భాగం. పతంగ మధ్యభాగంలో లలాటబింబ లేక మంగల పలక వుంటుంది. విజయనగర కాలంలో పలకమీద గజలక్ష్మి ప్రతిమవుంటుంది. లేపాక్షి వీరభద్రాలయంలోని దేవి మందిర ద్వారబంధంలో శివుని అభిషేక మూర్తి ప్రతిమ వుండుట గమనార్హం (ఫోటో. 8). కపోతం మామూలుగా ముందరికి చొచ్చుకుని వచ్చినట్లుంది. కొన్ని విజయనగర ఆలయ ద్వారాలు కపోతం లేకుండా కూడా వున్నాయి. కపోతం కలిగి వున్న వుదాహరణలు పుష్పగిరి, వల్లూరు, సోంపాలెం, హంపీ. ఒక్కొక్కసారి కపోతపై అంచులలో మరుగుజ్జులు కూడా చూపబడ్డారు. దూలం అన్నిటికంటే పైనవుంటుంది. విజయనగర శిల్పిభాగాన్ని

అందంగా మలచటంలో ఆసక్తి చూపినట్లు తెలుస్తున్నది. ఈ భాగం పుష్ప సంబంధిత అలంకరణ, కీర్తిముఖాలు, మకరాలు, దేవతలచిత్రాలు, కూటులు, శాల శిఖరాలు, నాగర విమానాలు యింకెన్నో అలంకరణలు కలిగివుండటం విజయనగర ఆలయాలలో గమనించవచ్చు. తాడిపత్రి వెంకటరమణాలయ సభా మండప ద్వారంపై భాగంలో రామాయణాన్ని శిల్పరచన చేసినట్లుగా కనిపిస్తుంది.

## ప్రస్తర :

ఇది స్తంభ శీర్షికకుపైన వితానంకు క్రిందవుంటుంది. మామూలుగా సభా, నాట్య, కల్యాణమండపాలలో ప్రస్తర గమనించవచ్చు. ఇది మండప పైకప్పుకు బలానిచ్చి గట్టిగా పట్టుకొని వుండేందుకు వుపయోగ పడ్తుంది. ఇవి వితానంకు అడ్డంగా అమర్చబడి వుండటంవలన పైకప్పు బరువును మోస్తూంటుంది. అంతేకాకుండా శిల్పులకు తమ ప్రతిభ నిరూపించుకోవటానికి కూడా వుపయోగపడుతుంది. విజయనగర ఆలయాలలో సాదాగా వున్నవి. అలంకరణతో వున్నవి కూడా కనిపిస్తాయి. లేపాక్షిలోని ప్రస్తర భాగం తక్కువ అలంకరణను కలిగి చాలావరకు సాదాగావుంది (ఫోటో. 6). తాడిపత్రి, సోంపాలెం, తిరుమల, తిరుపతి, ఒంటిమిట్టలలోని సభా, కల్యాణ మండపాలలోని ప్రస్తరలు అందంగా తీర్చిదిద్దబడి వున్నాయి. లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్యమండపపు ప్రస్తర విజయనగర వర్ణచిత్రాలను కూడా కలిగివుంది. ఈ చిత్రాలు చాలావరకు వాతావరణ ప్రభావం వల్ల సరైన సంరక్షణ లేనందువల్ల చూపరులను ఆకట్టుకోలేకుండా వున్నాయి. సోంపాలెం చెన్నకేశవాలయం, కదిరి లక్ష్మీనరసింహాలయంల ప్రస్తరలు కూడా చిత్రాలను కలిగివుండటం గమనించవచ్చు.

ప్రస్తర బాదామి చాళుక్యుల కాలంనుండి కనిపిస్తుంది. ఐహోళే లోని ఆలయాలు ప్రస్తరను కలిగివుండటం గమనించవచ్చు. మరి చాళుక్య, హోయసల, కాకతీయ ఆలయాలలో అందంగా తీర్చిదిద్దబడిన ప్రస్తరలు

కనిపిస్తాయి. కాని విజయనగర శిల్పులు మలిచాళుక్యుల లేదా కాకతీయ ప్రస్తరము స్ఫూర్తిగా పరచి వుండవచ్చు.

## వితానము :

అంతర్భాగంలో వితానం కూడా ముఖ్యమైన భాగమే. విజయనగర శిల్పులు నాట్య, సభా, కల్యాణ మండపాల వితానాలు అందంగా మలచడంలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. పెద్ద పెద్ద స్తంభాలు కలిగి వుండి వితానం గట్టిగా వుండేందుకు సహాయపడుతున్నాయి. లేపాక్షి వీరభద్రాలయ నాట్యమండపంలో కూడా మూడు పెద్ద స్తంభాలు విజయనగర పుష్పపోతికలు కలిగివుండి వితానంకు సహాయంగా వున్నాయి.

వితానం కొన్ని విజయనగరాలయాలలో సమంగా చూపబడింది. ఉదాహరణకు హంపి విఠలాలయంలోని నాట్య మండపం, సోంపాలెం చెన్నకేశవాలయంలోని సభామండపం మొదలైనవి. రెండవరకమైన వితానం అంతస్తులను కలిగివుంటుంది. ఉదాహరణగా లేపాక్షి వీరభద్రాలయం మందలి నాట్య మండపంలో గమనించవచ్చు. చతురస్రాకారపు అంతస్తులుగావుండి పైకిపోవు కొలది తగ్గు ముఖంగా చూపబడింది. మధ్యభాగంలో రోజాపుష్పాన్ని పోలిన డిజైను అందంగా మలచబడి వుంది. ఇలాంటి వితానం హంపీ సమీపంలోని త్రికూటాలయాలలో గమనించవచ్చు. ఈ రీతిని పోలిన వితానాలు మలిచాళుక్య, కాకతీయ ఆలయాలలో కనిపిస్తాయి. మూడవరకానికి చెందిన వితాన అలంకరణ పూర్తిస్థాయి అభివృద్ధి దశలో వున్నాయి. సోంపాలెం చెన్నకేశవాలయం లోని కల్యాణమండపంలోను, తాడిపత్రి వెంకటరమణాలయంలోని దేవి ఆలయ ముఖమండపంలోను గమనించవచ్చు. ఈ మండపాల వితానం నలుమూలలా దేవతా ప్రతిమలున్నాయి. సోంపాలెం ఆలయంలో దిక్పాలుర పద్మంలో వాహనాల మీదున్నట్లుగా చూపటం జరిగింది. పైన తెలిపిన విజయనగర వితానాలు చాలావరకు మలిచాళుక్య, కాకతీయ వితానాన్ని పోలివున్నాయి.

లేపాక్షి వీరభద్రాలయం వాస్తు గురించిన పరిశీలనలో వివిధ అంశాలను సూక్ష్మంగా విశ్లేషణా పద్ధతిలో వివరించటం యింతవరకు జరిగింది. ఆ వివరణకు అనుబంధంగా యితర వివిధకాలాల్లోని వాస్తు అంశాలను కూడా కొన్నిటిని ప్రస్తావించటం అప్రస్తుతంకాదు అని, వాటినియిక్కడ వుదాహరించటం వల్ల ప్రధానంగా విజయనగర వాస్తు లక్షణాలు, విశిష్టత, ప్రత్యేకత కూడా గ్రహించడానికి అవి తోడ్పడ్డాయని కూడా మీరు గమనించేవుంటారు. లేపాక్షిలో లేని కొన్ని వాస్తు అంశాలను కూడా వివరంగా పేర్కొనటంలో వుద్దేశ్యం విజయనగర వాస్తులో వాటిని గుర్తించటం మొత్తం విజయనగర వాస్తు పరిజ్ఞానాన్ని కూడా గ్రహించటం అని మీరు గ్రహించేవుంటారు. దీనివల్ల విజయనగర వాస్తు పరిశీలనలో ప్రత్యేకించి లేపాక్షిని దృష్టిలో వుంచుకొని చేసిన యీ అధ్యయనం ప్రయోజనం నెరవేరిందని కూడా తెలుస్తుంది.

కనుపించిన శివుని ప్రతిమలన్నీ హిందూదేశంలోని ఆలయాల్లో స్తంభాల మీద, అధిష్ఠానాలమీద, విమానాలమీద, కుడ్యాగారాలమీద, శిఖరాలమీద చూడవచ్చు (Saptagiri, Siva Through Ages, March, 1980 PP. 17 ff).

ఉపనిషత్తులలో 'శివ' అనేదానికి బదులు 'రుద్ర' అని వర్ణింప బడింది. సృష్టి, స్థితి, లయలు చేసే వాడుగదని చెప్పారు. స్వామిని ఋగ్వేద కాలం నుండి పూజిస్తున్నారట. పురాణాలలో రుద్ర అనేపదం వాడుకలోవుంది. దేవతల కోరిక మేరకు స్వామి రాక్షసులను సంహరిం చాడు కాబట్టి 'మహాదేవుడని', మేఘవర్ణుడు కాబట్టి 'ధూర్జటి' అని, రక్తమాంసాలు భుజించినందున 'రుద్రుడని', గరళాన్ని కంఠంలో ధరిం చాడు కాబట్టి 'నీలకంఠుడని', మూడు కన్నులున్నవాడు కాబట్టి 'త్రినేత్రు డని' పిలుస్తారు.

శివుని ప్రతిమలు ఎప్పటినుండి పూజింపబడినాయో ఖచ్చితమైన ఆధారాలు లభించలేదు. క్రీస్తుపూర్వం యీ ప్రతిమలు చాలా నిదానంగా అభివృద్ధి చెందినట్లు తెలుస్తుంది. క్రీస్తుతర్వాత స్వామి ఆరాధన దేశం నలుమూలలా వ్యాప్తిచెందింది. ప్రప్రథమంగా స్వామికి సంబంధించిన విషయాలు సింధూ నాగరికతలో బయల్పడ్డాయి. ఇక్కడి ముద్రికలలో శివునిరూపం గోచరిస్తుంది. ఇది చోళులకాలం నాటి కాంస్య విగ్రహాల లోని శివుని లక్షణాలను పోలివుంది. శివుని వాహనమైన ఎద్దు (నంది) కూడా హరప్పా నాగరికతలోని ముద్రికలలో ముద్రింపబడి వుండటం మనం చూడవచ్చు.

లింగాకృతిలో యిప్పటివరకు లభించిన ఆధారాలను బట్టి భిటా లోని లింగం మొట్టమొదటిదిగా చెప్పుకోవచ్చు. ఇది క్రీస్తుపూర్వం వొకటవ శతాబ్దానికి సంబంధించింది. రెండవది ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లా గుడిమల్లం గ్రామంలోని శివలింగం. ఇక్కడ లింగం

మీద స్వామి ప్రతిమ వుండటం గమనించదగ్గ విషయం. ఇది క్రీస్తు పూర్వం 3–1 వ శతాబ్దానికి సంబంధించింది. ఇలాగే శైవ ప్రతిమలు సమకాలంలో ఎంతో శైవమతం ప్రాప్తిగా వ్యాప్తి చెందింది. విజయ నగర కాలంలో నిర్మించబడ్డ లేపాక్షి వీరభద్రాలయంలో చాలా ఆసక్తి కరమైన శివ ప్రతిమలు, అందమైన వర్ణ చిత్రాలున్నాయి. అలాంటి ప్రతిమలను గురించి యీ క్రింద చర్చించటం జరిగింది.

**భిక్షాటనమూర్తి :** శివుని భిక్షాటనమూర్తి అవతారం గురించి పురాణాలు చాలా ఆసక్తికరమైన కథలు చెప్తున్నాయి. కూర్మపురాణం ప్రకారం వొకానొకసారి విశ్వాన్ని సృష్టించింది ఎవరు? అనే విషయంలో శివ బ్రహ్మల మధ్య వాదోపవాదాలు జరిగినాయి. శివుడు తనే సృష్టి కర్తఅని అన్నివిధాలా బ్రహ్మకు నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తాడు. బ్రహ్మ శివుని తిరస్కరించడమేగాక సృష్టికి తనే మూలకారకుడుగా ప్రకటించుకుంటాడు. శివుడు వుగ్రుడై బ్రహ్మకున్న ఐదుతలలలో వొక తలను నరకమని భైరవుని ఆజ్ఞాపిస్తాడు. తత్ఫలితంగా శివుణ్ని బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకొంటుంది. ఈ పాపం నుండి విముక్తి పొందడానికి శివుడు బ్రహ్మ సలహా ప్రకారం భిక్షాటన ప్రారంభిస్తాడు. భైరవునిచే నరకబడ్డ బ్రహ్మతల పుర్రెను భిక్షాపాత్రగా ధరిస్తాడు. చివరికి శివుడు వైకుంఠంచేరి లోపలికి ప్రవేశించడానికి ప్రయత్నిస్తాడు. కానీ విష్ణు ద్వారపాలకుడైన విష్వక్సేనుడు శివుని అడ్డగిస్తాడు. శివుడు నిగ్రహం కోల్పోయినవాడై అతనిని చంపి మరొక బ్రహ్మ హత్యకు పాలపడతాడు. శివుడు విష్వక్సేనుడి శవాన్ని త్రిశూలానికుచ్చుకొని విష్ణు మందిరంలో ప్రవేశించి భిక్షమడుగుతాడు. అప్పుడు విష్ణువు శివుని పాప విముక్తి పొందుటకుగాను వారణాశికి పొమ్మని సలహాయిస్తాడు. శివుడు ఆనందంగా నృత్యం చేస్తూ విష్వక్సేనుడి శవంతోసహా వారణాశి చేరగానే అతని పాపాలు నశించి విముక్తి పొందుతాడు (T. A. G. Rao, Elements of Hindu Iconography, Varanasi, 1971, Vol. II-1, pp. 295 ff)

అంశుమద్భేదాగమ, ఉత్తరకామికాగమ, సుప్రభేదాగమ, శిల్ప రత్న, కారణాగమ మొదలైనవి భిక్షాటనమూర్తి ప్రతిమా లక్షణాలను గురించి వర్ణించాయి. వీటి ప్రకారం శివుడు ఎలాంటి దుస్తులు ధరించక సర్వాభరణములు కలిగివుంటాడు (నానానాగ విభూషితమ్). నడుము కూడా సర్పాన్ని చుట్టుకొనివుంటాడు (కటిదేశే ప్రకర్తవ్యయహిః పాద మాత్రేణ వేష్టితమ్). పాదములు జారి ముడుచి కుడికాలు కొంచెం వంగి నడుస్తున్నట్లుగా వుంటుంది. స్వామి శిరోభాగం జటలతో సుందరంగా అమర్చబడి (వృత్తబంధ జట) అర్ధచంద్రునిచే అలంకరించబడి వుంటుంది. నొసటిభాగం పట్టీలతో అలంకరించబడి వుంటుంది (లలాటపట్టీ సమాయుక్తమ్). కాళ్ళకు కొయ్యతో చేసిన పాదుకలుంటాయి (పాదౌ పాదుక సమాయుక్తమ్) స్వామిపై కుడిచేతిలో ఢమరు, పైనున్న యెడమ చేతిలో త్రిశూలం, ఘంటా లేక చిన్నకర్ర క్రింది కుడిచేతిలోనూ. కపాలం క్రింది ఎడమ చేతిలో వుంటాయి. ఒక్కొక్కసారి క్రింది కుడిచేతితో మృగానికి మేతపెడుతున్నట్లుగా వుంటుంది (దక్షిణే తు కరాగ్రమ్ తు హరిణార్థ్యనగమ్ భవేత్). స్వామికి ఎడమవైపున మరుగుజ్జులపై భిక్ష పాత్రతో వుంటాడు. ఆ పాత్రలో వొక స్త్రీ భిక్షమేస్తున్నట్లుగా వుండి, ఆమె చీర స్థానభ్రంశం చెందినట్లుగా వుంటుంది. నెమలి యీకలతో అమర్చిన శూలం స్వామి పట్టుకొని వుంటుంది.

లేపాక్షి వీరభద్రాలయ నాట్యమండపంలోని వొకపెద్ద స్తంభంపై శివుడు భిక్షాటన మూర్తిగా మలచబడివున్నాడు (ఫోటో. 10). ఈ శిల్పంలో శివుడు ఎడమకాలిని నిటారుగావుంచి కుడికాలు కొద్దిగావంచి నడుస్తున్నట్లుగా వుంది, ఇది పైన చెప్పిన పురాణాల ప్రకారం సరిగ్గా చెప్పబడివుంది. కాని అలంకరణలో మాత్రం యీ శాస్త్రాలకు వ్యతిరేకంగావుంది. ఇక్కడ శివుడు నగ్నంగాకాక అర్ధోరుకాన్ని కలిగివున్నాడు. మెడల, కంఠాభరణం, హారాలు, ఉదరబంధం, కడియాలు, కంకణాలు, పొడవైన యజ్ఞోపవీతం, జటామకుటం, పాదుకలతో అలంకరించబడి వున్నాడు. పైనున్న చేతులలో ఢమరుకం, త్రిశూలం, క్రిందచేతులలోని వొక చేతిలో మృగానికి ఆహారమిస్తున్నట్లు వుండి మరొక చేతిలో

కపాలం కలిగివున్నాడు. స్వామికి ఎడమభాగాన మరుగుజ్జు పెద్దపాత్రను తలమీద పెట్టుకొని నడుస్తున్నట్లుగా వున్నాడు. మరుగుజ్జుకి ఎడమ భాగాన ఒకస్త్రీ (బహుశ మునిపత్ని) ఆహారాన్ని గరిటెతో మరుగుజ్జు తలమీదున్న పాత్రలో వేస్తున్నట్లుగా వుంది. ఇక్కడ గమనించాల్సిన విషయమేమంటే ఆ స్త్రీ ధరించిన చీర వక్షస్థలం, నడుము భాగాలందు జారినట్లుగా వుంది. ఆమె వక్షం ఆమె సంపూర్ణ స్త్రీత్వాన్ని తెలుపు తున్నట్లుంది. ఆమె అరమోడ్పు కన్నులు భక్తితో పారవశ్యం చెంది నట్లున్నాయి.

వీరభద్రాలయంలోని ఆస్థానమంటపంలో శివుని భిక్షాటనమూర్తి వర్ణ చిత్రంవుంది. శివుడు త్రిభంగ ఆకృతిలో నిలబడి, ఎడమవైపుకొద్దిగా వొంచి భూమిమీద నుండి కుడికాలు కొంచెం పైకి ఎత్తినట్లుంది, పాదు కల కొనభాగం భూమికి తగులుతూ వున్నట్లుగావుంది నడుస్తున్నట్లు తెలు స్తుంది. స్వామికి నాలుగు చేతులున్నాయి. పైచేతులలో ఢమరు, త్రి శూలం, క్రింది ఎడమచేతిలో భిక్షపాత్రవుంది. క్రింద కుడిచేయి డోల హస్త ముద్రలోవుంది. కిరీట మకుట ధారుడై, పులిచర్మము నడుముకు చుట్టుకొనివున్న స్వామికి కాల్యపాదుకలు వున్నాయి. స్వామికి ఎడమ భాగంలో నల్లటి మరుగుజ్జు తలమీద భిక్షపాత్రతో వున్నాడు. కుడి వైపున ఒక స్త్రీ భిక్షపాత్రలో బియ్యం పోస్తున్నట్లుగావుంది. స్వామికి ఎడమవైపున మరొక స్త్రీ గరిటెతో పాత్రలో ఆహారం వేస్తున్నట్లుగా వుంది. ఈమె తెల్లని చీరమీద నల్లని చతురస్ర డిజైన్లున్నాయి. ఈమె చీర జారివుండుట వలన స్తనాలు కనిపిస్తున్నాయి. కొపటన విధానం, కొద్దిపాటి అలంకరణలో వుంది. స్వామికి కుడిభాగాన యిద్దరు భక్తు లున్నారు. రెండుచెట్లు, వాటి కొమ్మలు, ఆకులు అందంగా, జాగ్రత్తగా వేయబడినాయి. వీటన్నిటిని బట్టి యిది దారువనమై వుంటవచ్చని గుర్తించవచ్చు (ఫోటో. 21).

నాట్య మండపంలోని భిక్షాటనమూర్తి మిగిలిన విజయనగర భిక్షా టనమూర్తి ప్రతిమ లన్నిటిలోకి అత్యున్నతమైందిగా చెప్పవచ్చు. ఈ

ప్రతిమను మిగతా విజయనగర భిక్షాటనమూర్తులతో పోల్చిచూసినపుడు యీ విషయం విదితమౌతుంది.

శ్రీకాళహస్తి, తాడిపత్రి, శ్రీశైలం, చంద్రగిరి, పుష్పగిరి, వల్లూరు మొదలైన విజయనగర ఆలయాలలో కూడ భిక్షాటనమూర్తి ప్రతిమలున్నాయి. వీటన్నిటిలో కూడాస్వామికి నాలుగు చేతులున్నాయి. ఇవికూడా లేపాక్షి స్వామిలాగే నడుస్తున్నట్లుగా చూపబడినాయి. కొన్ని చోట్ల నగ్నంగాను, మరికొన్నిచోట్ల అర్ధోరుకం లేదా పూర్ణోరుకం ధరించినట్లుంది. స్వామి పాదాలు పాదుకలతోను, పాదుకలు లేకుండాను వున్నాయి. అన్నింటిలోనూ త్రిశూలంవుంది. కానీ చంద్రగిరిలోమాత్రం త్రిశూలాన్ని పై రెండు చేతులతో పట్టుకొన్నట్లుంది. ఇక తాడిపత్రి, శ్రీ కాళహస్తిలలో స్వామి వొక చేతిలో పరశును కల్గివున్నాడు. ఇది లేపాక్షిలో లేకుండటం గమనించవలసిన విషయం. మామూలుగా అన్ని వుదాహరణలలో మరుగుజ్జు శివుని ఎడమభాగాన వుంటాడు. కానీ శ్రీశైల మల్లికార్జునాలయంలో స్వామికి ఎడం వైపున యిద్దరు మరుగుజ్జులున్నారు. అన్నింటిలోనూ మునిపత్ని లేక స్త్రీ స్వామికి ఎడమ వైపుంటుంది, శ్రీకాళహస్తిలో స్త్రీ కుడివైపుగా వుండి స్వామిని పూజిస్తున్నట్లుగావుంది. శ్రీశైలంలో నలుగురు స్త్రీలున్నారు. వీరందరికీ చీరలు స్తనాలపై నుండి తొలగినట్లుగా వున్నాయి. అదే ఆలయంలో యింకొకచోట మునులు, మునిపత్నులనుకూడా చెక్కియున్నారు.

ఇప్పటివరకు లేపాక్షిలోని స్వామి శిల్పం, వర్ణచిత్రం వాటి ప్రతిమా లక్షణాలు, యితర విజయనగర ఆలయాలలో భిక్షాటనమూర్తి ప్రతిమలను పరిశీలనాత్మకంగా వివరించడం జరిగింది. విజయనగర శిల్పులు ఏకాలంనాటి శిల్పాలను చూసి వుత్తేజపడినారో, వీళ్ళకి మూలాధారాలు ఎక్కడ లభించాయో తెలుసుకునేందుకుగాను వివిధ కాలాలలోని భిక్షాటనమూర్తి ప్రతిమలను పరిశీలించాల్సిన అవసరంవుంది. దక్షిణ

నాటి దేశంలో భిక్షాటనమూర్తి శిల్పాలు చాలావున్నాయి. వివిధ కాలాల వారు వివిధ రీతులలో స్వామికి రూపకల్పన చేశారు.

ప్రప్రథమంగా పల్లవులు భిక్షాటనమూర్తికి రూపకల్పన చేశారు. కంచిలోని కైలాసనాథస్వామి ఆలయంలో రెండు బ్రహ్మాండమైన ప్రతిమలున్నాయి. ఇందులో స్వామి నడుముకు చిన్న వస్త్రం చుట్టి మిగిలిన భాగం నగ్నంగావుండి నడుస్తున్నట్లువుంది. రెండు చేతులు మాత్రంకలిగి వుండి ఎడమచేతిలో పొడవైన త్రిశూలంవుంది. కుడిచేయి చిన్ముద్రలో వుంది. దగ్గర మునిపత్ని ఒకవైపునవుండి భక్తితో స్వామిని పూజిస్తున్నట్లుగావుంది. ఇంకొక వుదాహరణలో ఇద్దరు మునిపత్నులు స్వామికి ఒకవైపు కూర్చొని వున్నట్లుగా, మరొక స్త్రీ ఇంకొకవైపు నిలుచొని వున్నట్లుగా వుంది. ఈ ప్రతిమలో గమనించాల్సిన విషయం ఏమిటంటే స్వామి మూడు శిరస్సుల నాగశూలం, పరశు వారే ఆయుధంగా కలిగివున్నాడు. తలకిరువైపులా చంద్రుడున్నాడు. పల్లవుల వుదాహరణలో మృగం, మరుగుజ్జు కన్పించవు. ప్రాచీన చాళుక్యుల కాలంలో అలంపూర్‌లోని స్వర్గ బ్రహ్మ ఆలయంలో భిక్షాటనమూర్తి ప్రతిమవుంది. ఇక్కడ స్వామి దిగంబరంగా వున్నాడు. పాదుకలు, మృగం, మరుగుజ్జు కనిపించక పోవటాన్ని గమనించవచ్చు. సత్యవోలులోని రామలింగేశ్వరాలయంలో కూడా స్వామి విగ్రహంవుంది, తూర్పు చాళుక్యుల కాలంలోని బిక్కవోలులోని గోలింగేశ్వర ఆలయంలో భిక్షాటనమూర్తి ప్రతిమవుంది. కళింగ శిల్పకళలోకూడా స్వామి కనిపిస్తాడు, ముఖలింగంలోని మధుకేశ్వరాలయంలోను, భువనేశ్వర్‌లోను స్వామికి ఎదురుగా స్త్రీ (అన్నపూర్ణ) వుంది. మధ్యలో మరుగుజ్జువున్నాడు. కళింగులకాలంలో స్వామి పాదుకలు లేకుండా నడుచుచున్నట్లుగా, స్థిరంగా నిలుచొని వున్నట్లుగా చూపించారు. చాళుక్యుల కాలంలోని పానగల్‌ నందలి పచ్చల సోమేశ్వరాలయంలోను, హిరహాళ గర్భిలోని కట్టేశ్వరాలయములోను యీ ప్రతిమలు మనం చూడవచ్చు. ఇక్కడ మృగం చూపించబడింది. ఇద్దరు మునిపత్నులు అర్ధనగ్నంగా చూపారు. మరు

గుజ్జును చూపలేదు. చోళుల కాలంలో స్వామికి మంచి ఆదరణ లభించింది. ప్రతి ఆలయంలోను భిక్షాటనమూర్తిని మలచారు. అంతేకాక వీరికాలంనాటి భిక్షాటనమూర్తి కాంస్య విగ్రహాలుకూడ లభ్యమైనాయి. చోళుల కాలంలో స్వామి నగ్నంగాను, నడుస్తున్నట్లుగాను, పాదుకలతోను, జటామకుటం, నాగసూత్రం, యజ్ఞోపవీతం, హారాలతోనుచూపించటం జరిగింది. నాలుగు చేతులలో ఢమరు, త్రిశూలం, మయూరపింఛం, భిక్షాపాత్ర వున్నాయి. మరుగుజ్జును, మునిపత్నులను చూపించారు. కాంస్య విగ్రహాలందు వాలచేయి కటక ముద్రలోవుంది. ఈ విగ్రహాలలో ముఖ్యంగా గమనించాల్సిన విషయం ఏమిటంటే స్వామిమోకాలి క్రిందిభాగాన వొకచిన్న గంట వ్రేలాడ దీసినట్లుంది. ఇది ఏశిల్పశాస్త్రంలోనూ ప్రస్తావించబడలేదు. ఉత్తర భారతదేశంలో భిక్షాటనమూర్తి ప్రతిమ చాలా అరుదుగా కనిపిస్తుంది.

ఇప్పటివరకు వివిధ కాలాలలోని భిక్షాటనమూర్తి ప్రతిమలను గురించి పరిశీలించాం. చోళుల కాలంనాటి భిక్షాటనమూర్తికి విజయనగర కాలపు భిక్షాటనమూర్తికి పోలికలలో దగ్గరి సంబంధం కనిపిస్తుంది. అయినా మనకు విజయనగర భిక్షాటనమూర్తిలో కొన్ని క్రొత్త లక్షణాలు కన్పిస్తాయి. ముఖ్యంగా స్వామిని నడుస్తున్నట్లుగా మలచడంలో పూర్తి విజయం సాధించారు. నిజంగాస్వామి నడుస్తున్నట్లే కనిపిస్తుంది. వీరికాలంలో ఎడమకాలు స్థిరంగావుంచి కుడికాలుమోకాటి దగ్గర కొంచెం వంగినట్లు కన్పిస్తుంది. కాని చోళుల కాలంలో ఎడమకాలు కొద్దిగా ముందుకుండి కుడికాలు వెనుకకుంటుంది. మోకాలు వంగినట్లుగా చోళ శిల్పులు చూపించలేకపోయారు. విజయనగర శిల్పులు స్వామిని లింగపురాణంలో వర్ణించినట్లుగానే రూపాన్ని తీర్చిదిద్దారు. విజయనగరకాలంనాటి భిక్షాటనమూర్తి ప్రతిమలుకాని, వర్ణచిత్రాలుకాని కళాకారుల ప్రతిభకు, నైపుణ్యానికి, పరిపక్వతకు నిదర్శనాలుగా పేర్కొనవచ్చు.

**కల్యాణ సుందరమూర్తి :** శివుడు వరుడుగా, పార్వతీదేవి వధువుగా వుండడమే కల్యాణ సుందరమూర్తి. శిల్పశాస్త్రీలైన అంశు మద్భేదాగమ, ఉత్తరకామికాగమ, శిల్పరత్న, పూర్వకారణాగములు కల్యాణసుందరమూర్తి ప్రతిమా లక్షణాలను క్రింది విధంగా వర్ణిస్తున్నాయి. శివపార్వతులు మధ్యలోవుండి విష్ణు, లక్ష్మి, భూదేవి కన్యాదాన మొసగుతున్నట్లుంది. విష్ణు శివపార్వతుల మధ్యలోవుండి చేతిలో బంగారు కలశం కలిగివుంటాడు. బ్రహ్మ క్రింది భాగంలో పురోహితునిలాగా కూర్చొని హోమం చేస్తున్నట్లుగావుంటాడు. అష్టదిక్పాలురు, సిద్ధులు, యక్షులు, గంధర్వులు, ఋషులు, సప్తమాతృకలు శివపార్వతుల పెళ్ళిలో ముఖ్యులుగా కనిపిస్తారు. శివుని ఎడమకాలుభూమి మీద స్థిరంగా వుండి కుడికాలు కొద్దిగా వంగినట్లుంటుంది. స్వామి తన క్రింది కుడిచేతిని చాచి పార్వతి కుడిచేతిని పట్టుకొన్నట్లుంటాడు. క్రిందనున్న ఎడమ చేయి వరదముద్రలో వుంటుంది. పై చేతులలో పరశు, మృగం కలిగివుంటాడు. పార్వతి స్వామికి ఎడమవైపున వుంటుంది. దేవి ఎడమచేతిలో నీలో త్పలం వుంటుంది. పై నకనబరచిన లక్షణాలుండే ప్రతిమను 'వైవాహిక మూర్తి' అని కూడా అంటారు.

లేపాక్షి వీరభద్రస్వామి కల్యాణమండపంలోని ఒక స్తంభంమీద అందంగా చెక్కబడిన కల్యాణ సుందరమూర్తి ప్రతిమవుంది (ఫోటో. 11). ఇక్కడ స్వామి ద్విభంగ ఆకృతిలో నిలబడి వున్నాడు. జటా మకుటం, కటిసూత్రం, యజ్ఞోపవీతం, ఉదరబంధం, మంజీరం, వివిధ రకాలైన హారాలు, ఆర్ధోరుకం కలిగియున్నాడు. పై భాగానున్న కుడి ఎడమ చేతులలో పరశు, మృగం వున్నాయి. క్రిందనున్న కుడిచేయి అభయ ముద్రలోవుంది. ఎడమచేయి స్వామికి ఎడమవైపునున్న పార్వ తీదేవి కుడిచేతిని పట్టుకునివుంది. దేవి త్రిభంగ ఆకృతిలో నిలుచొని వుంది. శిఖ మెచాలా అందంగా ఆకర్షణీయంగా అలంకరించుకొన్నట్లుంది. ఎడమచేతిలో నీలకమలముంది. స్వామి కుడివైపున ఋషినిలుచొని

వున్నాడు. ఇతని తలమీద పొడవైన కిరీటముంది. రెండు చేతులూ పైకెత్తి పూజిస్తున్నట్లుగా వుంది. ఈ మొత్తం శిల్పం అందంగా మలచ బడ్డ చిత్రతోరణంలోవుంది. దీని పైభాగాన పెద్ద కీర్తిముఖముంది.

ఆగమాలలో వివరించినవిధంగా ప్రాణిగ్రహణం మనకీ శిల్పంలో కానరాదు. ఇక్కడ స్వామి ఎడమ చేతితో దేవికుడిచేయి పట్టుకొని వున్నాడు. కాని ఆగమాలలో స్వామి కుడిచేయిచాచి పార్వతి కుడిచేయి పట్టుకొన్నట్లుంది. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయమేమిటంటే ఆగ మాలలో చెప్పినట్లుగా విష్ణు, లక్ష్మి, భూదేవి, దిక్పాలురు మొదలైన వారులేరు. బ్రహ్మ హోమం చేస్తున్నట్లుగాలేదు. కాని బ్రహ్మ యిదే స్తంభంలో యింకొకవైపు కూర్చొని వున్నట్లుగా మలచబడివుంది. దిక్పాలురువొక్కొక్క స్తంభంపై వొక్కొక్కరు పెద్దపెద్ద ప్రతిమలుగా యీ కల్యాణ మండపంలో మలచబడ్డారు.

ఈఆలయంలోని నాట్యమండపం పైకప్పుకు కల్యాణసుందరమూర్తి వర్ణచిత్రముంది. ఇక్కడ శివపార్వతులతో నంది, బహ్మ, విష్ణు, దిక్పాలురు వున్నారు. బ్రహ్మ కూర్చొని పెండ్లి తంతు జరుపుతున్న ట్లుగావుంది. బ్రహ్మ గడ్డం కలిగివున్నాడు. దిక్పాలురు వరుసగా వున్నారు. ఇంద్రుని శరీరంపై కన్నులున్నట్లు చూపబడింది. పెండ్లి మండపం అరటి చెట్లతో అలంకరించబడినట్లు చిత్రకారుడు అపూర్వంగా చిత్రీకరించాడు.

కల్యాణ సుందరమూర్తి ప్రతిమలు కొద్ది మార్పులతో విజయ నగర ఆలయాలైన శ్రీశైలం, పుష్పగిరిలలో మనకు కనిపిస్తాయి. శ్రీ శైలమల్లికార్జున ఆలయంలో వైవాహిక కావ్యక్రమం రెండు భాగాలుగా విభజించబడివుంది. మొదటి భాగంలో శివుణ్ని ముసలివానిగా చూపిం చారు. స్వామిని బ్రహ్మ, విష్ణు పట్టుకొన్నట్లుండి, పార్వతి శివుణ్ని

పూజిస్తున్నట్లుగా వుంది. మేనక, హిమవంతుడు పార్వతి వెనకగాను వున్నారు. రెండవ భాగంలో శివుడు నిలుచొనివుండి క్రిందనున్న కుడి చేతిని చాచి పార్వతి కుడిచేతిని పట్టుకొని వున్నాడు. పార్వతి స్వామికి కుడిపైపున నిలుచొనివుంది. మిగిలినచేతులలో ఢమరు, త్రిశూలంవుంది. క్రింది ఎడమ చేయి కట్యవలంబిత ముద్రలోవుంది. బ్రహ్మ, విష్ణు, హిమవంతుడు, మేనక, అష్టదిక్పాలురు, గణపతి, కుమార మొదలైన వారు యీ పెండ్లిపెద్దలుగా వున్నారు. దీనికీ, లేపాక్షిలోని వైవాహిక మూర్తికి కొన్ని విషయాలలో తేడా కనిపిస్తుంది. శ్రీశైలం వుదాహరణలో ప్రాణిగ్రహణ, కన్యాదానాలకు ప్రాధాన్యతనిచ్చారు. ఇది వాయు పురాణం ప్రకారం మలచబడింది. లేపాక్షిలో ప్రాణి గ్రహణానికి మాత్రం ప్రాముఖ్య మీయబడింది. ఇంకొక వుదాహరణ పుష్పగిరి చెన్నకేశవాలయంలో వుంది. ఇక్కడ స్వామి ద్విభంగా కృతిలో నిలుచొనివుండి క్రింది ఎడమ చేతితో ఎడమ పైపునున్న దేవి కుడిచేయి పట్టుకొని వున్నాడు. ఇక్కడ కూడా ప్రాణి గ్రహణానికి ప్రాధాన్యత యివ్వబడింది. ఒక మరుగుజ్జు తలమీద పెద్ద పళ్ళెంతో శివుని కుడి భాగంలో వుండటం గమనించదగ్గ విషయం. ఇంకా బ్రహ్మ, విష్ణు, దిక్పాలురువున్నారు. ప్రాణిగ్రహణ విషయంలో యిది లేపాక్షి వైవాహికమూర్తిని పోలివుంది.

కల్యాణ సుందరమూర్తి ప్రతిమలు భారతదేశంలోని అన్ని భాగాలలోను, అన్నికాలలోను లభించాయి. అన్నిటికంటె ముఖ్యమైనవి ఎల్లోరా, ఎలిఫెంటా గుహల్లోని రాష్ట్రకూటులనాటి ప్రతిమలు. కైలాశ గుహలోని శివుడు యువకుడుగాను, అందంగాను వున్నాడు. పార్వతి తలవంచుకొని కొంచెం వంగి సిగ్గు పడుతున్నట్లుగా పెండ్లికూతురిగా కన్పిస్తోంది. దశావతార గుహలో శివపార్వతుల మధ్యలో బ్రహ్మ పురోహితుడుగా మలచబడివున్నాడు. ఆకాశంలో దిక్పాలురు తమవాహనాలపై కూర్చుండి ఆశీర్వదిస్తున్నట్లుగా చాలా అందంగా తీర్చబడివుంది. ఎల్లోరాలోని యింకొక గుహలో శివుడు తన కుడిచేతితో పార్వతి రెండు

చేతులనూ పట్టుకొనివున్నాడు. హిమవంతుడు కన్యాదాతగా వుండటం యిక్కడ గమనించదగ్గ విషయం. ఎలిఫెంటా గుహలో కూడ హిమవంతుడే కన్యాదాతగా వున్నాడు. చోళులకాలంలో యీమూర్తిని కాంస్య విగ్రహాలలో రూపొందించారు. తిరువట్టియూర్, కోనేరిరాజపురంలలో యీ ప్రతిమలున్నాయి. కోనేరిరాజపురం వుదాహరణలో శివుడునందికి ఆహారం తినిపిస్తున్నట్లుగావుంది. వీరికాలంలో ప్రాణిగ్రహణానికి ప్రాధాన్యత యివ్వబడింది. నాయకరాజులు కన్యాదానానికి ప్రాధాన్యమిచ్చారు. వీరిప్రతిమలలో పార్వతి సిగ్గుపడుతున్నట్లుగావుంది. విష్ణు కన్యాదాతగా ప్రతిమలు తీర్చబడినాయి. ఉత్తర భారతదేశంలోకూడా యీ ప్రతిమలు పుష్కలంగా లభించాయి. కళింగరాజుల భువనేశ్వర్ లోని పరశురామేశ్వరాలయంలో శివపార్వతులు వధూవరులుగా అలంకరించబడివున్నారు. అగ్నిహోమం చేస్తున్నట్లుగాను, బ్రహ్మ మూడు తలలతోనూ, సూర్యభగవానుడు పద్మంపైదున్నట్లుగాను, నాలుగుచేతుల విష్ణు నిలుచున్నట్లుగాను, పార్వతి పరివారం మొదలైనవారిని అత్యంత సుందరంగా తీర్చిదిద్దారు. ఒరిస్సా శిల్పులు కూడా ప్రాణిగ్రహణానికి ప్రాధాన్యమిచ్చారు. కనోజ్‌లో 7–8 శతాబ్దాలకు సంబంధించిన ప్రతిమలో పార్వతి చేతిలో అద్దం పట్టుకొనివుంది. ఇదికూడా ప్రాణిగ్రహణకు సంబంధించిందే. బెంగాల్‌లో లభించిన ప్రతిమల ద్వారా చాలా ఆసక్తికరమైన విషయాలు తెలుస్తున్నాయి. ఇక్కడ శివుని చేయిపట్టుకొని పార్వతి ఏడడుగులు నడుస్తున్నట్లుగా మలచబడివుంది. దీనిని సప్తపది అంటారు. ఇది యిప్పుడు కూడా హిందువుల పెండ్లి సమయాలలో ముఖ్యంగా ఆచరిస్తారు. ఇంకొక వుదాహరణలో శివుని కుడిచేతిలో కత్తి వుంది. పూర్వకాలంలో పెండ్లి కుమారుడు పెళ్ళి సమయంలో కత్తిపట్టుకొనేవారట. ఇప్పటికీ బెంగాల్‌లో యిలాంటి ఆచారముంది.

ఇప్పటి వరకు వివిధ కాలాలలోని కల్యాణ సుందరమూర్తి ప్రతిమలను గురించి వివరించడం జరిగింది. నాయక రాజులకాలంలో

విష్ణు కన్యాదాతగా చూపబడ్డాడు. దీనిని విజయనగర శిల్పులు పాటించలేదు. విష్ణువును ప్రాణిగ్రహణ సమయంలో మాత్రం చూపారు. ముఖ్యంగా శ్రీశైల వుదాహరణాన్ని పరిశీలిస్తే పాణిగ్రహణం, కన్యాదానం రెండూ కన్పిస్తాయి. కాని హిమవంతుడే కన్యాదాన మొసగినట్లుంది. విష్ణు కేవలం అతిథిగా చూపబడ్డాడు. అలాగే పుష్పగిరిలో కూడా అతిథిలాగే చూపబడ్డాడు. విజయనగర శిల్పులు వాస్తవానికి రూపకల్పన చేసినట్లుగా మనం గుర్తించవచ్చు.

కల్యాణసుందరమూర్తి ప్రతిమా రూపకల్పనలో ఆనాటి శిల్పులు చూపిన సౌందర్య దృష్టి చాలా ప్రశంసనీయమైంది. పార్వతి ప్రతిమను సర్వాంగ సుందరంగా మలచడంలో అపూర్వ ప్రతిభను కనబరిచారు. వివాహ సన్నివేశాన్ని కళ్ళకు కట్టినట్లుగా కన్పించటంలో వాళ్ళు కృతార్థులయ్యారనే చెప్పాలి. వివిధ కాలాల్లో వివిధ కల్పనల్లో తేడాలు లేశ మాత్రంగా కన్పించినా పూర్తిగా మారివున్నా మౌలికమైన శిల్ప సాంప్రదాయాలు మాత్రం అవిచ్ఛిన్నంగా కొనసాగినట్లు తెలుస్తుంది.

**నటరాజ :** నాట్యకళకు అధినాథుడిగా శివుణ్ని పేర్కొంటాం. అందుకే నటరాజు అని ఆతనికి పేరు వచ్చింది. చతుష్షష్టి కళల్లో వొకటైన నాట్యం లయకారుడైన శివుని అభినయంతో తాండవంగా ఖ్యాతి నందుకుంది. శివుని తాండవం, పార్వతి లాస్యం వొకరీతి. ఆ సన్నివేశంలో దేవతలు, ఋషులు, ప్రమథ గణాలు అందరూ పాల్గొంటారు. అందుకే శివుణ్ని 'సభాపతి' అని అంటారు. శివుడు నృత్యం చేసేటప్పుడు బ్రహ్మ తాళం వేసేవాడు, సూర్యచంద్రులు వేణువు నూదేవారు, తుంబుర నందులు పాడేవారు, నంది కుమారస్వామి డోలువాయిస్తుంటే సరస్వతి వీణవాయించేది. ఆ అద్భుత నృత్యాన్ని అప్పుడు అఖిలాంత జనులూ చూచి ఆనందించేవారు.

ఆగమాలలో శివుని అన్నిరకాల నృత్యాలనుగురించి విశదీకరించబడింది. ఆనందతాండవ, సంధ్యాతాండవ, ఉమాతాండవ, గౌరీతాండవ,

కాళికాతాండవ, త్రిపురతాండవ, సంహారతాండవ, ఊర్ధ్వతాండవ మొదలైనవి శివుని నృత్యాలు. మొత్తం 108 నృత్య భంగిమలున్నాయి. నటరాజమూర్తి భారత వేదాంత తత్వానికి దివ్య ప్రతీక. ఈ నటరాజ మూర్తి ప్రతిమలు లేపాక్షిలోని వీరభద్రాలయంలోనూ మిగిలిన విజయనగర ఆలయాలలోనూ విరివిగా కనిపిస్తాయి.

లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్య మండపంలో శివుని నటరాజ ప్రతిమ అందంగా మలచబడివుంది (ఫోటో. 14). ఇక్కడ శివుడు భుజంగ లలిత నాట్య భంగిమలో వున్నాడు. ఇక్కడ స్వామి కుడికాలు స్థిరంగా అపస్మార పురుషుని మీదవుంది. ఎడమ కాలు పైకెత్తివుంది. నాలుగు చేతులలో క్రింద రెండు చేతులు విరిగిపోయినాయి. పై రెండు చేతులలో ఢమరు, అగ్ని కలిగివున్నాడు. బహుశ విరిగిన రెండుచేతులు అభయ, గజహస్త ముద్రలలోవుండి వుండవచ్చు. స్వామి జటామకుటం, వివిధరకాలైన హారాలు, స్కంధమాలలు, కేయూరాలు, కంకణాలు, మేఖల, అర్ధోరుకం, ముండమాలలతో అందంగా అలంకరించబడివున్నాడు. కుడిచెవి సర్పకుండలం, ఎడమచెవి పత్రకుండలంతో అలంకరించబడి వున్నాయి. అందమైన పట్టీలో రౌశనాగం అలంకరించబడి వుంది. దీనిని మామూలుగా నృత్యం చేసేవారు వాడుతారు. అపస్మార పురుషుడు భూమిమీద బోర్లపరుండి తలపైకెత్తి వున్నాడు. ఇతని చేతులలో కత్తి, డాలు వున్నాయి. బహుశ యిది ఆనంద తాండవమూర్తి కావచ్చు.

ఇదే నాట్య మండపంలో వొక స్తంభం మీద యింకొక నటరాజ ప్రతిమ వుంది. ఇక్కడ స్వామి ఎడమకాలు కొద్దిగావంగి అపస్మార పురుషుని మీద వున్నట్లుంది. ఇది కూడా భుజంగ లలిత భంగిమలో వుంది. పై చేతులలో ఢమరు, అగ్ని క్రింది చేతులు అభయ, కట్యావలంబిత ముద్రలలో వున్నవి. ఇక్కడ స్వామి పూర్ణోరుకం ధరించి వున్నాడు. ఇంకా జటామకుటం, కేయూరాలు, నడుంపట్టీలతో అలంకరించబడి వున్నాడు.

ఇదే ఆలయంలోని అర్థ మండపంలో నటరాజ వర్ణచిత్రంకలదు. ఈ చిత్రంలో కూడా భుజంగ లలిత భంగిమలో వున్నాడు. మూడు కన్నులు, నాలుగు చేతులు చూపబడినాయి. పై చేతులలో ఢమరు, అగ్నిజ్వాలలు, క్రిందిచేతులు అభయ, కరిహస్త ముద్రలలో వున్నాయి. కిరీటమకుటం ధరించివున్నాడు. క్రిందవున్న అపస్మార పురుషుడు చేతిలో చిన్నకత్తిని పట్టుకొని వున్నట్లు చూపబడ్డాడు. నటరాజ ఇరు వైపులా కొంతమంది భక్తులను చిత్రీకరించారు.

నటరాజ ప్రతిమలు మిగిలిన విజయనగర ఆలయాలలో కూడా చాలావున్నాయి. వీటిని రెండుగా విభజించవచ్చు— 1) అపస్మార పురుషునున్నవి, 2) అపస్మార పురుషుడు లేకుండా వున్న నటరాజ ప్రతిమలు. హంపీ, తాడిపత్రి, శ్రీశైలం, శ్రీకాళహస్తి, పుష్పగిరి లలో స్వామి అపస్మార పురుషునిమీద కన్పిస్తాడు. ఈ వుదాహరణంలో స్వామి భుజంగత్రాస, భుజంగలలిత, ఊర్ధ్వజాను నృత్య భంగిమలలో కనిపిస్తాడు. నాలుగు చేతులున్నాయి. పై చేతులలో ఢమరు, అగ్ని వున్నాయి. క్రింది చేతులు అభయ, కరిహస్త ముద్రలోవున్నాయి. పుష్పగిరి చెన్నకేశవ ఆలయంలో నటరాజ అపస్మార పురుషునిపై నృత్యం చేస్తున్నట్లుంది. స్వామి జడలు తలకిరువైపుల వదలబడి వున్నవి. చుట్టూ అందంగా మలచబడ్డ తోరణముంది. ఇక్కడ భృంగి డోలువాయిద్యకారుడు. స్త్రీ (పార్వతి) చూపబడివుంది. హంపీ వుదాహరణలో ముఖ్యంగా గమనించదగ్గది స్వామికి పది చేతులుండటం, చుట్టూ మకర తోరణంలో అందంగా అలంకరించబడివుంది. స్వామితో పాటు వాయిద్య బృందం, స్త్రీ పరివారం, పార్వతి, నృత్య గణపతి కనిపిస్తారు. విజయనగర ఆలయాలయిన చినకొమల్లి, తాడిపత్రి, శ్రీకాళహస్తి, శ్రీశైలం, పుష్పగిరి మొదలైన వాటిలో అపస్మార పురుషుడులేని నటరాజు కన్పిస్తాడు. ఈ ఆలయాలలో భుజంగత్రాస, భుజంగలలిత నృత్య భంగిమలలో స్వామిమలచబడి వున్నాడు. మామూలుగా నాలుగు చేతులుంటాయి, కానీ శ్రీశైలమల్లికార్జునాలయంలో ఎనిమిదిచేతులుండి

త్రిశూలం, మృగం, దండం, కపాలం, నాగ, ఢమరు, అగ్ని ధరించి నట్లుంది. ఒక చేయి కరిహస్త ముద్రలోవుంది. ఇంకనూ విజయ నగర ఆలయాలలో వివిధ రకాలుగా నటరాజ ప్రతిమలు దర్శనమిస్తాయి. శ్రీశైల మల్లికార్జునాలయంలోని దక్షిణ ప్రహారీగోడకు స్వామిసర్పంపై భుజంగత్రాస భంగిమలో నృత్యం చేస్తున్నట్లుగా వుంది. పుష్పగిరి చెన్నకేశవాలయంలో స్వామి నృత్యం చేయకముందు తనకుతాను ఆలం కరించుకొనుటవుంది. ఇక్కడ స్వామికి ఎనిమిది చేతులున్నాయి. పైనున్న కుడి, ఎడమ రెండు చేతులతో ఎడమ చెవిలోని ఆభరణమును సవరించు కొంటున్నట్లుంది. క్రింది రెండు చేతులతో పైకిలేచినట్లున్న ఎడమ కాలికి గజ్జ కట్టుకొన్నట్లుంది. మిగిలిన నాలుగు చేతులలో పరశు, పాశ, గంట, సర్పం కలిగివున్నాడు. స్వామి పద్మ పీఠం మీద నిలు చొని వున్నాడు. దీనికి క్రింది భాగాన సంగీత బృందముంది. ఇలాంటి ప్రతిమ ఉత్తర దక్షిణ భారతదేశంలో మరెక్కడా కానరాదు.

వివిధ కాలాలలో స్వామి స్వరూప, స్వభావాలను పరిశీలిస్తే నట రాజును మలచటంలో విజయనగర శిల్పులు ఏకాలపు ప్రతిమా లక్షణా లను అనుసరించారో తెలుస్తుంది. దక్షిణ భారతదేశంలో గమనిస్తే మొట్ట మొదట విష్ణు కుండినుల కాలంనాటి మొగలు రాజపురం గుహాల యాలలో స్వామిని ఊర్ధ్వజాను భంగిమలో చూడడం గుర్తించవచ్చు. వారు అపస్మార పురుషుని చూపారు. ఈ శిల్పరీతి దక్షిణ భారతదేశపు లక్షణంగా కనిపిస్తుంది. కానీ చాలా చేతులను కలిగివుండటంతో ఉత్తర దేశరీతినీ పోలివుందని చెప్పవచ్చు. ఇక్కడ శివునితోపాటు మరుగుజ్జును చూపడం మొట్ట మొదటి వుదాహరణగా చెప్పవచ్చు. పల్లవుల మహాబలిపురం ధర్మరాజ రథంపై నటరాజమూర్తి చెక్కబడివుంది. ఇది వీరికాలంనాటి మొట్టమొదటిది. వీరి ప్రతిమలలో అపస్మార పురు షుడు కనిపిస్తాడు. చోళులరాజులు శివభక్తులు. ఒక అద్భుతమైన వుదా హరణ యిప్పుడు మద్రాసు శిల్పకళా ప్రదర్శనశాలలోవుంది. ఇది ఉత్తర, దక్షిణ భారతదేశ రీతులను పోలివుంది. చోళుల కాలంలో

రాతిలోనేగాక కంచులోకూడా స్వామి విగ్రహాలు అందంగా తీర్చబడి వున్నాయి. వీరికాలంలో కొన్ని వుదాహరణంలో అపస్మార పురుషు డుండి, మరికొన్నింటిలో అపస్మార పురుషుడు లేకుండా వున్నాయి. కొన్ని ప్రతిమలకు నాలుగుచేతులు, మరికొన్నింటికి చాలాచేతులున్నాయి. గంగై కొండచోళపురంలోని స్వామి వీరి కాలంలోని మొదటిది. స్వామి వెనుక స్త్రీ వుంది. ఆమె బహుశ పార్వతి అయివుండవచ్చు. పాండ్యులు కూడా నటరాజ ప్రతిమలపై ఆసక్తి కనబరిచారు. వీరికాలంలో కూడా నాలుగు చేతులు, కొన్ని వుదాహరణలలో చాలా చేతులు, అపస్మార పురుషుడుండేట్లు, కొన్నింటిలో లేకుండటం యీ ప్రతిమల్లో కనిపిస్తుంది. బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, కాల్యాణి చాళుక్యులు, హోయసలలు కూడా నటరాజుకు ప్రాముఖ్యమిచ్చారు. బాదామి చాళుక్యుల కాలంలో బాదామి గుహాలలోని స్వామికి పదహారు చేతులున్నాయి. ఐహోళేలో పదిచేతుల నటరాజు వున్నాడు. వీటిలో అపస్మార పురుషుడు లేకుండటం గమనించవచ్చు. కానీ 8 వ శతాబ్దం తర్వాత నిర్మించిన ఆలయాలలోని ప్రతిమలలో అపస్మార పురుషు డుండటం గమనించాల్సిన విషయం. ఇలాంటి వుదాహరణలు పట్టడకల్ ఆలయాలలో కనబడుతాయి. వీరుకూడా ఉత్తర దక్షిణదేశ రీతిలో శిల్పాన్ని తీర్చిదిద్దారు. రాష్ట్రకూటులు కూడా బాదామి చాళుక్యులనే అనుసరించారు. ఎల్లోరా కైలాస ఆలయంలోని రంగమహల్ గమనిస్తే తెలుస్తుంది. ఇక్కడ స్వామిని పార్వతి ఆతృతతోనూ, ఆసక్తితోనూ చూస్తూ వున్నట్లుంది. వేంగి చాళుక్యులు, హోయసలలు కూడా ఉత్తర దక్షిణ దేశపు నటరాజ ప్రతిమా లక్షణాలనే అనుసరించారు. ఉత్తర భారతదేశంలో కళింగ రాజ్యమైన భువనేశ్వర్‌లో నటరాజ ప్రతిమలు చాలా ఆలయాలలో వున్నాయి. ఒరిస్సా శిల్పులు పూర్తిగా ఉత్తర దేశపు శిల్పరీతినే అనుసరించారు. స్వామి ఎక్కువ చేతులతోను, భూమిమీద నృత్యం చేస్తున్నట్లుగా చూపటం జరిగింది. ఉదాహర ణకు ముక్తేశ్వర ఆలయం, మార్కండేశ్వరాలయం, రాజారాణి ఆల యం, విరలాలయంలో గమనించవచ్చు. అన్ని ప్రతిమలలోను శిల్పాన్ని

చూపారు. ఇలాగే బాదామి చాళుక్య, పాల, సేన కాలంలో వుండటం గమనించదగ్గది. ఇది స్వామికి సంగీతంలోవున్న ప్రావీణ్యతను తెలుపుతుంది. మహనేశ్వర్‌లోని పాపవినాశిని ఆలయంలో స్వామి ఎద్దుమీద నాట్యం చేస్తున్నట్లుగావుంది.

వివిధ కాలాలలోని నటరాజమూర్తిని గమనిస్తే ఉత్తర భారత దేశంలో స్వామి చాలా చేతులతో, ఎద్దుమీద, ఒకొక్కసారి భూమిమీద నృత్యం చేస్తున్నట్లుగా గమనించవచ్చు. దక్షిణ భారతదేశంలో స్వామిని తక్కువ చేతులతో, భుజంగలలిత, భుజంగత్రాస, ఊర్ధ్వజాను భంగిమలో నృత్యం చేస్తున్నట్లుగా గమనించవచ్చు. కానీ విష్ణుకుండినులు, పల్లవులు, బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, హోయసలు కాలంలో ఒకొక్కసారి ఉత్తర, దక్షిణ భారతదేశపు ప్రతిమా లక్షణాలను అనుసరించారు. లేపాక్షిలోని వీరభద్రుని ఆలయంలో మాత్రం పూర్తిగా దక్షిణ భారతదేశపు ఆచారాన్ని పాటించారు. ఈ విషయంలో పల్లవ, చోళుల శిల్పరీతి విజయనగర శిల్పులపై ఎక్కువ ప్రభావం చూపింది. మిగిలిన విజయనగర ఆలయాలలోని నటరాజ ప్రతిమలు కొన్ని చాళుక్య, రాష్ట్రకూటుల నాటి ప్రతిమలను పోలివుండటం గమనించవచ్చు. కాబట్టి లేపాక్షి వుదాహరణలో తప్ప మిగిలిన విజయనగర ఆలయాలలో నటరాజ ప్రతిమను తీర్చటంలో ఉత్తర భారతదేశపు శిల్పరీతులను వీరనుసరించారు.

మనదేశంలో నటరాజ విగ్రహాలు నృత్యకళకు, ఆధ్యాత్మిక, వేదాంతిక హిందూ ధర్మానికి ప్రతీకలు. సౌందర్యంలో యీ ప్రతిమలు చాలా గొప్పవనే చెప్పాలి. వీటిని కల్పించటంలో కళాకారుడి ఆస్తిత్వం ఎంతో సార్థకతను పొందుతుంది.

**సదాశివమూర్తి :** ఈ అవతారంలో శివునికి ఐదు ముఖాలుంటాయి. ఈ ఐదు ముఖాలు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశా

సల ప్రతిరూపాలు. ఇవి ఐదు సదాశివ తత్వాలకు చెందిన సదాఖ్యాలకు సంబంధించినవి. వీటిని శివ, అమూర్తి, మూర్తి, కర్తృ, కర్మ సదాఖ్యాలుగా పేర్కొంటారు J. N. Banerjea, The Development of Hindu Iconography, Calcutta, 1956, p. 478)

ఉత్తర కామికాగమ సదాశివ ప్రతిమా లక్షణాలను గురించి వివరిస్తుంది. తెల్లగావుండి, ఐదు ముఖములుండి, అన్నింటిలోనూ జటామకుటం కలిగివుంటాయి. పది చేతులుండి కుడివైపున వున్న చేతులలో శక్తి, శూల, ఖట్వాంగ, ప్రసాద, అభయ ముద్రలు, ఎడమవైపు చేతులలో భుజంగ, అక్షమాల. ఢమరు, నిలోత్పల, మాతులుంగ వుంటాయి. ఒక్కొక్కసారి వాటికి ముఖముతో మూడునేత్రాలు కలిగివుంటాడు. ఇవి ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులనే మూడు శక్తులకు ప్రతిరూపాలు. జటామకుటమందు చంద్రరేఖ వుంటుంది. వివిధరకాల ఆభరణాలు, యజ్ఞోపవీతం కలిగివుంటాడు. మనోన్మని స్వామి ప్రక్కన నిలిచి వుండును (కార్వేత్ మనోన్మన్య సమన్వితమ్).

లేపాక్షి వీరభద్రుని ఆలయంలోని కల్యాణమండపంనందలి ఒక స్తంభంమీద సదాశివుని ప్రతిమవుంది (ఫోటో. 12). ఎ. గోపాలరావు దీనిని గుర్తించలేని ఐదుతలల దేవుడుగా పేర్కొన్నారు (A. Gopal Rao, Lepakshi, p. 97. Pl. XVII). ఈ ఆలయంలోని నాట్యమండపంలో యీ స్వామి వర్ణచిత్రంవుంది. దీనిని పి. శ్రీనివాసాచార్ ఆసక్తికరమైన చిత్రంగా వర్ణించారు. దీనిని స్థానికులు 'విశ్వబ్రహ్మ' అని పిలుస్తారని కూడా పేర్కొన్నారు. స్వామికి ఎనిమిది చేతులు, ఐదు ముఖములు, కుడివైపున వొక చక్రం తప్ప మిగిలిన చేతులు కనబడకుండా నాశనమైనాయి అని తెలిపారు. ఈ చిత్రం చాలా వరకు శిథిలమై రంగు వెలసిపోయి వుండటం వలన సరిగ్గా గుర్తించటం కష్టంగా వుందని అభిప్రాయ పడ్డారు (P. Sreenivasachar, Vijayanagara Painting Lepashi, Hyderabad, 1956, p. 16).

కానీ నిశితంగా గమనిస్తే స్వామికి ఎనిమిది చేతులుకాదు పదిచేతులున్నట్లుగా తెలుస్తుంది. వి. కామేశ్వరరావు యీ ప్రతిమను 'ఐదు తలల స్వామి' (విశ్వబ్రహ్మ)గా వర్ణించారు (V. Kameswara Rao, The Lepakshi Temple, p. 21, Pl 28).

సదాశివమూర్తి మరే యితర విజయనగర ఆలయాలలోనూ కానరాడు. లేపాక్షిసదాశివమూర్తి ప్రతిమ అత్యుత్తమమైనదిగా చెప్పవచ్చు. స్వామి రెండు పాదాలూ భూమిమీద స్థిరంగావుంచి నిలబడివున్నాడు (సమపాద స్థానక), ఐదు ముఖాలు, పదిచేతులు కలిగివున్నాడు. అన్ని తలలూ జటామకుటాలచే అలంకరించబడివున్నాయి. గ్రైవేయకాలు, స్కందమాలలు, ఉదరబంధం, వనమాల, పూర్ణోరుకం, కడియాలు, మేఖల మొదలగువానితో అందంగా తీర్చబడివున్నాడు. కుడివైపు నున్న చేతులలో చక్ర, బాణ, అంకుశ కలిగివుండి పైచేయి అభయ ముద్రలోవుంది. ఎడమవైపునున్న చేతులలో శంఖ, చాప, త్రిశూలం, శక్తి కలిగివుండి పై చేయి వరద ముద్రలోవుంది. ఈస్వామి యింకొక రూపంలో యిదే కల్యాణ మండపంలోని మరొక స్తంభంమీద తీర్చబడి వున్నాడు (ఫోటో. 13). ఇక్కడకూడా సమపాద స్థానక స్థితిలో వున్నాడు. కాని మూడు ముఖాలు, నాలుగు చేతులతో వున్నాడు. క్రింది చేతులు అభయ, వరదముద్రలలోను, పైచేతులలో అంకుశం, పాశమూ కలిగివున్నాడు. కిరీటమకుటం, పూర్ణోరుకం, వనమాల, ఉదరబంధ, మేఖల, హారాలు మొదలగు వానితో అలంకరించబడి వున్నాడు. మధ్య ముఖంనందు మూడవ నేత్రం వుంది.

ఇతర కాలాలకు సంబంధించి యీ మూర్తి ప్రతిమలు కొన్ని మాత్రమే మనకు కనిపిస్తాయి. ఎలిఫెంటాలోని స్వామికి నాలుగు ముఖాలుండి చేతులన్నీ విరిగిపోయి వున్నాయి. ఉత్తర ఆర్కాడు జిల్లాలోని కావేరిపాకంలో చోళులనాటి సదాశివమూర్తి ప్రతిమవుంది. ఇక్కడ స్వామి మూడుముఖాలతో, కూర్చొనివున్నాడు. అన్ని చేతులు విరిగిపోయి వున్నాయి. రెండు కాంస్య విగ్రహాలు కూడా లభించాయి. కాని అవి

ఏకాలానికి సంబంధించింది తెలియరేదు. ఒక వుదాహరణంలో ఐదు ముఖా లుండి పైనున్న ముఖంలోని నాలుకనుండి అగ్నిజ్వాలలు వచ్చినట్లుంది. కొన్ని ముఖాలలో నోటినుండి కోరలువచ్చి ఉగ్రమూర్తిగా కనబిస్తు న్నాడు. ఉత్తర భారతదేశంలో కూడా స్వామి ప్రతిమలున్నాయి. బెంగాల్‌లో యీ మూర్తికి ఎక్కువ ప్రాధాన్యత లభించింది. బెంగాల్‌ను పరిపాలించిన సేనరాజులు సదాశివమూర్తిని కులదైవంగా పూజించారు. ఒక వుదాహరణలోస్వామికి పదిచేతులు, ఐదుతలలువున్నాయి. పద్మంలో పద్మాసనంవేసి కూర్చొనివున్నాడు. స్వామికి యిరుపైపుల పరిచారికలుగా వొక స్త్రీ, వొక పురుషుడు కూర్చొని వున్నారు. సేనరాజుల కాలంనాటి తామ్ర శాసనాలలో స్వామి ముద్రికవుంది.

వివిధ కాలాలలోని సదాశివమూర్తి ప్రతిమలను పరిశీలిస్తే మూడు ముఖాలు, నాలుగు చేతులు; మూడుముఖాలు; పదిచేతులూ, ఐదు ముఖాలు, పదహారుచేతులతో చూపబడినాయని తెలుస్తుంది. ఐదు ముఖా లున్నప్పుడు నాలుగు ముఖాలువరుసగా అద్దానికివుండి మిగిలిన వొక తల పైన వుంటుంది. ముఖ్యంగా కాంస్య విగ్రహాలలో యిది గమనించ వచ్చు. కానీ లేపాక్షిలోని సదాశివమూర్తి ఐదు తలలూ వరుసగా అద్దా నికి వున్నాయి. ఇక్కడ మూర్తి ఆగమ శాస్త్రాలలో వర్ణించినట్లే తీర్చ బడి వుండటం గమనించవలసిన విషయం.

**గజాసుర సంహారమూర్తి :** కూర్మ పురాణం యీ అవతారాన్ని గురించి తెలుపుతుంది. పూర్వమొకసారి కాశీలో చాలామంది బ్రాహ్మ ణులు లింగాన్ని పూజిస్తుండేవారు. అప్పుడు వొక రాక్షసుడు ఏనుగు రూపం ధరించి శివలింగాన్ని పూజిస్తున్న బ్రాహ్మణులను, ఆ పూజను నిరోధించేందుకు ప్రయత్నించాడు. అది చూసి వుగ్రుడైన శివుడు లింగంనుండి వెలుపలికివచ్చి ఆగజాసురుడుని సంహరిస్తాడు. అంతేగాక ఆ గజచర్మాన్ని స్వామి దుస్తులుగా ధరిస్తాడు. ఈ అవతారాన్ని

గజాసుర సంహార మూర్తి అని పిలుస్తారు (T. A. G. Rao, Elements of Hindu Iconography, p. 150). వరాహ పురాణం ప్రకారం నీలుడనే రాక్షసుడు గజరూపం దాల్చి శివుణ్ణి రహస్యంగా చంపటప ప్రయత్నిస్తాడు. ఈ విషయాన్ని పసిగట్టిన నంది వీర భద్రునికి తెలుపుతుంది. అప్పుడు వీరభద్రుడు సింహరూపం దాల్చి ఆ దానవుని చంపి ఆ చర్మాన్ని శివునికి దానమిస్తాడు. దానిని శివుడు పై దుస్తులుగా వాడుకొంటాడు (Ibid. p. 375) ఈ అవతారాన్ని గురించి వొక్కొక్క పురాణంలో వొక్కొక్క విధంగా చెప్పబడింది. కానీ వాస్తవానికి శివుడు గజాసురుని చంపి ఏనుగు చర్మాన్ని దుస్తులుగా వాడుకొన్నాడు. కొబట్టి యీ అవతారాన్ని 'గజాసుర సంహార మూర్తి' గాను లేక 'గజాంతక' అవతారం గాను పిలుస్తారు.

అంశు మద్భేదాగమ, శిల్పరత్నలందు శివుని గజాసుర సంహార మూర్తి లక్షణాల గురించి యీక్రింది విధంగా వర్ణించబడివుంది. స్వామి నాలుగులేక ఎనిమిది చేతులు కలిగివుంటాడు. నాలుగు చేతులతో వున్నప్పుడు కుడివైపు వొకచేతిలో గజచర్మం వుంటుంది. ఇంకొక చేతిలో పాశం వుంటుంది. ఎడమవైపునున్న వొకచేతిలో గజచర్మం, రెండవ చేతిలో ఏనుగు దంతం వుంటుంది. ఎనిమిది చేతులతో చూపబడితే కుడి వైపునున్న చేతులలో గజచర్మం, త్రిశూలం, ఢమరు, పాశం, ఎడమ వైపునున్న చేతులలో గజచర్మ, కపాలం, ఏనుగు దంతము వుంటాయి. నాలుగవ చేయి విస్మయ ముద్రలో వుంటుంది. శివుని ఎడమకాలు గజ శిరస్సు మీద వుంటుంది. (సుస్థితమ్ వామపాదమ్ తు గజశీరస్య మస్తకే). కుడికాలును ఎడమకాలి లొడవరకు పైకెత్తబడివుంటుంది. గజచర్మం శివునికి వెనుక ప్రభామండలంగా అమర్చబడివుంటుంది. స్వామికి ఎడమవైపున ఉమాదేవి స్కంధుని చేతిలో వుంచుకొని విలబడి నాథుని ఉగ్రరూపాన్ని చూస్తున్నట్లుగా వుంటుంది.

వీరభద్రాలయ ముఖ మండపంలోని వొక స్తంభం మీద గజాసుర సంహార మూర్తి చెక్కబడివున్నాడు. ఈ రూపంలోని శివుడు

కుడికాలును ఏనుగు శిరస్సు మీదుంచి ఎడమకాలును భుజంగత్రాస
భంగిమలో పైకెత్తినట్లు తీర్చబడింది. స్వామికి ఆరుచేతులుండి కుడి
ఎడమ నున్న పై చేతులు గజచర్మాన్ని పట్టుకొనివున్నాయి, మధ్యలో
వున్న చేతులలో ఢమరు, అగ్ని కలిగి, క్రింది చేయులు అభయ, కరి
హస్త ముద్రలలో వున్నాయి. స్వామికి వెనుక భాగాన గజచర్మాన్ని
ప్రభామండలంగా అమర్చినట్లుంది. ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సిన
విషయమేమంటే నరికివేయబడివున్న ఏనుగు నోటినుండి గజాసురుడు
మనిషి ఆకృతిలో బయటకు వచ్చినట్లు శిల్పి తన పనితనాన్ని చూపిం
చాడు, ఇతడు రెండు చేతులూ జోడించి నమస్కరిస్తున్నట్లుగా వుంది.

మిగిలిన విజయనగర ఆలయాలలో కూడా గజాసుర సంహార
మూర్తి ప్రతిమలున్నాయి. తాడిపత్రిలోని రామలింగేశ్వరాలయ ఉత్తర
గోపురం మీద యీ ప్రతిమ భుజంగత్రాస భంగిమలోవుండి
నాలుగు చేతులు కలిగివుంది. ఇక్కడ ఏనుగు తలలో త్రిశూలాన్ని దించు
తున్నట్లుంది. శ్రీశైల మల్లికార్జున ఆలయ వుదాహరణలో స్వామి కుడి
కాలు ఏనుగుతలపై వున్నట్లుగావుంది. ఇక్కడకూడా ప్రభామండలంగా
ఏనుగు చర్మాన్ని స్వామి వెనుక భాగాన అమర్చారు. పెరూర్ ఆల
యంలో స్వామికి ఎనిమిది చేతులు చూపబడినాయి. పై రెండు చేతులలో
ఏనుగుచర్మాన్ని పట్టుకొనివుండి, మిగిలినచేతులలో పరశు,టంక, కపాల,
ఢమరు, పాశ, త్రిశూలం చూపబడినాయి. వల్లూరు వుదాహరణలోకూడా
స్వామి ఎనిమిది చేతులతో చూపబడినాడు. ఇక్కడ ఏనుగు నాలుగు
కాళ్ళు, తోక, నరకబడివున్న తల చాలా వాస్తవంగా తీర్చిదిద్దబడి
వున్నాయి.

దక్షిణ భారతదేశంలోని పల్లవ, తూర్పు చాళుక్య, కాకతీయ,
చోళుల కాలంలో కూడా యీ స్వామి ప్రతిమలున్నాయి. పల్లవుల
కాలంలో కంచి కైలాసనాథ ఆలయంలో స్వామి ప్రతిమవుంది. ఇక్కడ
శివుడు శూలాన్ని గజాసురుని తలలోకి దూర్చినట్లుంది. ఉమాదేవిని

కూడా చూపించారు. ఇలాకంచిలోని వైకుంఠ పెరుమాళ్ ఆలయంలోనూ యీ ప్రతిమవుంది. తూర్పు చాళుక్యుల కాలంనాటి పాలకొల్లులోని రామ లింగేశ్వరాలయంలో ద్విభంగా కృతిలో స్వామి ప్రతిమవుంది. పలి చాళుక్యులకు సంబంధించిన పదహారుచేతుల గజాంతకుని ప్రతిమ అమృత పురంలోని అమృతేశ్వరాలయంలో వుంది. హాశేబీడులోని హోయసలే శ్వరాలయంలో కూడా పదహారుచేతుల స్వామి ప్రతిమవుంది. లక్కొండిలో లభించిన వుదాహరణలో స్వామితోపాటు దేవతలు, వాయిద్య బృందం, గంధర్వులు, అష్టదిక్పాలురు వున్నారు. కాకతీయుల కాలంనాటి పాలం పేట వుదాహరణలో స్వామి ప్రతిమ మరిచాళుక్యుల సాంప్రదాయాన్ని పోలివుంది. ఏ శిల్ప శాస్త్రంలోనూ కనబడనది మనకిక్కడ కన్పిస్తుంది. స్వామికిరువైపుల బ్రహ్మవిష్ణువులను చూపటం క్రొత్తదనంగా గుర్తించ వచ్చు. చోళుల కాలంలో రాతితోను, కంచు లోహంతోను యీ ప్రతి మలను తయారుచేశారు. వీరికాలంలోని ధారాసురం, తిరుచ్చంగట్టుగుడి, కొమరసువల్లి, వళవూర్‌లలో యీ ప్రతిమలున్నాయి. ఇక ఉత్తర భారతదేశంలోని యీ శిల్పాలను పరిశీలించితే చాలావరకు వేరుగా కని పిస్తాయి. స్వామి కాళ్ళక్రింద ఏనుగు తలవుండదు. ఉత్తర దేశంలో అంధకాసుర సంహారమూర్తిని, గజాసుర సంహారమూర్తిని వొకే లాగా తీర్చి వుండటం గమనించవచ్చు. ఎల్లోరా, ఎలిఫెంటా, ఒరిస్సాలోని ప్రతిమలను పరిశీలిస్తే యిదివిదితమౌతుంది. వరాహ పురాణం ప్రకారం శివుడు మొదట గజాసుర సంహారమూర్తిగా అవతరించి గజాసురుని సంహరించి గజచర్మాన్ని దుస్తులుగా ధరిస్తాడు. ఇదే దుస్తులతో అంధ కాసురుని వధిస్తాడు (Ancient India, No. 6, pp. 59 ff) కాబట్టే యిక్కడ రెండు ప్రతిమలూ వొకలాగే మలచబడి వున్నాయి.

పైన కనబరచిన లక్షణాలను పరిశీలిస్తే వొక్కొక్క కాలంలో వొక్కొక్క రీతిలో గజాసుర సంహారమూర్తి మలచబడి వున్నట్లు తెలు స్తుంది. ఒక్క విజయనగర కాలంలోనే యీ మూర్తిని మూడురకాలుగా

చేర్చి వుండుట గుర్తించవచ్చు. తాడిపత్రిలో త్రిశూలాన్ని గజశిరస్సులో దించినట్లుంది. ఇలాంటిదే పల్లవుల కాలంనాటి కంచిలోని కైలాసనాథ ఆలయంలో కనిపిస్తుంది. అక్కడకూడ శూలం ఏనుగు తలలో పొడవ బడివుంది. రెండవరకానికి సంబంధించిన రెండు వుదాహరణలు శ్రీశైల మల్లికార్జునాలయంలో వున్నాయి. ఇక్కడ శివుడు వొకచోట కుడికాలు మీద, యింకొకచోట ఎడమకాలు మీద నిలుచొని వున్నాడు. గజచర్మం వెనుకవైపు ప్రభామండలంగా అమర్చబడివుంది. పల్లవుల, చోళుల కాలంలో మనకిలాంటి లక్షణాలు కలిగిన ప్రతిమలు కన్పిస్తాయి. కాబట్టి వీరు పల్లవ, చోళుల ననుసరించారనవచ్చు. ఒక్కొక్కసారి వీరిని అధి గమించారనే చెప్పవచ్చు. విజయనగర శిల్పులే నూతనత్వాన్ని సృష్టిం చారు. ఇలాంటిది మనకు లేపాక్షి వీరభద్రుని ఆలయంలో కన్పిస్తుంది. ఇక్కడ అసురుడు మానవరూపంలో చూపబడినాడు. మొండెం నుండి వేరుచేయబడ్డ గజం నోటినుండా అసురుడు మానవాకారంలో బయటకు వచ్చి స్వామిని నమస్కరించుచున్నట్లు చూపబడింది. ఈ విషయంలో విజయనగర శిల్పులు బహుశ మహిషాసుర మర్దని ప్రతిమను చూసి ఆచరించి వుండవచ్చు. మహిషాసుర మర్దనిలో కూడా అసురుడు నరక బడివున్న మహిషం తలనుండి మానవాకారంలో బయటకు వచ్చినట్లుండ టాన్ని తాడిపత్రి రామలింగేశ్వరాలయంలో మనం గమనించవచ్చు.

**వృషభావతారమూర్తి :** లేపాక్షి వీరభద్రాలయ కల్యాణమండపం లోని వొక స్తంభంమీద అత్యంత ఆసక్తికరంగా శివుణ్ని వృషావతార మూర్తిగా మలచివున్నారు (ఫోటో. 9). స్తంభ మధ్యభాగంలో నంది లేక ఎద్దును కుడి ముఖంగా చెక్కారు. దీని మెడ వివిధరకాలైన పట్టీ లతో అలంకరించబడివుంది. నంది ముందరి కుడికాలు మొండెంనుండి వేరుచేయబడిన శిరస్సుమీద అనించబడివుంది, ఇది ముఖ్యంగా గుర్తించ వలసిన అంశం. నందిచెవులు, కొమ్ములు, మూపురం స్పష్టంగా చూప బడినాయి. ముఖ కవళిక లందు అద్భుతంగా కరుణరసం పుట్టిస్తున్న ట్లుగా వుంది.

ఈ అద్భుత శిల్పరచనా సృష్టిని గూర్చి శిల్ప శాస్త్రాలలో గాని, ఆగమాలలోగాని ఎలాంటి ప్రస్తావనా లేదు. కానీ శివపురాణాన్ని క్షుణ్ణంగా పరిశీలించితే దీన్ని గురించిన సమాచారం మనకు కొంతవరకు లభ్యమవుతుంది.

శివ పురాణంలోని శతరుద్ర సంహితలో శివుడు ఎందుకు వృషభావతార మెత్తాడో విపులీకరించబడివుంది (Sivapurana, New Delhi, 1969, Vol. III. pp. 1163 ff) దేవ, దానవులు అమృతం కోసం క్షీర సముద్రాన్ని చిలికే సమయంలో ఎగిరిపడే తుంపరల నుండి దివ్య తేజస్సుతో అప్సరసలను మించిన కన్యలెందరో ఉద్భవించారు. వీరంతా సౌందర్యంతోను, చంచలమైన సుందర వీక్షణాలతోనూ అన్నిలోకాలనూ వుర్రూత లూగించారు. కొంతమంది బలవంతులైన రాక్షసులు యీ కన్యలనపహరించుకొని పోయి తమ స్థావరాల్లో దాచి వుంచారు. క్షీరసాగర మథనానంతరం అమృతం కొరకు దేవదానవ సంగ్రామం జరిగే సమయంలో విష్ణువు దానవులకు వ్యతిరేకంగా దేవతల వైపునవుండి రాక్షసులను సంహరిస్తాడు. ఆ సమయంలో విష్ణు అ అద్భుత సౌందర్య తేజో విలాసినులైన కన్యలను చూచి మోహించి వారితో సంగమిస్తాడు. ఫలితంగా అతిగొప్ప బలవంతులైన కుమారులు జన్మిస్తారు. వీరు భూమ్యాకాశాల్లో పెద్ద అలజడి సృష్టిస్తారు. ఈవైపరీత్యాన్ని తట్టుకోలేని దేవతలు, మునులు, శివుణ్ని ఆశ్రయించారు. ఈ విపత్కర పరిణామానికి విష్ణు కుమారులే కారకులని గ్రహించిన శివుడు ఆగ్రహించి వారిని సంహరించేందుకు వృషభావతారమూర్తిగా అవతరించాడు. ఈ రూపంలో శివుడు రుద్రుడై తనవాలి గిట్టలలోనూ, కొమ్ములలోనూ విష్ణు కుమారులను సంహరించాడు. ఇది తెలిసిన విష్ణువు ఆగ్రహించి వృషభావతారంలోనున్న శివునిపైకి విజృంభిస్తాడు. శివుడు భయంకరుడై విష్ణువును ఓడిస్తాడు. శివుడే యీ రూపం ధరించాడని తెలుసుకొన్న విష్ణువు ముకుళిత హస్తాలతో, సజలనయనాలతో అనుగ్రహించమని శివుని ప్రార్థిస్తాడు. శివుడు విష్ణువును అనుగ్రహించి నిజ

రూపం వరిస్తాడు. ఈ విధంగా శివుడు విష్ణు కుమారుల బారినుండి దేవతలను రక్షిస్తాడు.

పై కథ ఆధారంగా విజయనగర శిల్పులు వృషవాహనమూర్తికి రూపకల్పన చేశారు. ఈ శిల్పంలో ఎద్దు ముందరి కుడికాలు తెగిన తలపై ఆనివుండటం చేత యిది ఖచ్చితంగా సంహారమూర్తి అని మనం గుర్తించవచ్చు.

ఇది కల్యాణ మంటపంలోని యింకొక స్తంభంపై నంది లేక ఎద్దు చెక్కబడివుంది (ఫోటో. 8). ఇది అత్యంత సుందరంగాను, సర్వాలంకార భూషితంగా వుండటం గమనించదగిన విషయం. దీనికొమ్ములు చెవులు, మూపురం, కాలిగిట్టలు, తోక చాలాఅందంగా తీర్చబడివున్నాయి. ముందరి కుడికాలు కొంచెం పైకిలేచి మోకాటి దగ్గర వంచబడివుంది. ఈ శిల్పాన్ని వొక గూడు (కోష్ఠం)లో అమర్చి పైభాగాన అందమైన మకర తోరణంతో అలంకరించారు. సాధారణంగా మకరతోరణం దేవుళ్ళ ప్రతిమల పైభాగంలో మాత్రమే వుంటుంది. లేపాక్షి వీరభద్రుని ఆలయంలో కూడా అన్ని దేవుళ్ళ ప్రతిమలకు యిలాంటి మకర తోరణాలున్నాయి. కాబట్టి యీ శిల్పం (నంది లేక ఎద్దు) కూడా శివుని వృషవాహనంగా చెప్పుకోవచ్చు. ముఖ్యంగా గమనించాల్సిన విషయమేమంటే యిలాంటి శిల్పం మరే యితర విజయనగర ఆలయాలలో మనకు కన్పించదు.

**కేవలమూర్తి :** కల్యాణ మంటపంలోని వొక స్తంభం మీద శివుడు కేవలమూర్తిగా కనిపిస్తాడు (ఫోటో. 15). ఇక్కడ స్వామి ద్విభంగాకృతిలో నిలుచొని వున్నాడు. స్వామిని యిక్కడ అందమైన యువకుడుగా చూపించారు. నాలుగు చేతులు కలిగివున్నాడు. పై చేతులంలో పరశు, మృగం పట్టుకొనివున్నాడు. క్రిందిచేతులు విరిగిపోయివున్నాయి. నుదుట మూడవకన్నువుంది. తలజటామకుటంతో అలంకరించబడివుంది. ఇంకా స్వామికి నాగకుండలాలు, కంఠాభరణాలు, స్కంధమాలలు, ఉదర

బంధం, యజ్ఞోపవీతం, మేఖల, అరోటకం, కడియాలు, పాదపాటి ముండమాల మొదలైనవి వున్నాయి. ఇక్కడ స్వామి రాతిలోనుండి బయటకు వచ్చినట్లుండటం శిల్పుల ప్రతిభను తెల్పుతుంది. నాట్యమండపంలో యీ స్వామి వర్ణచిత్రం వుంది. స్వామికి ప్రక్కన గడ్డంతో నున్న పురుషుడు, అతని ప్రక్కన జటామకుటం కలిగిన వొక స్త్రీవుంది. సి. శివరామమూర్తి వీరిని మేనక, హిమవంతులుగా గుర్తించారు (Vijayanagara Sexcentenary Commemorative Volume, Dharvar, 1936, pp. 76 ff).

**అభిషేకమూర్తి :** శివుడు అభిషేకమూర్తిగావున్న ప్రతిమయిక్కడి దేవి గర్భగుడి ద్వారబంధంపైన మలచబడి వుంది (ఫోటో. 8). ఇది చాలా ఆసక్తికరమైన శిల్పం. ఇక్కడస్వామి పద్మాసనంలో కూర్చొని వున్నాడు. జటామకుటం, యజ్ఞోపవీతం ధరించివున్నాడు. ఆరు చేతులు కలిగివున్నాడు. పైరెండు చేతులలో చిన్న పాత్రలుండి తలమీద నీళ్ళు పోసుకొంటున్నట్లు, క్రిందనున్న రెండుచేతులు వొడిలోవున్న వొక పాత్రను పట్టుకొని వున్నట్లు, మధ్యలోవున్న చేతులలో కూడ చిన్న పాత్రలుండి భుజాల వరకు పైకెత్తబడినట్లు వున్నాయి. ఈ పాత్రలో నీరు లేదా అమృతం వుండవచ్చు.

ఇక్కడి ముఖమండపంలోని వొక స్తంభంపై యిలాంటి ప్రతిమే చిన్నదిగా చూపటం జరిగింది. ఇంకొకచోట మండపం పైకప్పులో యీ స్వామి వర్ణచిత్రం కూడా వుంది. పై శిల్పంలో వున్న లక్షణాలన్నీ యీ చిత్రంలో చిత్రీకరించబడినాయి. దీనిని కొంతమంది చరిత్రకారులు 'మృత్యుంజయమూర్తి'గాగుర్తించారు (V. Kameswara Rao, The Lepakshi Temple, P. 64, S G.K. Murthy, The Art of Lepakshi Pl. II). కాని స్వామి స్వయంగా అభిషేకం చేసుకొన్నట్లుగా వుంది కాబట్టి దీనిని 'అభిషేకమూర్తి' అనటం సమంజసం, పురాణాలు, ఆగమాలు, శిల్పశాస్త్రాలు యీ శిల్పం గురించి దీని లక్షణాలను

గురించి ఎక్కడా ప్రస్తావించలేదు. ఇలాంటిదే అనేమలలోని సంగమేశ్వ రాలయంలో వుంది. ఇది లేపాక్షిలోని అభిషేకమూర్తిని పూర్తిగా పోలి వుంది. ఇలాంటి అభిషేకమూర్తి ప్రతిమగానీ, చిత్రంగానీ ఉత్తర, దక్షిణ దారదేశంలో మరెక్కడా కానరాదు. విజయనగర శిల్పులే దీని సృష్టి కర్తలని మనం చెప్పవచ్చు.

## వివిధ ప్రతిమలు :

**విష్ణు :** త్రిమూర్తులలో ముఖ్యుడైన విష్ణు నాలుగు వేదాల్లో ప్రస్తుతించబడ్డాడు. వేదకాలమందు విష్ణు సూర్యునితోను, అగ్నితోను పోల్చి పూజింపబడ్డాడు. దశావతారాలను ధరించి జగత్తును వివిధ యుగాల్లో రక్షిస్తూ వచ్చాడని కూడా హిందూ ధర్మశాస్త్రాలు, పురాణాలు ఘోషిస్తున్నాయి. పాలకడలిలో పుట్టిన లక్ష్మిని వివాహమాడిన విష్ణు దేవతా గణాలలో అతిముఖ్యుడు. ఆదిశేషుడు అతని పానుపు. ఆది శేషుని తలపై భూభారం వుందని ప్రతీతి. ఆవిధంగా శేషశాయి భూమి భర్తగా, విశ్వరక్షకుడుగా మన పురాణాల్లో గోచరిస్తాడు. ధర్మపరిరక్ష కుడైన విష్ణు శిల్పాకృతిలో మూడు భంగిమల్లో దర్శన మిస్తాడు (స్థానక, ఆసీన, శయనమూర్తి).

లేపాక్షి కల్యాణ మండపంలోని స్తంభాలమీద విష్ణు ప్రతిమలు రెండు వున్నాయి. మొదటి ప్రతిమలో స్వామి రెండుకాళ్ళ భూమిమీద స్థిరంగావుంచి సమపాదస్థానక భంగిమలో వున్నాడు. ఇక్కడ స్వామికి నాలుగు చేతులుండి పైనున్న చేతుల్లో చక్రం, శంఖం కలవు. క్రింద నున్న కుడి, ఎడమ చేతులు అభయ, వరదముద్రలో వున్నవి. స్కంద మాల, ఉదరబంధ, యజ్ఞోపవీతం, కిరీటమకుటం, కంఠాభరణాలు, పూర్ణో రుకం మొదలైన వాటితో చాలా అందంగా స్వామిని అలంకరించారు (ఫోటో. 13).

విష్ణువు వివిధ రకాలైన 24 ప్రతిమలను సంస్కృతంలో కేశ వాది చతుర్ విమ్శత్ మూర్త్యామహే అంటారు. ఈ24 ప్రతిమలలో

ప్రతి ప్రతిమకు నాలుగు చేతులుండి శంఖ, చక్ర, గద, పద్మం కలిగి వుంటాయి. ఈ ప్రతిమల గురించి పురాణాలలోను, ఆగమాలలోను పూర్తిగా వివరించబడి వుంది. కానీ ఏ పురాణంలోగానీ ఆగమాలలో గాని లేపాక్షిలోవున్న విష్ణు ప్రతిమను గురించి తెలియ బరచలేదు. ఈ ఆలయంలోని స్వామి చేతుల్లో శంఖ, చక్రములతోపాటు అభయ, వరద ముద్రలుకూడా కలిగివున్నాయి. కానీ ఆగమాలలో అభయ, వరద ముద్రల బదులుగా గజ, పద్మం వుంచేట్లు చెప్పబడివుంది. విజయనగర శిల్పులు గద, పద్మం బదులు అభయ, వరద ముద్రలు విష్ణుప్రతిమలో చూపారు.

లేపాక్షి కల్యాణ మండపంలోనే యింకొక ప్రతిమవుంది. ఇక్కడ విష్ణు ఉత్కుటి కాసనంలో కూర్చొని వున్నాడు. నాలుగు చేతులుండి పైనున్న కుడి, ఎడమచేతులలో చక్రం, శంఖువున్నాయి. క్రిందనున్న కుడి ఎడమ చేతులు కొంచెం పైకిలేచియున్న మోకాళ్ళ మీదున్నాయి. కిరీటమకుటం, గ్రైవేయకాలు, మేఖల, యజ్ఞోపవీతంలతో విష్ణు ప్రతిమ అలంకరించబడివుంది. అర్థోరుకం ధరించి వున్నాడు. దీని మధ్యలోని ముడి రెండు కాళ్ళమధ్యలో అర్ధచంద్రాకారంలో వుంది. పూర్తిగా తెరవ బడిన కళ్ళు, కొంచెం తెరవబడిన నోరు చూపబడివుంది. దీనిని 'కేవల నరసింహ'గా గుర్తించవచ్చు.

**బ్రహ్మ :** త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో బ్రహ్మ మొదటివాడు. హిందూ ధర్మశాస్త్రాలు సృష్టి, స్థితి, లయకారుల్లో బ్రహ్మను సృష్టికర్తగా పేర్కొన్నాయి. ఇతని పుట్టుక గురించి పురాణా లలో వివిధ రకాలుగా చెప్పబడివుంది. బ్రహ్మ బంగారు గ్రుడ్డు నుండి ఉద్భవించాడని వొక పురాణంలో వుంది. విష్ణు పురాణం విష్ణు బొడ్డు నుండి పుట్టిన పద్మంనుండి బ్రహ్మ జన్మించినట్లు చెప్తూవుంది. బ్రహ్మ జననం గురించిన యీ పురాణ కథను చాలామంది వొప్పుకొన్నారు. ప్రాచీన వేదాలు నాలుగూ బ్రహ్మ నాలుగు ముఖాలనుండి పుట్టాయని ప్రతీతి. సంగీత, సాహిత్యాలకు నిధిఅయిన సరస్వతి బ్రహ్మపత్ని.

వీరభద్రాలయంలో రెండు బ్రహ్మ ప్రతిమలున్నాయి. ఒకటి కల్యాణ మంటపంలోని ఒక స్తంభం మీదవుంది. ఇక్కడ కల్యాణ సుందరమూర్తి వున్న స్తంభానికి, పరొక పైపున బ్రహ్మ పద్మాస నంలో కూర్చొని వున్నాడు. బ్రహ్మకు మూడుతలలు, నాలుగు చేతు లున్నాయి. కిరీటమకుటాలతో మూడుతలలా అలంకరించబడివున్నాయి. పైన చేతులలో శృక్, శృవలు కలిగి వున్నాడు. క్రింద నున్న కుడిచేతిలో కమండలముండి, ఎడమచేయి మోకాలు మీదవుంది. పూర్ణోరుకం, గ్రైవేయకాలు, ఉదరబంధం, మేఖల, యజ్ఞోపవీతంలలో బ్రహ్మ అలంకరించబడి వున్నాడు. ఇక్కడ బ్రహ్మ శివపార్వతుల కల్యాణ సమయంలో హోమం చేస్తున్నట్లుగా వుంది.

రెండవది యిదే ఆలయంలోని నాట్యమండపంలో ఒక స్తంభం మీద కనిపిస్తుంది. ఇక్కడ బ్రహ్మ నిలుచొని తాళాలు ప్రయోగిస్తున్న ట్లుగా వుంది. ఇక్కడ బ్రహ్మ యువకుడుగా కన్పిస్తున్నాడు. జటామ కుటం వివిధరకాల హారాలు, ఉదరబంధం, యజ్ఞోపవీతం, అర్ధోరుకంతో బ్రహ్మ అలంకరించబడి వున్నాడు.

మిగిలిన విజయనగర దేవాలయాలలో కూడా బ్రహ్మ కల్యాణ సుందరమూర్తి ప్రతిమలో చూపబడినాడు. అన్ని వుదాహరణలలో శివ పార్వతుల వివాహ సమయంలో బ్రహ్మ పెండ్లితంతు జరిపే పురోహితు నిగా చూపబడ్డాడు. ఉత్తర భారతదేశంలో బ్రహ్మను గద్దంతోచూపారు.

**గణపతి :** ముక్కోటి దేవతలలో గణపతి ముఖ్యదేవాక మొదటి వాడని చెప్పవచ్చు. ఇతని పుట్టుక అద్భుతంగా వుంటుంది. గణేశ ప్రతిమా లక్షణాలు కూడా ప్రత్యేకంగా వుంటాయి. ఇతనిని గణేశ, విఘ్నేశ్వర, ఏకదంతుడు, గజానన, సిద్ధివినాయక మొదలైన పేర్లలో కూడ పిలుస్తారు. ఏ కార్యమైనా నిర్విఘ్నంగా పూర్తికావాలంటే గణపతి మహాదేవుని పూజించుట మన భారతీయ సాంప్రదాయం.

వైదిక యుగంలోనూ, పౌరాణిక యుగంలోనూ గణపతి పేరు ప్రసిద్ధంగా వినవస్తుంది. పురాణాలలోని అనేక కథల ప్రకారం అతడు విఘ్నాల కధిపతి. గణపతి విఘ్నాలను కలిగించనూ కలడు, వాటిని తొలగించనూకలడు. 'గ' అనగా బుద్ధి, 'ణ' అనగా విద్యలేక వివేకం, 'పతి' అనగా అధిపతి. కాబట్టి 'గణపతి' అనగా 'విద్యాబుద్ధులకు అధిపతి' అని అర్థం. త్రిపురాసుర సంహారకాలంలో శివుడు గణపతిని పూజించి విజయం పొందినట్లు తెలుస్తున్నది. ఆ సమయంలోనే శివుడీతనిని సకల శుభారంభ వేళల పూజనీయుడుగా నిర్ణయించాడు. ఆనాటి నుండి అందరూ ప్రతి కార్యారంభంలోనూ విఘ్నేశ్వరునిముందు పూజించడం ఆచారమైంది. గణపతిని గురించి ఎన్నో కథలు ప్రచారంలో వున్నాయి. (వాటిని యిక్కడ చర్చించటంలేదు) (సి. పూర్ణచంద్, "గణపతి నాడు—నేడు" ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 31–8–1979 pp 6, 7).

నవగ్రహాలతోను, సప్తమాతృకలతోను వున్నప్పుడు గణపతి నిలబడి వుండాలని సుప్రభేదాగమం చెప్తోంది. ముద్గల పురాణంలో గణపతి యిరువది రెండుపేర్లు ప్రస్తావించబడ్డాయి. శిల్పసార శాస్త్ర ప్రకారం ముప్పై రకాలైన గణపతి విగ్రహాలున్నాయి. సాధారణంగా గణపతిని సమభంగ, ఆసీనస్థితిలో చూపుతారు. ఇతనితొండం సాధారణంగా ఎడమ ప్రక్కకు తిరిగి వుంటుంది. కొన్ని విగ్రహాలలో తొండం కుడివైపుగా వున్నట్లు కూడా చెక్కబడి వున్నాయి. సామాన్యంగా యితనికి రెండు కళ్ళు మాత్రమే వున్నా, ఆగమ శాస్త్రాలు మూడు కన్నులున్నట్లుగా చెబుతున్నాయి, నాలుగు చేతులుండుట సర్వ సాధారణమైన విషయం. కాని కొన్నిచోట్ల పద్నాలుగు చేతులు చూపబడినాయి. ఆ చేతులందు పాశం, అంకుశం, లడ్డుముద్ద మొదలైనవి వుంటాయి. ఇతని వుదరానికి పాముచుట్టుకొని వుంటుంది. ఇతని వాహనం మూషికం.

ఆర్. జి. బండార్కర్ అభిప్రాయం ప్రకారం గణపతి ప్రతిమలు చాలా ఆలస్యంగా హిందూ ఆలయాలలో చోటు చేసుకున్నాయి.

ఇతని ప్రకారం గుప్తుల కాలంలో ఎక్కడా యీస్వామిని పూజించినట్లుగా గానీ, శాసనాలలోగానీ తెలుపలేదు. క్రీ. శ. 6 వ శతాబ్దం నుండి గణ పతిని క్రమం తప్పకుండా పూజించటం మొదలైందని అభిప్రాయపడెను (R. G. Bhandarkar, Vaishnavism, Saivism and Minor Religious Systems, pp. 148 ff). కాని అజయ్‌మిత్రశాస్త్రి గుప్తుల తొలికాలంనుండి స్వామిప్రతిమలు లభించినట్లు తెలిపెను. ఇతని ప్రకారం మథుర, బిటర్‌గాన్‌లోని యిటుకలలో నిర్మించిన ఆలయాలలో గణపతి ప్రతిమలు లభించినట్లు తెలుస్తూవుంది. కాబట్టి గణపతి క్రీ. శ. 3-4 వ శతాబ్దం నుండి దర్శన మిస్తున్నట్లుగా భావించవచ్చు (Ajay Mitra Sastri, India as Seen in the Brihatsamhita of Varahamihira, New Dilhi, 1969, p. 150).

నాటినుండి నేటివరకు శిల్పాలలో ఆయన రూప లావణ్యాలు దాదాపు ఒకేలాగ వుండటం మరో విశేషం. ఐదవ శతాబ్దానికి చెందిన వో గణపతి శిల్పం భూమారాలలో గుప్తుల దేవాలయంలో దొరికింది. ఈ ప్రతిమకు గంటలతో కూర్చిన హారముంది. ఆరవశతాబ్దానికి చెందిన మరొక భూమారా శిల్పంలో గణపతి శక్తి సమేతుడై నాలుగు చేతులు కలిగివున్నాడు.

అతిప్రాచీన శిల్పాలలో గణపతి విగ్రహానికి కిరీటంలేదు. నిజ మైన ఏనుగు తలవుండేది. భూమారా, దేవఘడ్, ఉదయగిరిలలోని గుప్తులనాటి శిల్పాలలోను, విజయవాడ, మొదుగులలోని విష్ణుకుండిన శిల్పాలలోను బిక్కవోలులోని తూర్పు చాళుక్య శిల్పాలలోను యీ లక్ష ణాలు చూడవచ్చు. నాలుగు చేతులతోను కిరీటంతోను వున్న వినాయ కుని విగ్రహాలను పల్లవ, చోళ, చాళుక్య, హోయసల, కాకతీయ, విజయనగర శిల్పాలలో చూడవచ్చు.

గణపతి హిందువులకే గాక జైనులకు, బౌద్ధులకు కూడా పూజ నీయుడు. గుప్తుల కాలపు బౌద్ధ శిల్పాలలో గణపతిని చూడవచ్చు.

ఉత్తర భారతదేశం, నేపాల్, టిబెట్‌లలో గణపతి బౌద్ధుల దేవుడుగా ఆరాధించ బడ్డాడు.

గణపతి ఆరాధన నేపాళ్‌కు కూడా విస్తరించింది. ఇక్కడ రక్త గణపతి ఆలయముంది. సాగరాలు దాటి జావావరకు ప్రాకింది. ఇచ్చట కాపాలిక గణపతి ఆలయంవుంది. టిబెట్టులోని బుద్ధ గణపతి ఆలయం మెక్సికోలోని వినాయకాలయం ముఖ్యమైనవి. బర్మా, సయాం, జపాన్, బోర్నియోలలో కూడా గణపతిని పూజిస్తారు.

ఈ స్వామి బాలగణపతి, తరుణ గణపతి, మహా గణపతి, భక్తి గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, విఘ్నరాజ గణపతి, హేరంబ గణపతిగా వుండే విగ్రహాలు పలుచోట్ల వున్నాయి. వీనిలో శక్తి గణపతీ, లక్ష్మీ గణపతి విగ్రహాలకు ప్రక్కన దేవీ విగ్రహాలు కూడా చెక్కబడి వున్నాయి. ఉచ్ఛిష్ట గణపతి దేవిని ఎడమ తొడపై కూర్చొన బెట్టుకొని బాణం, ధనస్సు, పాశం, అంకుశం హస్తాలలో ధరించి వుంటాడు. హేరంభ గణపతి విగ్రహం ఐదుతలలతో సింహాన్ని వాహనంగా కలిగి విచిత్రంగా వుంటుంది.

వినాయక చవితి అటు ఉత్తర భారతదేశంలోనూ, యిటు దక్షిణ భారతదేశంలోనూ విధిగా ఆచరించబడే పండుగ. ముఖ్యంగా తమిళులు యీ పండుగను అత్యంత అనురక్తితోను, భక్తిప్రపత్తులతోను ఆచరిస్తారు. వారు గణపతిని 'పిళ్ళైయార్' అంటారు. గణపతి వుత్సవాలు చాలా పెద్ద ఎత్తులో నిర్వహింప బడటం మనంచూడవచ్చు. వందలాది విగ్రహాలూ, వేలాది ప్రజలూ వూరేగింపుగా కదిలి గణేశ నిమజ్జనోత్సవంలో పాల్గొనడం ఎంతో కన్నుల పండువుగా వుంటుంది.

లేపాక్షి వీరభద్రాలయంలో గణపతి ప్రతిమలు చాలావున్నాయి. కల్యాణ మండపంలోని వొక స్తంభం మీద స్థానక గణపతి ప్రతిమవుంది.

ఇక్కడ స్వామిని బాగా అలంకరించబడిన వొక కోష్టం నందుంచారు. నాలుగు చేతులుండి పై చేతులలో పాశం. పరశు కల్గివున్నాడు. క్రింది ఎడమ చేతిలో స్వ-దంతం, కుడిచేయి కట్యవలంబిత ముద్రలోవుంది. హారాలు, కేయురాలు, అర్ధోరుకం, పొడవాటి వనమాల మొదలైన వానితో అందంగా అలంకరించబడివుంది. తొండం కొననాగం చుట్టుచుట్టు కొని నట్లుంది (ఫోటో. 16).

ఇంకొక స్తంభంపై నృత్త గణపతి ప్రతిమవుంది. కుడికాలు కొద్దిగా వంగి పాదం భూమిమీద వుంది, ఎడమకాలు మోకాటి దగ్గర వంగివుంది. భుజంగ లలిత నృత్య భంగిమలోవుంది. పై చేతులలో పాశ, అంకుశం; క్రిందనున్న ఎడమ చేతిలో మోదక ధరించివున్నాడు. కుడిచేయి కటక హస్త ముద్రలోవుండి పుష్పాన్ని కలిగివున్నాడు. కరండ మకుటం, యజ్ఞోపవీతం, నాగ–ఉదరబంధ, పూర్ణోరుకంలతో స్వామి అలంకరించబడివున్నాడు.

ఈ ఆలయంలోనే రెండు ఆసీన గణపతి ప్రతిమలు కలవు. ఈ రెండు వుదాహరణలలో స్వామికి నాలుగు చేతులుండి పైన కన్పరిచిన లక్షణాలున్నాయి.

వేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలో నాట్యమండపం చాలా అందంగా రూపుదిద్దబడివుంది. ఈమండపంలోని స్తంభాలమీద తుంబుర, నారద, నందికేశ్వర, భృంగి, రంభ, హిమవంతుడు, మేనకల పెద్దపెద్ద ప్రతిమలు కనిపిస్తాయి. తుంబురుడు వీణను మీటుతున్నట్లు, నారదుడు మహతినివాయిస్తున్నట్లు, నందికేశ్వరుడు హుడుక్కను ప్రయోగిస్తున్నట్లు, భృంగి, రంభ చాలా ఆసక్తికరంగా నృత్యంచేస్తూన్నట్లు చూపబడివుంది. శిల్పాకృతిలో మనోహరంగా సృష్టించిన యీ సన్నివేశం, యిదే ఆల యంలోని నాట్యమండపంలో వర్ణచిత్రంగా దర్శనమిస్తుంది. వర్ణచిత్రం లోనూ యీ సన్నివేశమే ఏమినహాయింపు లేకుండా అందంగా చిత్రీకరిం చబడివుంది.

విజయనగర శిల్పులు శరీర నిర్మాణశాస్త్రం బాగా తెలిసినవారుగా కనిపిస్తారు. వీరు రూపొందించే మానవాకృతుల్లో శరీరావయవ నిర్మాణంలో కనిపించే వాస్తవిక సౌందర్యం మనల్ని చకితుల్ని, సమ్మోహితుల్ని చేస్తుంది. ఈ శిల్పుల కళాకుశలతకు, వారాకళలో సాధించిన ప్రగతికి, వున్నతికి తార్కాణాలుగా మనకు నేటికీ శిల్పాలు సాక్షీ భూతాలుగా నిలిచివున్నాయి.

## దిక్పాలురు :

హిందూ ధర్మశాస్త్రాల ప్రకారం దిక్పాలురు ఎనిమిది దిక్కులకు అధిపతులు. కొన్ని పురాణాలలో వొక్కొక్కరికి దిక్కు కేటాయించట మైనది. ఇంద్రుడు తూర్పు దిక్కుకు అధిపతి, యముడు దక్షిణాధీశుడు, వరుణుడు పశ్చిమదిక్కుకు, కుబేరుడు ఉత్తర దిక్కునకు, అగ్ని ఆగ్నేయానికి, నిఋత్తి నైఋతిదిక్కునకు, వాయువ్యానికి వాయుదేవుడు, ఈశానుడు ఈశాన్యానికి అధిపతులు.

మామూలుగా ఆలయాలలోని వితానంకు, ప్రాకార గోడలకు, కల్యాణ మండపంలోని స్తంభాలమీద వీరిని ప్రతిమల రూపంలో మలుస్తారు. చాళుక్యుల ఆలయాలలో దిక్పాలుర ప్రతిమలు కన్పిస్తాయి. నొలంబ, కాకతీయుల ఆలయాలలో సభా మండపాల్లో వీరి ప్రతిమలు మలచబడివున్నాయి. ఒక్కొక్కసారి వీరిని సమూహంగా చూడవచ్చు. రాష్ట్రకూటుల కాలంనాటి ఎల్లోరాలోని కల్యాణసుందరమూర్తి ప్రతిమలో వీరందరూ గుంపుగా చూపబడినారు. ఇక్కడ వీరితోబాటు వీరిదేవేరులను కూడా మలిచారు. ఇలాంటిదే 7–8 శతాబ్దానికి సంబంధించిన శిల్పం కనోజ్‌లోవుంది. ఒరిస్సా ఆలయాలలోని వెలుపలి గోడలమీద యీ దిక్పాలురు కనిపిస్తారు. ఇక్కడ ముందు నిర్మించిన ఆలయాలలోని దిక్పాలురకు తర్వాతి కాలంలో నిర్మించిన ఆలయాలలోని దిక్పాలురకు చాలా తేడావుంది. అంతేగాక పైన కనబరచిన దిక్కుల హోదాలను కూడా మార్చబడి వున్నాయి. ఇక విజయనగర కాలంలో ప్రాకార గోడలమీద, కల్యాణమండపాలలో వీరిని చూడవచ్చు. లేపాక్షి

లోని వీరభద్రాలయంలోను, శ్రీకాళహస్తిలోని కాళహస్తీశ్వరాలయం లోనూ వీరికి మంచి స్థానం యివ్వబడింది. లేపాక్షిలోని దిక్పాలుర గురించి యీ క్రింద వివరించబడింది. అంతేకాక శిల్పశాస్త్రంలో వీరిని గురించి తెలిపిన విషయాలు కూడా పొందుపరచ బడినాయి. ఇంకా యితర విజయనగర ఆలయాలలోని దిక్పాలురతోను, ఉత్తర, దక్షిణ భారతదేశంలోని దిక్పాలురతోను పోల్చి పరిశీలించడం జరిగింది.

**ఇంద్రుడు :** ఇంద్రుడు దేవతలరాజు. ఇతని గొప్పతనం గురించి ఋగ్వేదం లో 250 శ్లోకాలు వివరిస్తాయి. అంటే సుమారు వేదాలలో పాతికవంతు ఇంద్రుని గురించిన శ్లోకాలే. ఇతడు దేవతలకధిపతి కాబట్టి సురపతి, సురేష, అమరప, దేవరాజు మొదలైన పేర్లతో వ్యవహరింపబడుతుంటాడు. స్వర్గలోకానికధిపతియైన దేవేంద్రుడు ఆ పదవిలో కొనసాగేందుకు చేసే ప్రయత్నాలు పురాణాల్లో చాలా ప్రసిద్ధాలు.

లేపాక్షి కల్యాణ మండపంలో ఇంద్రుని ప్రతిమవుంది (ఫోటో. 17). ఇక్కడ ఇంద్రుడు రెండు కాళ్లూ భూమిమీద స్థిరంగావుంచి సమ పాద స్థానక స్థితిలో వున్నాడు. గ్రైవేయకాలు, హారాలు, స్కంద మాలలు, ఉదరబంధ, యజ్ఞోపవీతం, కిరీటమకుటం, మంజీరాలు, మేఖల, పూర్ణోరుకంలలో చాలా అందంగా యీమూర్తి తీర్చబడివుంది. నాలుగు చేతులు కలిగివున్నాడు. పైనున్న కుడిఎడమ చేతులలో వజ్రంవుంది. క్రింది చేతులు అభయ, వరదముద్రలలో వున్నాయి. నొసటన నిలువుగా మూడవకన్ను చూపబడింది. ఇంద్రుని వాహనమైన ఐరావతం (ఏనుగు) చూపబడింది.

ఇంద్రుని ప్రతిమాలక్షణాలను గురించి పురాణాలు, శిల్పశాస్త్రాలు యీ క్రింది విధంగా తెల్పుతున్నాయి. మానసోల్లాస ప్రకారం యితనికి రెండు చేతులు మాత్రముంటాయి (భుజద్వయ సమన్వితమ్). ఒక చేతిలో కులిశ (వజ్రం), మరొకచేతిలో ఉత్పల పుష్పం వుంటుంది.

(కులిశం దక్షిణ పార్శ్వం వామహస్తే లలోత్పలమ్) వాలా ఆభరణా లతో అలంకరించబడివుంటుంది. సింహాసనం మీదున్నట్లు వర్ణించబడింది. ఇతని కిరువైపులా గంధర్వులుంటారు. బృహత్ సంహిత ప్రకారం ఇంద్రుని నుదుట మూడవ కన్ను అడ్డంగా వుంటుంది. ఇతని వాహన మైన ఐరావతం తెల్లగావుండి నాలుగు దంతాలు కలిగివుంటుంది. అగ్ని పురాణంలో ఇంద్రుడు తన వాహనమైన ఐరావతంపై పోతున్నట్లు, చేతిలో వజ్రమున్నట్లు తెలుపబడింది. రూపావతారం ప్రకారం ఇంద్రు నికి నాలుగు చేతులున్నాయి. పై రెండు చేతులలో అంకుశం, కమండల ముండి క్రిందిచేతులు అభయ, వరదముద్రలో వుంటాయి. అంశుమద్భే దాగమ ప్రకారం నిలుచొని వున్నట్లుండి, కరీటముకుటంతోబాటు వివిధ ఆభణాలు ధరించినట్లు తెలుపబడింది. రెండు చేతులలో శక్తి, అంకుశం వుంటుంది. దేవి అయిన శచీదేవి ఎడమవైపున వుంటుంది (వామేశచి సమన్వితమ్). ఇంకా శ్రీతత్వనిధిలోను, సుప్రభేదాగమంలోను ఇంద్రుని గురించి ప్రస్తావించడం జరిగింది.

పైన కనబరచిన లక్షణాలన్నీ రేపాకి ఇంద్రునిలో కనబడవు. ఇంద్రాణి, గంధర్వులు, అప్సరసలు యిక్కడలేరు. అలాగే మూడవ కన్ను పురాణాలలో చెప్పినట్లు అడ్డానికికాక నిలువుకుంది. శక్తి, అంకు శం కూడా యిక్కడ చూపలేదు, ఇక్కడ ఇంద్రుడు రెండుచేతులలోను వజ్రం పట్టుకొన్నాడు.

సి. శివరామమూర్తి అభిప్రాయం ప్రకారం ఇంద్రుని ప్రతిమ మొట్టమొదటిది క్రీ. పూ. 2వ శతాబ్దంనాటి 'బాజ' గుహలోవుంది (C. Sivarama Murti, Early Andhra Art and Iconography, Hyderabad, 1979, P.2, Fig.3). ఇది బహుశ శాత వాహన శిల్పులసృష్టిగా భావించవచ్చు. ఇక్కడ ఇంద్రుడు ఐరావతంపై పోతున్నట్లుంది. ఇంద్రుని తలపై తలపాగ వుండటం గమనార్హం. మెడతో వర్తుగా అల్లిన పూసలమాల కలదు. బాదామి చాళుక్యల అలం

పూర్‌లోని స్వర్గ బ్రహ్మ ఆలయంలోను, సత్యవోలులోని రామలింగేశ్వ
రాలయంలోను యీ దిక్పాలుని ప్రతిమవుంది. ఇక్కడ వెనుకభాగంలో
వాహనం చూపబడింది. మూడవకన్ను అడ్డంగా నొసట చూపబడింది.
ఐహోళేలో కూడా ఇంద్రుని ప్రతిమవుంది. తూర్పు చాళుక్యుల కాలం
లోని బిక్కవోలులోని గోలింగేశ్వరాలయంలోనూ, ద్రాక్షారామంలోని భీమ
లింగేశ్వరాలయంలోనూ ఇంద్రుని ప్రతిమలున్నాయి. ఇక్కడ ఇంద్రు
నికి రెండు చేతులే చూపబడినాయి. నాలుగు చేతుల ఇంద్రుని ప్రతిమలు
చోళుల కాలంలో కనిపిస్తాయి. చిదంబరంలోని శివాలయంలో వాహనం
మీద కూర్చొని వున్నట్లుంది. పై చేతులలో వజ్రం, అంకుశం వున్నాయి.
క్రిందిచేతులు అభయ, వరదముద్రలో వున్నాయి. ఇంకొక వుదాహర
ణలో భద్రాసనంలో కూర్చునివున్నాడు. ఇక్కడ అంకుశం, వజ్రాలతో
బాటు అక్షమాల, కమండలం చూపబడినాయి. ఉత్తర భారదేశంలో
సాంచి, గాంధార, మధురలలో యీదిక్పాలుని ప్రతిమలున్నాయి. రెండు
చేతుల ఇంద్రుని ప్రతిమలు భూమారలోని శివాలయంలోను, భువనేశ్వర్
లోని పరశురామేశ్వరాలయంలోనూ కనిపిస్తాయి. ఖజురహోలో రెండు,
నాలుగు చేతులు కలిగిన వుదాహరణలు కనిపిస్తాయి.

వివిధ కాలాలలోని ఇంద్రుని ప్రతిమలలో లేపాక్షి దిక్పాలుని
పోల్చితే ఏప్రతిమ రీతిలోనూ పోలివుండకపోవడం చూడవచ్చు. అలాగే
మిగిలిన విజయనగర ప్రతిమాలక్షణాలకు కూడా యిది భిన్నంగావుంది.
వివిధ విజయనగర ఆలయాలలో ప్రతిమలను పరిశీలిస్తే యిది విదిత
మౌతుంది. శ్రీశైల మల్లికార్జునాలయంలోని ప్రాకార కుడ్యానికి. శ్రీ
కాళహస్తి కల్యాణ మండపంలోను ఇంద్రుని ప్రతిమలున్నాయి. ఈ
రెండు వుదాహరణలలోనూ ఐరావతం మీద స్వారీచేస్తున్నట్లుగా వుంది.
రెండు చేతులలో వజ్రం, అంకుశం వున్నాయి. లేపాక్షిలోని ప్రతిమకు
రెండు చేతులలో వజ్రంవుంది. ఐరావతంమీద స్వారీచేస్తున్నట్లుగాలేదు.
లేపాక్షి ఇంద్రుని బాగా తరచిచూస్తే చాలా ఆసక్తికరమైన విషయం
తెలుస్తుంది. శరీరంమీద కన్నులు కనిపిస్తాయి. దీనికి సంబంధించిన

[illegible] యావిధంగా చెప్తున్నాయి. రామాయణ రచన కర్త వాల్మీకి ఇంద్రుని [illegible] చాలా కథలుగా వర్ణించాడు. అందులో అహల్యా [illegible] కూడా వొకటి. ఈ విషయాన్ని పద్మ పురాణం, స్కంద పురాణం, ఆనంద రామాయణం, కథాసరిత్సాగరం, హర్షచరిత్ర, [illegible], [illegible] మొదలైన పురాణాలలో కూడా వర్ణించారు. వీటి ప్రకారం ఇంద్రుడు అహల్యను మోహించి రాత్రిని [illegible] తన మాయతో చూపి అహల్యను ఆమె భర్త [illegible] పంపిస్తాడు. అది తెలుసుకొన్న అహల్యా భర్త (ముని) కోపంతో ఇంద్రుని వొడలెల్ల యోనులతో నుండమని శపిస్తాడు. ఇవి నేత్రాలుగా వుండుట వల్ల ఇందునికి 'సహస్రాక్ష'దని పేరు వచ్చింది (Ramayana, I.48, VII. 30; P. V Kane, History of Dharmasastra, Poona, 1941, II - II, PP. 1145 ff). ఈ [illegible]వేశంతో ప్రేరేపితులైన విజయనగర శిల్పులు యిలాంటి ప్రతిమను [illegible]. ఇలాంటిది యింకెక్కడాలేదు. చాలా ఆసక్తికరమైన ఇంద్రాణి ప్రతిమ భారత్ కళాభవన్‌లో వుంది. ఇక్కడ దేవికి [illegible]యున్నాయి. దేవి కూర్చొనివుండి వొకచేతిలో వజ్రం, మరొక చేతిలో [illegible] కలిగివుంది. వాహనం లేకుండుట గమనార్హం. ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే ఇంద్రాణి వక్షపై భాగంలో కంఠాభరణానికి [illegible]గంలో రెండు వరుసల నేత్రచిహ్నాలు. ఇంద్రుడు సహస్రాక్షుడు కాబట్టి శిల్పులు ఇంద్రాణికి కూడా యిలాంటి నేత్రచిహ్నాలు [illegible] వుండవచ్చు (Vishveswarananda Indological Journal. Vol IV, Part-I, 1966, pp. 80 ff). ఇలాంటి శిల్పం [illegible] కన్పించక పోవడం గమనార్హం.

**అగ్ని :** అగ్నిదేవుని గురించి చాలా శ్లోకాలున్నాయి. ఇతనిని ఋగ్వేదంలో మొదటి [illegible] వొకనిగా అభివర్ణించారు. అగ్ని 'స్వాహా[illegible]'. [illegible] కర్తగా కూడా అగ్నిదేవుడు ప్రస్తుతించబడ్డాడు. ([illegible] ఇంద్రుడు, సోముడు). మానవ జీవన విధానంలో,

వివాహ క్రతువుల్లో అగ్నిదేవునకు ప్రముఖస్థానం యివ్వబడింది. అగ్ని ఎనిమిదిమంది దిక్పాలురల్లో వొకడు. ఇతడు ఆగ్నేయదిక్కున కధిపతి. ఈ దిక్కును 'పరంజ్యోతి' అని కూడా అంటారు.

వీరభద్రాలయంలోని కల్యాణ మంటపంలో వొక స్తంభం మీద అగ్ని ప్రతిమవుంది (ఫోటో. 18). ఈ స్తంభం కూడా ఆగ్నేయ దిక్కున వుండడం గమనించదగింది. ఇక్కడ అగ్నిదేవుడు ద్విభంగా కృతిలో వున్నాడు. రెండు ముఖాలు (ద్విముఖ) నాలుగు చేతులు (చతుర్భుజ) కలిగివున్నాడు. ఈ ప్రతిమ కోష్టం లోపలవుంది. పైభాగం చిత్రతోరణంతోనూ, దానిపైన కీర్తిముఖంతోనూ అలంకరించబడివుంది. నాలుగు చేతులు కలవు. పై చేతులలో పరశు, త్రిశూలం (?)వున్నాయి. క్రిందచేతులు అభయ, వరదముద్రల్లో వున్నాయి. కిరీటమకుటం, గ్రైవేయకాలు, ఉదరబంధం, మేఖల, యజ్ఞోపవీతంతో యీ మూర్తి ప్రతిమ అలంకరించబడివుంది. అగ్ని అర్ధోరుకం ధరించి వున్నాడు. అగ్ని వాహనమైన పొట్టేలు విగ్రహం క్రిందిభాగంలో వున్న పీఠంమీద వుంది. ఇది చిన్న తోకలో, తిరిగిన కొమ్ములు కలిగివుంది. కోష్టం యిరువైపుల వున్న కుడ్యస్తంభాలు, స్తంభం క్రిందిభాగం ఎటువంటి అలంకరణ లేకుండా సాధారణంగా వున్నాయి. ఈ దిక్పాల ప్రతిమలో శిల్పి ఎక్కువ పనితనం చూపలేదు. పై రెండు కారణాలబట్టి యీ స్తంభం పూర్తికాకుండా నిలిచిపోయినట్లు తెలుస్తూవుంది. అయినప్పటికీ ప్రతిమ లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అగ్నిని గురించిన పూర్తి వివరాలు మనకు విష్ణు ధర్మోత్తర పురాణంలో దొరుకుతాయి. దీని ప్రకారం అగ్ని గడ్డంతోను, నాలుగుచేతులతోను, మూడు కన్నులతోను వుంటాడు. హంసలచే లాగబడే రథంలో పోతున్నట్లుంటాడు. అగ్ని దేవుని పత్నియగు స్వాహాదేవి అగ్ని ఎడమ తొడమీద కూర్చొని వుంటుంది. మత్స్య పురాణం ప్రకారం చేతులలో అక్షమాల. కమండలం కలిగి పెద్ద గడ్డంలో వుంటాడు. (లంబ కూర్చ

ధరమ్). ప్రతిమ అగ్ని జ్వాలలతో ఆవహింపబడి వుట్లుంటుంది (జ్వాలావితాన సమ్యుక్తమ్) వాహనమైన పొట్టేలు వుంటుంది. ఆతను అర్ధ చంద్రాసనంలో కూర్చొని వున్నట్లు లేదా అగ్ని కుంపటి నుండి బయటకు వస్తున్నట్లు వుంటాడు. పొట్టేలుపై స్వారీ చేస్తూ చేతిలో శక్తి కలిగివున్నట్లుగా అగ్ని పురాణంలో తెలుపబడింది. నల్లటి దుస్తులు ధరించినట్లు, వాహనంపై స్వారీ చేస్తున్నట్లు హరి వంశంలో తెలుపబడింది. మహాభారతంలో అగ్ని ఏడు ఎర్రటి నాలుకలు కలిగి వుండి (సప్తజిహ్వా), జూలు కిరీటధారిగా ఏడు ఎర్రటి గుర్రాలు లాగుతున్న రథంలో పోతున్నట్లు వివరించబడింది. ఈ మూర్తి ఏడుముఖాలు ఎర్రటిమెడ, పెద్దకళ్ళు, పెద్దనోరు కలిగివుంటాడు. హయశీర్ష పంచ రాత్రంలో దిక్పాలుడు యోగపట్టాసనలో కూర్చొని, మధ్యలో జ్వాలలుంటాయి (జ్వాలా మండల మధ్యస్తమ్) గడ్డముంటుంది. చేతులలో అక్షసూత్రం, కమండలం కలిగివుంటాడు.

లేపాక్షిలోని అగ్ని ప్రతిమను పైన తెలిపిన లక్షణాలతో పోల్చితే విరుద్ధంగా కనిపిస్తుంది. పై పురాణాలలో తెలిపినట్లు ముఖ్యంగా యీ ప్రతిమకు గడ్డంలేదు. హంసలుగాని, గుర్రాలుగాని లాగుతున్న రథంపై అగ్నిని యిక్కడ చూపలేదు. ఇచ్చట మూర్తి నిలబడి వున్నాడు. అర్ధ చంద్రాసనంలోగానీ, యోగపట్టాసనంలోగానీ చూపలేదు. అలాగే అగ్ని కుంపటినుండి వుద్భవింపుతూ వున్నట్లుగా చూపలేదు. అక్షమాల, కమండలం చేతులలో లేవు. దిక్పాలుని పత్ని అయిన స్వాహాదేవిని చూపటం జరగలేదు. విజయనగర ఆలయమైన శ్రీశైలంలో అగ్ని ప్రతిమవుంది. ఇక్కడ రెండు చేతులలో కత్తి, డాలు కలిగివున్నాడు. పొట్టేలుపై స్వారీ చేస్తున్నట్లుగావుంది. అగ్ని తలపై నుండి అగ్నిజ్వాలలు లేస్తున్నట్లున్నాయి. వివిధ కాలాలలోని అగ్ని ప్రతిమాలక్షణాలను పరిశీలిస్తే ఎక్కడైనా లేపాక్షి అగ్ని లక్షణాలున్న ప్రతిమ ఉన్నాయేమో తెలుస్తుంది.

మొట్టమొదటి అగ్ని ప్రతిమ కుషాణుల కాలానికి సంబంధించినది లక్నో ప్రదర్శనశాలలో వుంది. గుప్తుల కాలంనాటివి అహిచ్ఛత్ర, సహారన్‌పూర్‌లో వున్నాయి. పై వుదాహరణలలో వాహనమైన పొట్టేలు లేదు, గడ్డముండదు. మలి గుప్తుల కాలంలో మొనదేలిన గడ్డముం టుంది. కౌశాంబిలో దొరికిన అగ్ని ప్రతిమ యిప్పుడు అమెరికా ప్రద ర్శనశాలలోవుంది. ఈ ప్రతిమ తలచుట్టూ అగ్నిజ్వాలలు కనిపిస్తాయి. వాహనమైన మేషం ఎడమ వైపున మూలగావుంది. మొనదేలిన గడ్డ ముంది. ఇంకా యిక్కడ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే మేకతల కలిగివున్న ఒక్కరు పురుషులు ప్రతిమ కిరువైపులా నిలుచొని వుండటం. ఇలాంటిది మరెక్కడా కానరాదు. రెండు చేతులలో వాహనంమీదస్వారీ చేస్తున్నట్లు లేదా పద్మ సింహాసనం మీద కూర్చొని అక్షమాల, కమం డలం చేతులలో కలిగివుండే ప్రతిమలు కలకత్తా, లండన్ ప్రదర్శనశాల లలోవున్నాయి. ఖజురాహోలో నాలుగు చేతుల వుదాహరణలు చాలా వున్నాయి. ఇక్కడ ప్రతిమల్లో చాలా వరకు మంటలు చూపలేదు. ఒరి స్సాలో దిక్పాలుడు వాహనంపై కూర్చొని అక్షమాల, పాత్రపట్టుకొన్నట్లు గాను, కొన్ని చోట్ల గడ్డముండి వాహనంపై స్వారీ చేస్తున్నట్లుగాను చూపబడింది. దక్షిణ భారతదేశంలో బాదామిచాళుక్యుల ఐహోళే, అలం పూర్‌లలోని స్వర్గ బ్రహ్మాలయంలోను, విశ్వ బ్రహ్మాలయంలోను యీ ప్రతిమలున్నాయి. వీరికాలంలో అగ్ని వాహనంపై స్వారీ చేస్తున్నట్లు గాను, కుడిచేతిలో పద్మముండి, ఎడమ చేయిపై కెత్తినట్లుగావుంటుంది. అలంపూర్ వుదాహరణలో సమపాద స్థానక స్థితిలో వుండి ఒక చేతిలో నీటి పాత్రవుండి మరొక చేయి వరద ముద్రలోవుంది. తూర్పు చాళు క్యుల కాలంలో కూడా అగ్ని ప్రతిమలున్నాయి. మలిచాళుక్యులకాలంలో పానుగల్ పచ్చల సోమేశ్వరాలయంలో దేవీ సహితుడై స్వారీ చేస్తు న్నట్లుంది. అగ్నిజ్వాలలు ప్రతిమకు వెనుక ప్రభామండలంగా అమర్చి నట్లుంది. ఒక చేతితో పత్నిని పట్టుకొని వుండి, మరొకచేయి అభయ ముద్రలోవుంది. రెండు తలల వుదాహరణ కడయూర్, చిదంబరంలో వున్నాయి. కడయూర్‌లో అగ్ని రెండు మేకతలలతోను, ఏడు చేతుల

తోను, మూడు కాళ్ళతోవున్నాడు. చిదంబరంలో రెండు మనిషి తలలు, ఏడు చేతులు, మూడు కాళ్ళతోవున్నాడు. లేపాక్షిలోని రెండు శిరస్సుల అగ్ని చిదంబరంలోని రెండు తలల అగ్ని విషయంలో పోలికవుంది. మిగతా లక్షణాలలో వేరుగావుంది. లేపాక్షిలో అగ్నికి రెండు కాళ్ళు, నాలుగు చేతులూ వున్నాయి. బి. సహాయ్ అగ్ని ప్రతిమా లక్షణాలను యీ విధంగా వివరీకరించాడు.—"ఉత్తర భారతదేశంలో అగ్నిని వొక శిరస్సుతోను, దక్షిణ భారతదేశంలో రెండు శిరస్సులతోను చూపటం జరిగింది. ఒక్కొక్క చోట వొక శిరస్సు వుదాహరణలు కూడావున్నాయి. ఉత్తర భారతదేశంలోని ప్రతిమలకు మామూలుగా రెండు చేతులు వున్నాయి (వొక్క ఖజురహోలో మాత్రం నాలుగుచేతుల వుదాహరణ కలదు). దక్షిణ దేశంలో ఏడు చేతులకంటె ఎక్కువే కన్పిస్తున్నాయి. రెండు, నాలుగు చేతులుకలిగిన ప్రతిమలు చాలాఅరుదుగా కన్పిస్తాయి" (B. Sahai, Iconography of the Minor Hindu and Buddhist Deities, New Delhi, 1975, pp 35 ff). దక్షిణ భారతదేశంలోని అగ్ని ప్రతిమలను గమనిస్తే శిరస్సులు, చేతుల విషయంలో బి. సహాయ్ తెలిపిన లక్షణాలు ఎంత వరకు సమంజసమో తెలుస్తుంది.

(1) ఐహోళే, కొంటిగుడి ఆలయాలలో రెండు చేతులు, వొక తల (2) ఎల్లోరాలోని 16, 19 గుహాలయాలలో రెండుచేతులు, వొక తల (3) అలంపూర్‌లోని స్వర్గబ్రహ్మ, విశ్వబ్రహ్మాలయాలలోరెండు చేతులు, వొకతల (4) బిక్కవోలులోని రాజరాజేశ్వరాలయంలో రెండు చేతులు, వొకతల (5) బాగల్‌లోని కల్లేశ్వరాలయంలో రెండు చేతులు, వొకతల (6) పానగల్‌లోని పచ్చల సోమేశ్వరాలయంలో రెండుచేతులు, వొకతల (7) చిదంబరంలో ఏడుచేతులు, మూడు కాళ్ళు, రెండుతలలు (8) కంచయూర్‌లో ఏడుచేతులు, మూడు కాళ్ళు, రెండు మేక తలలు (9) శ్రీశైలంలో రెండు చేతులు, వొకతల (10) శ్రీకాళహస్తిలో రెండు చేతులు, వొకతల (11) లేపాక్షి వీరభద్రాలయంలో నాలుగు చేతులు, రెండు తలలు కలిగివున్న మూర్తుల్ని మనం గుర్తించవచ్చు.

పైన కనబరచినట్లు దక్షిణ భారతదేశంలో మామూలుగా ఒక తల, రెండు చేతులు వున్నట్లు తెలుస్తూవుంది. రెండు తలలు, నాలుగు లేదా ఏడు చేతులున్నవి చాలా అరుదుగా కనిపిస్తాయి. టి. ఎ. గోపీనాథరావు దక్షిణ దేశంలో అగ్ని ప్రతిమలకు ఏడుకంటే ఎక్కువ చేతులున్నట్లు తెలిపారు. కానీ పైన కనపరచిన వుదాహరణలను తరచిచూస్తే యీ చరిత్రకారుని అభిప్రాయం తప్పని, సత్యదూరమని తెలుస్తోంది. అలాగే రెండు చేతులు, నాలుగు చేతుల ప్రతిమలు కూడా అరుదుగా కనిపిస్తాయనడం సర్వసామాన్యమే.

**యముడు :** ఇతడు యమలోకానికి అధిపతి అని, పాపపుణ్యాలను వివక్షచేసి శిక్ష విధించి అమలు జరిపే ధర్మ దేవత అనీ, అతి భయంకరమైన ప్రాణహరమూర్తి అనీ పురాణాల్లో వర్ణించటం గమనించవచ్చు. యముడు దక్షిణాధీశుడు. గ్రీకుపురాణాల్లోని ప్లూటోతో యముడు పోల్చదగినవాడు.

లేపాక్షి కల్యాణ మండపంలోని దక్షిణ దిక్కుగా యముని పెద్ద ప్రతిమవుంది (ఫోటో. 19). ఈ ప్రతిమకూడా పూర్తిగానట్లు తెలుస్తూవుంది. ఇక్కడ దిక్పాలుడు సమపాద స్థానక స్థితిలో రౌద్రాకారుడుగా వున్నాడు. పెద్దకళ్ళు, పెద్దపెద్ద కనుబొమలు, నాలుగు చేతులు, పైచేతులలో గద, పాశం ధరించివున్నాడు. క్రిందిచేతులు అభయ, వరద ముద్రలోవున్నాయి. కిరీటమకుటం, కుండలాలు,కంఠాభరణాలు, హారాలు, ఉదరబంధ, కేయూరాలు, మేఖల, పూర్ణోరుకంలతో అలంకరించబడి వున్నాడు. యజ్ఞోపవీతం కనిపించదు. బాగాఅలంకరించబడిన మహిషం శిల్ప పలకమీద వుంది. దీనికొమ్ములు తిరిగి తలపైకిలేచి ఎడమవైపుకు వున్నట్లుగా మలచబడివుంది.

పురాణాలలో, అగమాలలో శిల్ప శాస్త్రాలలో యముని ప్రతిమా లక్షణాలను గురించి వివరించబడింది. అగ్ని పురాణం, యోగయాత్ర లందు దక్షిణాధీశుడగు యముడు మహిషంపై కూర్చొని, చేతులలో

దండం దరించి వున్నట్లు వ్రాయబడింది. విష్ణు ధర్మోత్తర పురాణంలో వాహనమైన మహిషంపై స్వారీచేస్తున్నట్లుంది. నాలుగు చేతులు, అందులో కత్తి, కర్ర, డాలు వుండి, యింకొక చేతిలో పత్నిని పట్టుకొని వున్నట్లుంది. అందమైన చూపులతో చిత్రగుప్తుడు రెండు చేతులు కలిగి యుండి దిక్పాలునికి కుడిభాగంలో వున్నాడు. ఎడమ భాగంలో మృత్యు, సంహితలు భయంకరమైన ముఖాలతో వుంటారు. మత్స్యపురాణం ప్రకారం దండం, పాశం కలిగి (దండపాశ ధరమ్), మహిషంపై కూర్చొని (మహిషా రూఢమ్) లేదా సింహాసనం మీద కూర్చుని (సింహాసనా గతమ్ చాపి) వున్నట్లున్నాడు. ముందు భాగాన చిత్రగుప్తుడు, యింకా భయంకరావతారులుంటారు. యముడు నల్లటి రంగులోవుండి రౌద్ర నేత్రాలతో వుంటాడు. మానసోల్లాసలో కూడా యిదే విధంగా తెలుప బడినది.

పై పురాణాలలో తెలిపిన లక్షణాలు చేపాక్షి వీరభద్రాలయంలోని యముని ప్రతిమలో పూర్తిగా కనిపించవు. ముఖ్యంగా యీ ప్రతిమలో చిత్రగుప్తుడు, మృత్యు, సంహితలు కనబడరు. ఇక్కడ దిక్పాలుని క్రింది చేతులు పురాణాలలో వలెకాకుండా అభయ, వరద ముద్రలో చూపబడినాయి. మత్స్య పురాణంలో తెలిపిన విధంగా భయంకరమైన చూపులు కలిగిన కన్నులను (దీపాగ్ని సమలోచన) మాత్రం కలిగి వున్నాడు.

ఈదిక్పాలుని ప్రతిమలు ఉత్తర, దక్షిణ భారతదేశంలోవున్నాయి. బాదామి చాళుక్యులకాలం నాటి ఐహోళేలోని కొంటిగుడిలో యముని ప్రతిమ వుంది. రెండు చేతులున్నట్లు, మహిషంపై చూపబడింది. ఒక చేతిలో పద్మముంది, మరొక చేయిపైకి లేచివుంది. ఎల్లొరా వుదాహరణలో మహిషంపై స్వారీచేస్తున్నట్లు చూపారు. చిదంబరంలోని శివాలయంలో రెండు చేతులు కలిగి వాహనం ముందు నిలుచొనివున్నాడు. పానగల్‌లోని పచ్చల సోమేశ్వరాలయంలో మూడు అందమైన యముని

ప్రతిమలున్నాయి. వీనిలో రెండు వుదాహరణల్లో ప్రక్కన పత్నివుండి మహిషం మీద స్వారీచేస్తున్నాడు. మూడవ వుదాహరణలో యిద్దరూ పద్మాసనంలో కూర్చొని వున్నారు. రెండు చేతులుండి, వొకచేతినిపైకి లేపి ముకుళ ముద్రలోవుంచి రెండవచేతిలో ఎర్నిని పట్టుకొని వున్నాడు. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం ప్రతిమచేతులలో దండం కానీ, పాశంకానీ లేకుండుట. ఉత్తర భారతదేశంలో కవేశ్వరి-నినాల్ (ఉత్తర గుజరాత్, సబరకాంధ జిల్లా)లో యముడు కూర్చొని వున్నాడు. మహిషం ప్రక్కన వుంది. రెండు చేతులలో దండ, కర్ర వున్నాయి. ఇంకొక రెండు చేతుల వుదాహరణ భూమారలోని శివాలయంలోవుంది. ఇక్కడ దిక్పాలుని కుడిచేతిలో గుండ్రని వస్తువుండి, ఎడమ చేతిలో కర్రవుంది. మహిషం మీదకాకుండా సింహాసనం మీద వున్నట్లు చూప బడింది. ఒరిస్సాలో యముని ప్రతిమలు చాలా వున్నాయి. బ్రహ్మే శ్వరాలయ విమానంలోని ప్రతిమలో మహిషంమీద కూర్చొని వుండి దండ, పాశం ధరించి వున్నట్లున్నాడు. అనంతవాసుదేవాలయ ప్రతిమలో పెద్ద ఉదరం, పెద్ద చెవులు చూపబడినాయి. పరశురామేశ్వరాలయంలో కూడా వొక ప్రతిమవుంది. పాలరాజుల కాలం నాటివి చాలా ప్రతిమ లున్నాయి. రెండు చేతుల వుదాహరణ విష్ణు పాదాలయంలోవుంది. ఒక చేతిలో దుడ్డు కర్రలాంటిది వుండి, మరొక చేయి మోకాలుమీద వుంది. నాలుగు చేతులు, రెండుచేతుల వుదాహరణలు ఖజురహోలోని చండేలా అలయంలో కనిపిస్తాయి. చేతుల్లో దండం, కుక్కుట, పుస్తకం, పుర్రె, గంట, సర్పం మొదలైనవి వున్నాయి. హాట్ నగర్ హటకేశ్వరాలయం లోని ప్రతిమ త్రిభంగా కృతిలోవుంది. నాలుగు చేతుల్లో దండం, కలం (లేఖిని), పుస్తకం, పక్షిని కలిగివుండి, చామర ధారులిరుపైపులా చూప బడినారు. ఇదిదేవతమూర్తి ప్రకరణం రూపమండానలో తెలిపినవిధంగా వుండటం విశేషం (లేఖినమ్ పుస్తకమ్ హస్తే కుక్కుటమ్ దండమే వచ్చ మహిషారూఢయమమ్). ఇలాంటిది మరెక్కడా కానరాదు.

వివిధ కాలాలలోని యముని ప్రతిమా లక్షణాలను పోల్చిచూస్తే నిలుచొనివున్న స్థితికాని, అభయ వరదముద్రలు కాని మరేకాలంలోనూ కనబడవు. అంతేకాక మిలిగిన విజయనగర ప్రతిమలతోకూడా పోల్చేందుకు వీలుకాకుండా వేరుగావుంది. శ్రీశైలం, శ్రీకాళహస్తి, ప్రభుగిరి పట్నంలో దిక్పాలుడు వాహనంపై స్వారీచేస్తున్నట్లున్నాడు. లేపాక్షిలో మాత్రం సమపాద స్థానక స్థితిలో నిలబడి వున్నాడు.

**వరుణుడు :** వేదకాలంలో వరుణుని ఇంద్రునితో సమానంగా కొలిచారు. వేదాలలో వర్షానిచ్చే దేవునిగా అభివర్ణించారు. వరుణుని ప్రీత్యర్థం. యజ్ఞయాగాలు కూడా నిర్వహించేవారు. నవీన కాలంలో కూడా వానలు కురిసేందుకుగాను వరుణపూజలు, యాగాలు చేయటం ఆ ఆచార అవశేషం మాత్రమే. వరుణుడు పశ్చిమాధీశుడు. 'జాలేశ్వర', 'అంభూపతి' అని కూడా పిలిచేవారు.

లేపాక్షి కల్యాణ మండపంలో వొక స్తంభం మీద వరుణుని ప్రతిమవుంది (ఫోటో. 20). సమపాద స్థానక స్థితిలో నిలుచొని వున్నాడు. నాలుగు చేతులు కలిగివున్నాడు. పైనున్న రెండు చేతులలో పాశాలున్నాయి. క్రిందచేతులు అభయ, వరద ముద్రలోవున్నాయి. నొసటన మూడవకన్ను, కిరీటమకుటం, కంఠాభరణాలు, హారాలు, ఉదర బంధం, యజ్ఞోపవీతం, కటిసూత్రం, పూర్ణోరుకం, కడియాలు మొదలైన వాటిలో అందంగా అలంకరించబడి వున్నాడు. శిల్ప ఫలకం మీద తల తోక భాగాలు పైకిలేచినట్లున్న మకరం (వాహనం) వుంది.

బృహత్ సంహితలో హంసమీద స్వారీచేస్తున్నట్లు, చేతిలో పాశం వున్నట్లు వరుణుడు వర్ణించబడినాడు. అగ్ని పురాణంలో మకరం వాహనంగా తెలుపబడింది (మకరే వరుణ పాశ). మానసోల్లాసలో దిక్పాలుడు తెల్లటి రంగులో వుండి పాశం, పద్మం (పాశే పంకజ హస్తమ్) కలిగి మకర వాహనంగా కలిగివున్నట్లు తెలుపబడింది (మకరస్తోపరి

స్థితమ్). ఇంకా తెల్లటి దుస్తులు, వజ్రకిరీటం (శుక్లాంబర పరీధానమ్ దివ్యరత్న కిరీటమ్) ధరించినట్లూ వుంది. మత్స్య పురాణంలో కూడా మానసోల్లాసలో తెలిపినట్టే వర్ణించబడింది. అంశుమద్భేదాగమలో పసుపు దుస్తులు ధరించి కరండమకుటం. యజ్ఞోపవీతం కలిగి చేప రేక మకరం మీద కూర్చొని లేదా నిలుచొని వున్నట్లు చెప్పబడింది. రెండు చేతుయా పాశం కలిగి వున్నట్లుగా యిందులో తెల్పబడింది. ఒక చేతిలో పాశం, మరొక చేయి వరదముద్రలో వున్నట్లు సుప్రభేదాగమలో చెప్ప బడింది. విష్ణుధర్మోత్తర పురాణంలో దిక్పాలుడు ఏడు హంసలు లాగు తున్న రథంలో వుండిపైన తెల్లనిగొడుగు కలిగివున్నాడు. ప్రతిమకు ఎడమవైపున చేప గుర్తుంటుంది. వరుణుని నాలుగు చేతులలో పద్మం, పాశం, శంఖం, రత్న పాత్ర వుంటాయి. దిక్పాలుని పత్ని ఎడమతొడ మీద కూర్చొని వుంటుంది. ఆమె వొక చేతిలో నీలోత్పలం ధరించి మరొక చేతిలో వరుణుని గట్టిగా పట్టుకొని వుంటుంది. వరుణుని కిరు వైపుల గంగ. యమున యింటారు.

శిల్ప పరమైన అంశాలలో లేపాక్షి వరుణమూర్తి పురాణాలలో తెలిపిన విధంగాలేదు. విష్ణు ధర్మోత్తర పురాణం ప్రకారం నాలుగు చేతులు కలిగివున్నాడు. కానీ పద్మం, రత్నపాత్ర, గంగా, యమున, హంసలు లాగుతున్న రథంగానీ యిక్కడకనబడవు. వరుణుని ప్రతిమా లక్షణాలలో వొకటైన పాశం మాత్రం యిక్కడ వుదాహరణలో కనిపి స్తుంది. కానీ యిక్కడ కూడా కొద్ది మార్పు చోటు చేసుకొంది. రెండు చేతులలోనూ విడివిడిగా పాశం కలిగివున్నట్లు చూపబడింది. ఇక్కడి ప్రతిమలోని అభయ, వరద ముద్రలు ఏ శిల్పశాస్త్రంలోనూ తెలుప బడలేదు.

వరుణుని ప్రతిమలు దక్షిణ భారతదేశంలో చాలా తక్కువే అని చెప్పవచ్చు. అలంపూర్‌లోని స్వర్గ బ్రహ్మాలయంలో అందమైన వుదా హరణవుంది. వరుణమూర్తి రెండు చేతులు కలిగి నిలుచుని వున్నభంగి మలో వున్నాడు. రాష్ట్రకూటుల ఎల్లోరాలోని 16 వ గుహాలయంలో

వరుణ ప్రతిమ ద్విభంగా కృతిలో కనిపిస్తుంది. వాహనమైన మకరం చూపబడింది. కుడిచేతిలో పాశం, ఎడమచేయి కట్యవలంబిత ముద్రలో వున్నాయి. ఇంకొక రెండు చేతుల వుదాహరణ పానగల్‌లోని పచ్చల సోమేశ్వరాలయంలో కనిపిస్తుంది. ఇక్కడ సతీసమేతంగా మకరంపై స్వారీచేస్తున్నట్లు చూపబడింది. ఉత్తర దేశంలో వరుణుని ప్రతిమలు చాలా కనిపిస్తాయి. సహారంపూర్‌లోని ప్రతిమకు రెండు చేతులున్నాయి. ఒరిస్సా ఆలయాలలో వరుణుని ప్రతిమలు చాలా కనిపిస్తాయి. పరశు రామేశ్వరాలయం (భువనేశ్వర్)లో దిక్పాలుడు పీటమీద కూర్చొని వున్నాడు. దీని క్రింద హంస మలచబడివుంది. పాశం, మాతులుంగ కలిగివున్నాడు. బ్రహ్మేశ్వరాలయంలో మకరం మీద చూపబడింది. రాజారాణి ఆలయంలో పూర్తిగా వికశించిన పద్మంమీద నిలుచొని వున్న ట్లుగా చూపబడింది. ఇక్కడ వొకచేతిలో పాశం (వురిత్రాడు) వుంది. మరొకచేయి వరదముద్రలో వుంది. ఖజురహోలోని ప్రతిమలలో ద్విభంగ, త్రిభంగా కృతి, మకరం, నాలుగు చేతులలో పాశం, పుస్త కం, పద్మం, కమండలం వుంటాయి. హర్యానాలోని ప్రతిమ త్రిభంగా కృతిలోవుంది. మూడుచేతులలో పద్మ, నాగపాశం, కమండలంవున్నాయి. ఒక చేయి మాత్రం స్త్రీ ప్రతిమ తలపై వున్నట్లుంది. వరుణుని ప్రతి మలు గ్వాలియర్, రాజ్‌షాహి ప్రదర్శన శాలలలో కూడ కనిపిస్తాయి. బొంబాయి ప్రదర్శన శాలలో గూర్జర-ప్రతీహార కాలానికి సంబంధించిన వరుణ ప్రతిమలు సతీసమేతంగా మకరంపై చూపబడ్డాయి.

పైన తెలిపిన భారతదేశంలోని వివిధ వరుణ ప్రతిమలను పరిశీ లించిచేరెండు లేక నాలుగు చేతులున్నట్లు తెలుస్తుంది. చేతులలో పాశం, కమండలం, రత్నపాత్ర, పుస్తకం మొదలైనవి కలిగివుంటాయి. ఒక్కొక్కసారి పద్మం మీద నిలుచొని వున్నట్లు, కొన్నిచోట్ల పెద్ద కుండలాంటి వుదరంతో కూడా వున్నట్లు, మరికొన్నిచోట్ల సతీసమే తుడుగా వాహనం మీద చూపబడినాడు. కొన్నిచోట్లతప్ప మిగిలినఅన్ని వుదాహరణలలోనూ మకరమే కనిపిస్తుంది. ముఖ్యంగా దక్షిణ భారత

దేశంలో హంసవాహనంగా చూపబడలేదు. అన్ని ప్రతిమలలో మకరమే కనిపిస్తుంది. కానీ వొక్క అలంపూర్‌లో మాత్రం మకరం కన్పించదు. ఉత్తర దేశంలోలాగే దక్షిణదేశంలో కూడా నాలుగు చేతులు చూపబడి నాయి. కానీ దక్షిణ దేశంలోని వుదాహరణ లన్నింటిలో పాశం చూప బడింది. లేపాక్షిలో మాత్రం రెండు చేతులలోనూ విడివిడిగా పాశం వుంది. అలాగే క్రింది చేతులు అభయ, వరదముద్రలలో కనిపిస్తాయి. ఇలాంటి లక్షణాలున్న ప్రతిమ ఉత్తర, దక్షిణ భారతదేశంలో మరెక్క డాలేదు. దక్షిణ భారతదేశ ప్రతిమలలో యింకొక గమనించదగ్గ విష యం ఏమిటంటే లలితాసనంలోగానీ, పర్యంకాసనంలోగానీ దేవి పద్మం మీద నిలుచొని వున్నట్లుగానీ ఎక్కడా కనిపించక పోవటం. ఈలక్షణాలు ఉత్తర దేశంలో కనిపిస్తాయి. కానీ బి. సహాయ్ "దక్షిణదేశ ప్రతిమలు ఎక్కువగా ఉత్తర భారతదేశ లక్షణాలను పోలివున్నాయి" అన్నారు (B. Sahai, Iconography of the Minor Hindu and Buddhist Dieties. p. 52). ఉత్తర, దక్షిణదేశంలలోని ప్రతిమా లక్షణాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే బి. సహాయ్ అభిప్రాయం తప్పని విదితమవుతుంది.

**వాయు :** వాయు వేదకాలం నుండి పూజింపబడు తున్నాడు. ఇతడు గాలి దేవుడుగాను, వాయవ్యాధీశుడుగాను పిలువబడు తున్నాడు. ఋగ్వే దంలో ఇతను ఇంద్రునితో కలిసివున్నట్లు చెప్పబడింది. రామాయణ, మహాభారతాల్లో యితనిని ఆంజనేయునికి, భీమునికి తండ్రిగా వర్ణించారు. జోరాష్ట్రియన్ పురాణంలోని 'వాత'తో యితను పోల్చదగినవాడు.

లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణ మండపంలో యీ దిక్పా లుని ప్రతిమ చాలా అందంగా చెక్కబడివుంది (ఫోటో. 21). సమ పాద స్థానక స్థితిలో వుండి యవ్వనంలోవున్నట్లు చూపబడింది. ఇతను మూడవ కన్ను వుంది. కిరీటమకుటం, ఉదరబంధం, మేఖల, కుండలాలు, పూర్ణోరుకం, మంజీరాలతో చాలా ఆసక్తికరంగా అలంకరించబడివున్నాడు. నాలుగు చేతులున్నాయి. పై చేతులలో పతాకం, చక్రంలాంటివి కలిగి

వుండి, క్రిందిచేతులు అభయ, వరద ముద్రలలో కనిపిస్తాయి. ఇతని వాహనమైన జింక శిల్పఫలకం క్రింద భాగంలో కుడి ముఖంగా పైకిలేచి నట్లున్న తల, చిన్నతోకతో చూపబడివుంది. పైన అందంగా మలచబడిన మకరతోరణం వున్న గూడులో యీ ప్రతిమ వుంది.

ఆగమాలు, పురాణాలు యీ దిక్పాలుని ప్రతిమా లక్షణాలను గురించి చాలా ఆసక్తికరమైన వివరాలను తెల్పుతున్నాయి. అగ్నిపురాణం ప్రకారం వొక చేతిలో వజ్రం వుండి, వాహనం ప్రక్కనుంటుంది (వాయుర్ వజ్రధరో మృగో). మత్స్యపురాణంలో యవ్వనం తోనూ, కాంతియుతమైన కన్నులతోను, వాహనంపై స్వారీ చేస్తున్నట్లు గాను, పై చేతులలో పతాక, ధ్వజంతోను, క్రిందిచేతులు వరదముద్రలోవున్నట్లు యీ దిక్పాలుని వర్ణించబడింది. మానసోల్లాసలో రెండు చేతులు కలిగి వాహనం మీద స్వారి చేస్తున్నట్లు, వొక చేతిలో పతాకం వున్నట్లు, మరొక చేయి వరద ముద్రలో వున్నట్లు చెప్పబడింది(వరదమ్ దక్షిణమ్ హస్తమ్ వామమ్ యుక్తమ్ పతాకమ్). అంశు మద్భేగమ ప్రకారం వొక చేతిలో పతాకం, మరొకచేతిలో అంకుశం వుంటుంది. పూర్వ కారణాగమంలో దిక్పాలుని వొక చేతిలో అంకుశం కలిగి (అంకుశేన కరే) వాహనం మీద స్వారీ చేస్తున్నట్లు చెప్పబడింది (మృగారూఢో) శిల్పరత్నలో కూడా జింక మీద స్వారీ చేస్తున్నట్లు వొక చేతిలో పతాకం మరొక చేయి వరదముద్రలోను, పసుపు దుస్తులతోను, వజ్రవైఢూర్యాలతో పొదగబడిన ఆభరణాలతోను వుండేటట్లు చెప్పబడింది. విష్ణు ధర్మోత్తర పురాణంలో దిక్పాలుని పత్ని ఎడమ వైపున వున్నట్లు వర్ణించబడింది.

పై శాస్త్రాలలో తెలిపిన లక్షణాలతో పోల్చితే లేపాక్షిలోని యీ దిక్పాలుని ప్రతిమ అన్నివిధాలా వేరుగా కన్పిస్తుంది. మత్స్యపురాణం, మానసోల్లాస,పూర్వకారణాగమ, రూపమండాన మొదలైన శాస్త్రాలలో చెప్పినట్లు వాహనం మీద స్వారీ చేస్తున్నట్లు లేపాక్షిలో కనిపించదు. ఇంకా వజ్రం కాని, పమండలం కాని, అంకుశంకాని లేపాక్షి ప్రతిమలో

వాసరాడు. ఇక్కడ కర్ర లాంటిది, పతాకంతో బాటు, అభయ, వరద ముద్రలలో కనిపిస్తుంది. ఈ లక్షణాలు (ముఖ్యంగా అభయ వరద ముద్రలు) ఏశాస్త్రంలోనూ తెలుపబడలేదు.

లేపాక్షిలోని వాయు ప్రతిమకు, మిగిలిన విజయనగర ప్రతిమలకు కూడా తేడా కనిపిస్తుంది, శ్రీకాళహస్తి, శ్రీశైలం, ప్రభుగిరి పట్నంలోని, ప్రతిమలను పరిశీలిస్తే యిది విదితమవుతుంది. ఈ వుదాహరణలన్నింటిలోనూ దిక్పాలుడు స్వారీచేస్తున్నట్లుగానే వున్నాడు. క్రింది చేతులు అభయ, వరదముద్రలలో ఎక్కడా కానరావు. ఇంకా మిగిలిన విజయనగర ప్రతిమలు రెండుచేతులు మాత్రం కలిగి, వొకచేతిలో పతాకం, మరొక చేయి క్రిందికి చాచినట్లు చూపబడినాయి.

దక్షిణ భారతదేశంలో యీ దిక్పాలుని ప్రతిమలు చాలాతక్కువ. బాదామి చాళుక్యుల అలంపూర్‌లోని స్వర్గబ్రహ్మలయంలోని ప్రతిమ రెండు చేతులుంకలిగి యవ్వనంలో వున్నట్లు చూపబడింది. రాష్ట్రకూటుల కాలంనాటి ఎల్లోరా ప్రతిమలో రెండు చేతులుండి, వాహనంమీద స్వారీ చేస్తున్నట్లున్నాయి. ఒకచేతిలో పతాకవుంది. మరొక చేయి వాహనం వెనుక భాగాన వుంది. బి. సహాయ్ అభిప్రాయం ప్రకారం "ఈ రాష్ట్రకూటుల ప్రతిమ అగ్నిపురాణంలో తెలిపిన విధంగా వుంది" (B.Sahai, Iconography of the Minor Hindu and Buddhist Deities.P,58). అగ్ని పురాణం ప్రకారం చేతిలో వజ్రం కలిగి వాహనంమీద స్వారీ చేస్తున్నట్లుగా చెప్పబడివుంది(వాయుర్ వజ్ర ధరో మృగో). పై ఎల్లోరా వుదాహరణలో వజ్రానికి బదులు పతాకం కలిగి వున్నాడు. కొబట్టి యీ చరిత్ర కారుని అభిప్రాయం తప్పుగా భావించ వచ్చు. బిక్కవోలులోని తూర్పుచాళుక్యుల వుదాహరణలో రెండు చేతులున్నట్లు, యవ్వనంలో వున్నట్లు చూపబడింది. మలి చాళుక్యుల పానగల్ ఆలయంలో సతీసమేతంగా వాహనంమీద స్వారీ చేస్తున్నట్లున్నాడు. చోళుల కాలంనాటి చిదంబరంలోని శివాలయంలో దిక్పాలుడు సమభంగా

కృతిలో వున్నాడు. ఒక చేతిలో పతాకం కలిగి వుండి మరొక చేయి కట్యవలంబితముద్రలో వుండి వాహనం ప్రక్కనున్నట్లు చూపబడింది. ఉత్తర భారతదేశంలో కశేశ్వరి నిసాల్‌లోని మహాగూర్జర కాలానికి సంబంధించిన ప్రతిమలో రెండు చేతులున్నాయి. ఒకచేతిలో పతాకముంది. గుజరాత్‌లో వాయుదేవుని లోహపు విగ్రహంవుంది. రాజస్థాన్‌లోని అబి నేరిలో తలకు కట్టిన వస్త్రాన్ని రెండు చేతులతో పట్టుకొని వున్నట్లుంది. ఖజురహోలోని వొక ప్రతిమలో శిల్పఫలకం మీద జింకకు బదులు కుందేలు కనిపిస్తుంది. భువనేశ్వర్ పరశురామేశ్వరాలయంలో కూడా యీ దిక్పాలుని ప్రతిమవుంది. ఇక్కడ ఎలుకను వాహనంగా చూపించారు.

భారతదేశంలోని అన్ని ప్రతిమలలో పతాకం, కర్ర, జింక మొదలైనవి చూపబడినాయి. కొన్ని విషయాలలో ఉత్తర, దక్షిణ దేశంలోని ప్రతిమలలో తేడా కనిపిస్తుంది. అబనేరి ప్రతిమలో తలకు కట్టుకొన్న వస్త్రాన్ని రెండు చేతులు పైకిలేపి రెండుకొనలు పట్టుకొన్నట్లుండే వుదాహరణ దక్షిణ దేశంలోవున్న ప్రతిమలలో కనిపించదు. గుజరాత్‌లోని పట్టాన్‌లో దిక్పాలుని పత్నిని వానర ముఖంలో చూపించారు. ఇంకొక వుదాహరణలో నాలుగు చేతులూ, చేతిలో పసిబిడ్డ (బహుశ కుమారుడు గావచ్చు) చూపబడింది. దక్షిణ భారతదేశంలోని హాసగల్ వుదాహరణలో వాయు పత్నిని చూపించారు కానీ యిక్కడ కోతిముఖంగానీ, పసిబిడ్డగానీ లేదు. రెండు చేతులు మాత్రమే చూపబడినాయి. ఉత్తరదేశంలోని కొన్ని వుదాహరణలలో ఎలుక, గుర్రం వాహనాలుగా చూపారు. కమండలం, పుస్తకం, పద్మ మొదలయినవి కూడా చూపబడినాయి. ఈ లక్షణాలు దక్షిణదేశ ప్రతిమలలోలేవు. బి. సహాయ్ ప్రకారం "ఉత్తర, దక్షిణ భారతదేశంలోని వాయు ప్రతిమలకు తేడాలేదు" (B. Sahai, Iconography of the Minor Hindu and Buddhist Deities, P. 58). కానీ చాలా విషయాలలో తేడాలను మనంపైన చర్చించాం కాబట్టి యీ చరిత్రకారుని అభిప్రాయం తప్పని చెప్పవచ్చు.

**కుబేరుడు :** శివుని స్నేహితుడైన కుబేరుడు ఉత్తర దిక్కుకు అధిపతి. వైశ్రవణ, ధనేశ మరియు ధనేశ్వర అనే పేర్లు కూడా యితనివే. మహాభారతంలో కుబేరుని ధనవంతుడైన దేవునిగా వర్ణించడమైంది. పురాణాలలో యక్షరాజుగాను, మహాదేవుని స్నేహితుడుగాను వివరించబడింది. 'అలక' యితని రాజధాని. ఇతని పత్ని పేరు వృద్ధి.

ఉత్తరాధీశుడైన కుబేరుని ప్రతిమ లేపాక్షి కల్యాణ మండపంలో వుంది (ఫోటో. 22). ఇక్కడ యీదిక్పాలుడు సమపాద స్థానకస్థితిలో నిలుచొనివుండి చాలా అందంగా కనిపిస్తున్నాడు. నాలుగు చేతులున్నాయి. పై చేతులు గద, ఖడ్గం (శక్తి) కలిగివున్నాయి. క్రిందచేతులు అభయ, వరద ముద్రలలో వున్నాయి. పూర్ణోరుకం ధరించి, కిరీటమకుటం, గ్రైవేయకం, ఉదరబంధం, యజ్ఞోపవీతం, మేఖల, కుండలాలతో అలంకరించబడివున్నాడు. ప్రతిమ క్రిందవున్న ఫలకభాగాన అందంగా అలంకరించబడిన గుర్రంవుంది. పైకిలేచి వున్నకాలు, తోక మొదలైనవి ముందుకు పోతున్నట్లు తెలుపుతున్నాయి.

బృహత్ సంహిత ప్రకారం కుండలాంటి పొట్ట, నరవాహనం, కిరీటం కలిగివుంటాడు. (నరవాహనః కుబేర వామ కిరీటి బృహత్ కుక్షహ్) ఒకచేతిలో గదవుండి గాడిదవాహనంగా వున్నట్లు యోగయాత్ర వర్ణిస్తుంది. అగ్నిపురాణంలో గదపట్టుకొని మేషంపై స్వారీచేస్తున్నట్లు (గదీకుబేరో మేషస్థ), మత్స్యపురాణ, మానసోల్లాసలలో పెద్దపొట్ట (మహోదర) వెడల్పాటి భుజములు (మహాబాహు) గద, వరదముద్రలతో (గదాపణిమ్ వరప్రదమ్), మనిషివాహనంమీద స్వారీ(నరయుక్త విమానస్థమ్) మొదలైన లక్షణాలు చెప్పబడినాయి. అంశుమద్భేదాగమ ప్రకారం మేషంమీదస్వారీచేస్తున్నట్లు లేక పీఠంమీదకూర్చున్నట్లు, రెండు లేక నాలుగు చేతులున్నట్లు చెప్పబడింది. రెండు చేతులుంటే అభయ, వరదముద్రలలోను లేదా ఎడమచేతిలో గద వుంటుంది. నాలుగు చేతు

ఉంటే ఒక చేతిలో వినాద (పత్ని) యింకొక చేతిలో మరొక పత్ని (వృద్ధి)ని పట్టుకొని వున్నట్లుంటుంది. పత్నులిరువురూ ఇరుతొడలమీద కూర్చొని వుంటారు. మిగిలిన రెండు చేతులలో గద, శక్తి వుంటుంది. విష్ణు ధర్మోత్తర పురాణంలో నాగరిక వస్త్రాలు, మీసాలు, నరవాహనం నాలుగుచేతులు మొదలయినవి కుబేరుని లక్షణాలుగా వర్ణించబడినాయి. రూపమంధాన ప్రకారం నాలుగుచేతులుండి గద, నిధి, బీజపూరక, కమండలం కలిగి గజవాహనం లేదా నరవాహనం కలిగివుంటాడు. పూర్వ కారణాగమ కూడా నరుడినే వాహనంగా వర్ణించింది.

లేపాక్షిలోని కుబేరునికి పైన కనబరచిన ప్రతిమా లక్షణాలకు అసలు సంబంధమేలేనట్లు కన్పిస్తోంది. ఈదిక్పాలుడు నరవాహనం మీద గాని, గుర్రం మీదగాని, ఏనుగు మీదగాని స్వారీచేస్తున్నట్లుగా లేదు. కుబేరుని పత్నిని అసలు చూపలేదు. శాస్త్రాల ప్రకారం లేపాక్షి ప్రతిమ చేతిలో ఒక్క దండం మాత్రం వుంది. గుర్రాన్ని వాహనంగా చూపటం యిక్కడ అసక్తి కరమైన విషయం. తర్వాతి శాస్త్రాలలో గుర్రాన్ని వాహనంగాచెప్పారు (కుబేరమ్ చిత్రలేఖనామ్ యక్ష గంధర్వ నాయకమ్ అశ్వాసీనమ్ కంతపాణిమ్ ద్విబాహుమ్ స్వర్ణ సన్నిభమ్॥). కుబేరుని ప్రతిమ మిగిలిన విజయనగర ఆలయాలయిన శ్రీకాళహస్తి, శ్రీశైలం, ప్రఘుగిరి పట్నంలో కనిపిస్తుంది. ఈ మూడు వుదాహరణలలో దిక్పాలుడు గుర్రం మీద స్వారీచేస్తున్నాడు. రెండు చేతులుండి ఒకచేయి ముందుకు సాచబడి, యింకొక చేతిలో ఖడ్గంవుంది కాబట్టి లేపాక్షిలోని దిక్పాలుని ప్రతిమకు మిగిలిన విజయనగర దిక్పాలుర ప్రతిమలకుకూడా సంబంధంలేదు. లేపాక్షిలో నిలుచొనివుండి, నాలుగుచేతులు కలిగి క్రింది చేతులు అభయ, వరదముద్రలో వుండటం తెలిపిన విషయమే.

దక్షిణ భారతదేశంలో కుబేరుని ప్రతిమలుచాలా తక్కువ సంఖ్యలోవున్నాయి. బాదామి చాళుక్యుల ఐహోలేలోని కొంటిగుడి, హుచ్చ

ప్పల్యొ గుహలలోని కుబేర ప్రతిమలు రెండు చేతులు, అశ్వవాహనం కలిగివున్నాయి. గుర్రం వాహనం కలిగివున్న ప్రతిమ యిదే మొదటిది కావచ్చు. వీరికాలంలోని అలంపూర్‌లోని స్వర్గబ్రహ్మాలయంలోని మరొక ప్రతిమ రెండు చేతులుండి అర్ధపర్యంకాసనంలో కూర్చొని వున్నట్లుంది. రాష్ట్రకూటుల ఎల్లోరాలో మహిషాసుర మర్దని, కల్యాణసుందర మూర్తి ప్రతిమలలో కుబేరుడు చూపబడినాడు. ఇక్కడ రెండు చేతులు కలిగి నరవాహనం, అశ్వవాహనం చూపబడింది. చేతులు తూర్పు చాళుక్యుల కాలంనాటి బిక్కవోలు, రాజరాజేశ్వరాలయంలో రెండు చేతులు కలిగి నరవాహనంమీద స్వారీచేస్తున్నట్లు చూపబడింది. వీరికాలంనాటి మరొక ప్రతిమలో పెద్దకుండలాంటి పొట్టవుండి మహారాజ లీలాసనంలో కూర్చొనివున్నాడు. మలిచాళుక్యుల, హొయసలుల కాలంనాటి కుబేర ప్రతిమలు చాలావున్నాయి. ఒక వుదాహరణలో దిక్పాలుడు పీఠంమీద కూర్చొని వున్నాడు. రెండు చేతులు వున్నాయి. ఒక చేతిలో శంఖం వుంది. గుర్రంమీద స్వారీచేస్తున్న ప్రతిమలు ఆళ్ళగడ్డలోని కర్లేశ్వరాలయంలో నరస మంగళంలోని శివాలయంలో, నందికావరేలోని అమృత లింగమణి ఆలయంలో, బేలూరు చెన్నకేశవాలయంలోవున్నాయి. ఉత్తర భారతదేశంలోని మధుర గాంధార శిల్పాలలో యీ దిక్పాలుడు వాహనం లేకుండా చూపబడినాడు (దార్‌హూట్ వుదాహరణలోమాత్రం వాహనం కలదు). ఒక్కొక్కసారి కుండలాంటి పొట్ట మీసాలు కనిపిస్తాయి. గుప్తుల కాలంలో నిలుచునివున్న కూర్చొనివున్న వుదాహరణలున్నాయి. రెండు లేక నాలుగు చేతులు చూపారు. ఖజురహోలోని కందరీయ మహా దేవాలయంలో కుబేరుడుపత్నితో చూపబడినాడు. పై వుదాహరణలన్నింటిలో వాహనం కనబడదు. కనౌజ్ వుదాహరణలో మాత్రం వాహనం కనిపిస్తుంది. ముఖలింగంలో రెండు చేతులుండి గుర్రం మీద స్వారీచేస్తున్నట్లు కనిపిస్తాడు.

పైన తెలిపిన లక్షణాలను బట్టి భారతదేశ ప్రతిమలలో నిలుచొని, కూర్చొని స్వారీచేస్తున్న వుదాహరణ లున్నాయి. వేపాడులోని

కుబేరుని ప్రతిమకు గుఱ్ఱం వాహనం కలదు. పశ్చిమచాళుక్యులు, నొలంబ రాజుల కాలంలో యీ దిక్పాల ప్రతిమలు, అశ్వవాహనాల్ని కలిగి వున్నాయి. పల్లవ, చోళకాలంనాటి కుబేర ప్రతిమలుచాలా అందంగా కని పిస్తాయి. కాబట్టి విజయనగర కుబేర ప్రతిమలో చాళుక్య కాలంనాటి ప్రతిమా లక్షణాలు కనిపిస్తాయి. ముఖ్యంగా వాహన విషయంలో గమ నిస్తే యిది విదితమౌతుంది.

**ఈశాన్యుడు :** ఈశాన్యుడు యీ శానాధీశుడు. దిక్పాలురలో యితడు చివరివాడు. విష్ణు ధర్మోత్తర పురాణంలో యితనిని గౌరీశ్వరు డుగా వర్ణించారు.

మానసోల్లాస, శిల్పరత్నల ప్రకారం దిక్పాలుడుతెల్లగావుండి, ఎద్దు మీదస్వారీచేస్తున్నట్లుంటాడు. శిరస్సుపై అర్ధచంద్రుడు (బాలేందుకిరీటి శేఖరమ్) నాగ యజ్ఞోపవీతం, రత్నకుండలాలు, పులితోలు దుస్తులు (వ్యాఘ్రచర్మాంబరావృత్తమ్)తో యీమూర్తి అలంకరించబడివుంటాడు. ఒక చేతిలో త్రిశూలం, మరొక చేయి వరదముద్రలో వుంటుంది. (త్రి శూలపాణిమ్ వరదమ్) చేతిలో త్రిశూలంతో ఎద్దుమీద స్వారీచేస్తున్నట్లు రూపమండనలో చెప్పబడింది, అగ్ని పురాణంలో కూడా స్వారీనిచేస్తు న్నట్లు చెప్పబడింది. అంశుమద్భేదాగమ ప్రకారం యీ దిక్పాలునికి మూడు కళ్ళు, తెల్లటి దుస్తులు, జటామకుటం, యజ్ఞోపవీతం, శూలం, కపాలం (శూలం దక్షిణ హస్తే తు కపాలమ్ వామహస్తకే) మొదలై నవి కలిగివున్నాడు. సుప్రభేదాగమ ప్రకారం నాలుగు చేతులు (చతు ర్భుజమ్) మూడుకళ్ళు (త్రినేత్రమ్) ఎద్దుపై స్వారీ (వృషభారూఢమ్) గద, శూలంతోపాటు అభయ, వరదముద్రలు మొదలయిన లక్షణా లుండాలి. పూర్వకారణాగమ కూడా ఎద్దుపై స్వారీచేస్తున్నట్లు, వొక చేతిలో శూలముండేట్లు తెలుపుతూవుంది.

చాలా అందమైన ఈశానుని ప్రతిమ లేపాక్షి వీరభద్రాలయం లోని కల్యాణ మండపంలోవుంది (ఫోటో. 23). ఈప్రతిమ అందంగా మలచబడ్డ గూడులో వుంది. గూడుకుపైన చిత్రతోరణ కనిపిస్తుంది.

ఇక్కడ దిక్పాలుడు ద్విభంగా కృతిలో నిలుచొనివున్నాడు. నాలుగు చేతులుండి, పైనున్న కుడిఎడమ చేతులలో పరశు, త్రిశూలం ధరించి వున్నాడు, క్రిందిచేతులు అభయ, వరదముద్రలలో చూపబడినాయి. ఈ మూర్తి ఆసక్తికరమైన ఆభరణాలతో అలంకరించబడి వున్నాడు. ఈశానుడు పూర్ణోరుకం ధరించి వున్నాడు. ఈ దిక్పాలుని వాహనమైన నంది (ఎద్దు) పలకానికి క్రిందిభాగాన ముందుకు పోతున్నట్లుగా మలచబడింది.

శ్రీకాళహస్తి, శ్రీశైలం, ప్రభుగిరిపట్నం మొదలైన విజయనగర ఆలయాలలో కూడా యీదిక్పాలుని ప్రతిమలున్నాయి. ఈమూడు వుదాహరణాలలో దిక్పాలుడు వాహనంపై స్వారీచేస్తున్నట్లుంది. ఒక్క శ్రీశైలంలోని ప్రతిమకు నాలుగు చేతులుండి పైచేతులలో త్రిశూలం, ఢమరూ, క్రింది కుడిచేతిలో ఖడ్గముంది. ఎడమచేయి వాహనం తలమీద వుంది.

దక్షిణ దేశంలో యీ దిక్పాలుని ప్రతిమలు చాలా తక్కువ. బాదామి చాళుక్యుల కాలంనాటి ప్రతిమలు ఐహోలేలో వున్నాయి. రెండు చేతులు కలిగి నందిపై స్వారీచేస్తున్నట్లున్నాయి. రాష్ట్రకూటులుకూడా నందిపై స్వారీచేస్తున్నట్లే ప్రతిమను మలచారు. ఈశాన్యుడు సతీసమేతంగా వాహనంమీద పోతున్నట్లు పానగల్ పచ్చలసోమేశ్వరాలయంలో చూడవచ్చు. ఒకచేయి అభయ ముద్రలోవుంది. మరొక చేతిలో తెలియని వస్తువేదోవుంది. దిక్పాలుని పత్ని వొక చేతితో నాథుని గట్టిగా పట్టుకొని మరొక చేతిలో నీలోత్పలం కలిగివుంది. బాగలిలోని కల్లేశ్వరాలయంలో యీ మూర్తి సతీసమేతంగా వాహనంమీద చూపబడింది. ఉత్తర భారతదేశంలో కూడా యీ దిక్పాలుని ప్రతిమలు చాలాతక్కువ. భువనేశ్వర్‌లో బ్రహ్మేశ్వరాలయంలోను, రాజారాణి ఆలయంలోను, పరశు రామేశ్వరాలయంలోను దిక్పాలుని ప్రతిమలు కన్పిస్తాయి. పరశు రామేశ్వరాలయంలో యీ దిక్పాలుని కుడిచెవికి నాగ కుండలాలు చూపబడినాయి. బ్రహ్మేశ్వరాలయంలో వాహనంమీద కూర్చొని వున్నట్లు చూపబడింది.

లేపాక్షిలోని ఈశాన ప్రతిమలో సుప్రభేదాగమంలో తెలిపిన లక్షణాలు చాలావరకు కనిపిస్తాయి.

లేపాక్షిలో నిరృతి (నైరుతి దిక్కున కధిపతి) ప్రతిమ లేకుండటం గమనించదగ్గ విషయం. బహుశ వొకప్పుడువుండి, తర్వాతకాలంలో ఎక్కడికైనా తరలించబడి వుండవచ్చు. మిగిలిన విజయనగర ఆలయాలలో యీప్రతిమ మనకు కన్పిస్తుంది. అహోబిలం, శ్రీశైలం, శ్రీకాళహస్తి, ప్రమగిరిపట్నాలలో దిక్పాలుడు దర్శనమిస్తాడు. అహోబిలంలో నరవాహనం మీద స్వారీచేస్తున్నట్లుండి వెనుక ప్రభామండలం కన్పిస్తుంది. శ్రీశైలంలో కత్తి, డాలు కలిగివున్నాడు. ఇక్కడ నరవాహనమే చూపబడింది. ఇలాంటివే శ్రీకాళహస్తి, ప్రమగిరి పట్నాలలోకలవు.

ఇంతవరకు లేపాక్షి కల్యాణ మండపంలోని దిక్పాలుర ప్రతిమలను గురించి వివరించబడింది. కేవలం లేపాక్షిలోని ప్రతిమలనుండే లక్షణాలనే గాక వివిధ శిల్ప శాస్త్రాలలో యీ దిక్పాల లక్షణాల గురించి, ఉత్తర, దక్షిణ భారతదేశంలోని దిక్పాలుర ప్రతిమల గురించికూడా వివరించడం జరిగింది. వీటన్నిటితో పోల్చినపుడు లేపాక్షి దిక్పాలుర ప్రతిమలలో ముఖ్యంగా గమనించదగ్గ విషయాలు చాలా వున్నాయి.

అవి ఏవనగా (1) అన్ని దిక్పాలుర ప్రతిమలూ నిలువెత్తుగా మలచబడి వున్నాయి. (2) అన్ని ప్రతిమలలో వాహనంమీద స్వారీచేస్తున్నట్లుగాని, కూర్చొని వున్నట్లుగాని, పత్నితో వున్నట్లుగాని కానరావు. (3) అందరి వాహనాలూ ప్రతిమల క్రింద బాగంలో వుండే పలకమీద మలచబడ్డాయి. (4) అన్ని ప్రతిమలూ నాలుగు చేతులు కలిగి వుండి క్రింది చేతులు అభయ వరదముద్రలో వున్నాయి. (5) ఇంద్రుడు, వరుణునిపై చేతులలో పాశం, వజ్రం కలిగివుండం చాలాఆసక్తికరంగా వుండుటయేగాక మరెక్కడా యిలాంటి లక్షణాలు కలిగిన ప్రతిమలు కానరావు. (6) అలాగే ఇంద్రుని సహస్రాక్షునిగా చూపటం విజయనగర శిల్పుల పనితనాన్ని, హిందూ పురాణాల మీద వీరికున్న భక్తిని, కళా ప్రతిభను చెప్పుతుంది. ఇలాంటిప్రతిమకూడాయింకెక్కడాకానరాదు.

అరవ అధ్యాయం

# శిల్పము - కళ

శిల్ప కళకు సంబంధించిన సాంకేతిక విలువల్లోనూ, సౌందర్య శాస్త్రంలోనూ విజయనగర కాలంలో సాధించబడిన ప్రగతి అసమాన మైంది. అపూర్వమైంది కూడా. ఆనాటి శిల్పుల చిత్తశుద్ధి, అర్పణ, ప్రతిభ, సామర్థ్యాలు వీటన్నిటి వెనుకా అప్పటిరాజుల ప్రోత్సాహం, శిల్ప కళాభిరుచి—వీటన్నిటి సమ్మేళనంలో సాధించబడిన శిల్పసృష్టియీ నాటికీ సజీవంగా మనముందు వుంది. ఆమూర్తులలో కనిపించే స్నిగ్ధత, సౌకుమార్యం, లావణ్యం, పరిపూర్ణత మనల్ని యిప్పటికీ సంభ్రమాశ్చ ర్యాల్లో ముంచెత్తుతుంది. కాలి కొనగోరు నుంచి కేశాలవరకు ప్రతిఅణు వులోన సూక్ష్మమైన ప్రతి అంశంలోనూ కనిపించే శిల్పుల శ్రద్ధాసక్తులు మనల్ని ఆలోచింప జేస్తాయి. వీటిని గురించి వివరంగా తెలుసుకోవా లన్న జిజ్ఞాసను కలిగిస్తాయి. ఈ శిల్పాల సృష్టి వెనుక ప్రేరణలను, శిల్పరీతులను, వివిధ ప్రతిమల ప్రత్యేకమైన లక్షణాలను గురించి, వాటి పరిపూర్ణత గురించి యీఅధ్యాయంలో వివరంగా పరిశీలించటం జరిగింది.

## విజయనగర శిల్పరీతులు :

లేపాక్షిలోని విజయనగర శిల్పాలుకాని, యితర విజయనగర ఆలయాలలోని శిల్పాలుకాని రెండువిధాలుగా విభజించవచ్చు. సంపూర్తి శిల్పం మొదటి రకానికి చెందింది. ఈ పద్ధతిలో శిల్పం మనిషి వున్నట్లు గానే వుండి అన్ని అవయవాలు పరిపూర్ణంగా అన్ని ప్రమాణాలతో మలచినట్లుగావుంటుంది. రెండవరకంలో సంపూర్తి ప్రమాణాలలో శిల్పం కనిపించక బల్ల పరుపుగా వుండి లోపలికి మలచబడి వుండదు. మొదటి రకానికి వుదాహరణలు లేపాక్షివీరభద్రాలయంలోని సభా, నాట్య, కల్యాణ మండపాలలోవి స్తంభాల మీదున్న ప్రతిమలు (ఫోటో. 13, 15, 17, 18, 19, 20, 21, 22, 23). మిగిలిన విజయనగర ఆలయాలలో

కూడ యిలాంటి శిల్పాలు కన్పిస్తాయి. హంపీ హజారా రామాలయంలో వాడిపత్రి వెంకటరమణాలయంలో, పుష్పగిరి చెన్నకేశవాలయంలో, భీమ ఉమేశ్వరాలయంలో కూడా చూడవచ్చు. దక్షిణ భారతదేశంలోని పల్లవ, చోళ, శిల్పాలలో యీ లక్షణాలు చూడవచ్చు. ముఖ్యంగా చోళ, కాంస్య విగ్రహాలలో యీ పద్ధతి చాలా వుచ్ఛ స్థాయిలో కన్పిస్తుంది. రెండవ రకానికి వుదాహరణలు లేపాక్షిలోని సభా, కల్యాణ మండపాలలోని వాయిద్యకారులు, జంతువులు, గంధర్వులు, శృంగారించుకొంటున్న స్త్రీ మొదలయిన ప్రతిమలు యీ పద్ధతికి చెప్పుకోదగ్గ వుదాహరణలు హంపీలోనూ, శ్రీశైల మల్లికార్జునాలయంలోనూ వున్నాయి. ఈ పద్ధతికి ముఖ్యంగా కృష్ణదేవరాయలు, అచ్యుత దేవరాలకాలంలో వెలసిన ఆలయాలలో ఎక్కువగా ప్రాముఖ్యత నిచ్చారు.

విజయనగర శిల్పులు పురాణకథలను శిల్పాలలో చూపించటంలో చాలా ఆసక్తిచూపారు. భక్తశిరియాళ, కిరాతార్జునీయ కథలను యిందుకు వుదాహరణలుగా చెప్పవచ్చు. ఈ కథలు వీరభద్రస్వామి ఆలయంలోని నాట్య మండపం బయటి గోడలకు వరుసగా మలచబడి వున్నాయి. తూర్పు గోడను, శిరియాళ కథ పురాణాలలో చెప్పిన రీతిలోనే నేత్రానందంగా మలచబడివుంది. మొదటి ప్రతిమలో శివుడు, బ్రహ్మ, విష్ణు, నంది, భృంగి మొదలయిన వారిని చూపించారు. తర్వాత శివభక్తుడైన శిరియాళుని యింటికి శివుడు పోతున్నట్లు చూపబడింది. ఇక్కడ శివుణ్ని ఋషి అవతారంలో చూపబడింది. శిరియాళ దంపతులు నిలుచొనివున్నట్లు చూపబడినది. తరువాత వేదికపైన ఒక వ్యక్తి కూర్చొని వున్నట్లు ఎదురుగా శిరియాళ కుమారుడు సాష్టాంగ నమస్కారం చేస్తున్నట్లుంది. ఇది పిల్లవాడు యింటికి పోయేందుకు గురువుగారి దగ్గర అనుమతి తీసుకొని తండ్రి పంపిన సేవకునితో బయలుదేరినట్లుంది. తరువాత ఆ సేవకుడు పిల్లవాడిని భుజాలమీదుంచుకొని యింటివైపు పోతున్నట్లుగావుంది. తర్వాత పిల్లవాడికి స్నానం చేయిస్తున్నట్లు చూపబడింది. ఇక్కడ పిల్లవాడు పద్మాసనంలో కూర్చొని వున్నాడు. తండ్రి ప్రక్కన నిలుచొని

వుంటే తల్లి కుమారునికి స్నానం చేయిస్తున్నట్లుంది. తర్వాత పిల్లవాడిని తల్లిపట్టుకొనివుండి తండ్రి పిల్లవాని తల నరకుతున్నట్లుంది. తర్వాతి శిల్పంలో శిరియాళుడు పిల్లవాని తలను పాత్రలో వుంచునట్లుంది. దీని తర్వాత ముగ్గురు ఋషులను చూపించారు. అందులో యిద్దరు కూర్చొని వున్నారు. మూడవ వ్యక్తి నిలబడి వున్నాడు. తర్వాత యిద్దరు స్త్రీలు పిల్లవాని తలను రోటిలో వుంచునట్లుంది. ఆటు తర్వాత శిరియాళుని భార్య ఋషులకు ఆహారం వడ్డించినట్లుంది. తర్వాత శివుని సలహామేరకు శిరియాళుడు కుమారుని కోసం అరుస్తాడు. అప్పుడు పిల్లవాడు బయటి నుండి లోపలికి పరుగెత్తుకు వస్తున్నట్లు చూపబడింది. ఆశ్చర్యపడిన శిరియాళుడు మరలా కుమారుని తల నరుకుతాడు. చివరి శిల్పంలో శివ పార్వతులు వాహనమైన నంది మీద వున్నట్లుగా చూపబడింది. వీరినాసు కొని శిరియాళ దంపతులు, వారి కుమారుడు నిలుచొని భక్తితో నమస్క-రిస్తున్నట్లు చూపబడింది.

ఇక రెండవ కథ అయిన కిరాతార్జునీయాన్ని ఈనా మండపం పశ్చిమ వెలుపలి గోడకు వరుసగా మలచివున్నారు. వ్యాసుడు పంచ పాండవులను ద్వైతవనంలో కలవడంతో యీ కథ మొదలౌతుంది. తర్వాతఅర్జునుడు ధర్మరాజు దగ్గరఅనుమతి తీసుకొని గుహ్యక, యక్షుల సహాయంతో ఇంద్రకీల పర్వతం చేరినట్లుగా వుంది. తర్వాత అర్జునుడు లింగపూజ చేస్తున్నట్లుగా వుంది. ఆ తరువాత అర్జునుడు తీక్షణంగా తపస్సు చేస్తున్నట్లుగా వుంది. ఇక్కడ ఆ మూర్తి కుడికాలు మీద నిలు చుండి ఎడమకాలు కొంచెం పైకిలేపి వున్నట్లుంది. మోకాలు దగ్గరవంగి నట్లుంది. ఇద్దరు అందగత్తెలు అర్జునుని ఎదుట నాట్యం చేస్తున్నట్లుంది. తర్వాతకూడా అర్జునుని తపస్సు చూపబడింది. తర్వాతఇంద్రుడు ముసలి వానిగా అర్జునుని ప్రక్కన వున్నాడు. ఆతర్వాత నిజరూపంలో వున్న ఇంద్రుని ఎదురుగా అర్జునుడు అంజలితో చూపబడ్డాడు. దీని తర్వాత కిరాత (శివుడు) అర్జునుల మధ్య పోరాటం, వీరి మధ్యలో మూకాసు దుడు పందిరూపంలో చూపించబడ్డాడు. తర్వాత కిరాతార్జునుల మల్ల యుద్ధం కూడా చూపబడింది. పార్వతి వీరిరువురిని చాలా నిశితంగా గమ

నిస్తున్నట్లుగా చూపారు. చివరగా శివపార్వతులు నందిపై కూర్చొనివుండి అర్జునునికి పాశుపతాస్త్రం యిస్తున్నట్లుగా మలచబడివుంది.

పై రెండు వృత్తాంతాలను శిల్పంతో మలచేటప్పుడు విజయనగర శిల్పుల వృత్తాంతాలను పలుభాగాలుగా విభజించారు. ఈ రకంగా కథను విభజించుట వలన చూసేవారు నిదానించవలసి వస్తుంది, ఒకదానికి, యింకొక దానికివున్న సంబంధాలను అర్థంచేసుకొంటూముందుకు పోవాల్సి వుంటుంది. అంతేకాక పై రెండు వృత్తాంతాలను శిల్పాలలో వివరించే టప్పుడు వొక వ్యక్తి ప్రతిమచివరి వరకు వొకేలాగా వుండేందుకుచాలా జాగ్రత్త వహించారు.

తర్వాత వీరికాలపు శిల్పరీతులలో చెప్పుకో దగ్గది నిలువుకు అడ్డానికి శిల్పాలను చెక్కటం. దీనికి వుదాహరణలు శ్రీశైల మల్లికార్జునాలయంలోని ప్రాకార గోడమీద, హంపీలోనూ చూడవచ్చు. హంపీలో అడ్డానికి జంతువులు, నర్తకీమణులు, వేట, హంసలు మొదలయినవి మలచబడ్డాయి. కొన్ని వుదాహరణలలో వొకేచోట నిలువుకు, అడ్డానికి కూడా మలచబడినట్లుంది. దీనికి మంచి వుదాహరణ శ్రీశైల మల్లికార్జునాలయంలో కనిపిస్తుంది. ఇక్కడ జంతువులవేట చూపబడింది. పందులు జింకలు, చిలకలు మొదలగునవి అడ్డానికి మలచబడివున్నాయి. నిలువుకు కుడిగాగాన స్త్రీ, పురుషులు రెండు వరుసలలో వున్నారు. వీరు చేతులలో బాణాలు, కత్తులు కలిగి జంతువుల నెదుర్కొంటున్నారు. ఈ విధంగా నిలువుకు, అడ్డానికి రెండింటికి యీ కాలంలో ప్రాధాన్యత యివ్వబడింది.

అందంగా అలంకరించబడివుండే గూడులలో (కోష్టం) ప్రతిమలనుంచడం కూడా విజయనగర శిల్ప రీతులలో వొకటి. లేపాక్షి వీరభద్రాలయం లోని కల్యాణ, నాట్యమండపాలలో యిలాంటి గూడులలో ప్రతిమ లుండుట గమనించవచ్చు (ఫోటో. 12, 16, 18). ప్రతి గూడు కిరువైపులా స్తంభికలుండి, పైభాగాన అందంగా మలచబడి వుండే

మకర తోరణంవుంది. దీనిపై భాగంలో కీర్తిముఖముంది. ఈ గూడుల లోపలి భాగంలో ప్రతిమల నుంచేవారు. ఈ విధంగా అలంకరించబడి వున్న గూడులలో ప్రతిమల నుంచేందువలన చూపరులను ప్రతిమ బాగా ఆకట్టు కొంటుంది. ఇంకొక విధానంలో ప్రతిమను స్తంభ వేదిక మీదుంచుతారు. ప్రతిమ కిరువైపులా స్తంభికలుంటాయి. పై భాగం అంటే ప్రతిమ తలపైన చొచ్చుకొని వచ్చినట్లుగా వుండేట్లు రాతితో అమర్చే పద్ధతి. ఈ రీతిలోకూడా ప్రతిమ ప్రాముఖ్యతను తెలుపుతుంది ఈ పద్ధతికి వుదాహరణలు లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణ, నాట్య మండపాలలో కనిపిస్తాయి (ఫోటో. 13, 14, 15, 17, 20).

విజయనగర నగర శిల్పులు దేవ కోష్ఠాలు, మండపాలు, చిన్న చిన్న ఆలయాలు మొదలైన అలంకరణలతో ఆలయ కుడ్యభాగాన్ని చాలా అందంగా తీర్చిదిద్దారు. ఈ లక్షణాల పూర్తి స్థాయి అభివృద్ధిని శ్రీశైల మల్లికార్జునాలయంలో చూడవచ్చు. ఇక్కడ చాలా ఆసక్తికర మైన విషయాలు కనిపిస్తాయి. గోడమీద చిన్నగుడి లాగావుండి, గర్భ గుడిలోలింగం వేదికమీద చూపబడింది. గమనించవలసిన విషయమేమి టంటే లింగంనుండి మనిషి చేయిబయటకు వచ్చివుండుట. ఇది అభయ ముద్రలో వున్నట్లుగా వుంది.

చాళుక్యుల, హోయసల శిల్పులు ప్రతిమలకు ఎక్కువ అలంకరణ చేయటంలో ఆసక్తి చూపారు. కానీ అలంకరణకు తగ్గట్లు ప్రతిమను మలిచేవారు కాదు. ఈ రెండింటి మధ్య సమన్వయం కాన రాదు. విజయనగర శిల్పులు కూడా అలంకరణకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చారు. కానీ వీరు అలంకరణకుతగ్గట్టు ప్రతిమను రూపొందించడంలో విజయం సాధించారు. లేపాక్షి వీరభద్రాలయంలోని సదాశివుని పరిశీలిం చితే యిదివిదితమవుతుంది (ఫోటో. 12). సదాశివ ప్రతిమలోని నడుం కున్న నడుంపట్టీ చాలా శ్రద్ధతో, నిశితంగామలచి అలంకరణలో వీరికున్న ప్రావీణ్యాన్ని నిరూపించుకొన్నారు. ఉదరంమీద చాలా సున్నితమైన

పుడతలు, అందంగా తీర్చిదిద్దిన నడుం, వివిధ సరాలతో వున్న మేఖల మొదలయిన వాటిని ఎంతో నేర్పులో మలచినట్లు కనిపిస్తుంది. కొబట్టి విజయనగర శిల్పులు ప్రతిమకుతగ్గట్లే అలంకరణ చేయటంలో విజయం పొందారనే చెప్పవచ్చు.

ఒకే జంతువు లేక మనిషికి ఎక్కువకాళ్ళు లేదా తలలు చూపించి చూపరులకు చాలా ప్రతిమలు వివిధ భంగిమలలో వున్నట్లు భ్రమ కలిగించటం లాంటి శిల్పరీతులను కూడా విజయనగర శిల్పులాచరించారు. ఈ పద్ధతిని సాధారణంగా స్థలం తక్కువగా వున్నప్పుడు శిల్పులు ఆచరిస్తారు. ఇలాంటి పద్ధతిని కూడా విజయనగర శిల్పులు అనుసరించారు. ఈ పద్ధతిలో శిల్పి తన ప్రతిభను శిల్పం మలచేటటలో తనకున్న నైపుణ్యాన్ని, నేమాను తెలియడేసే అవకాశంవుంది. వీటికి వుదాహరణలు లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణ మండపంలో వున్నాయి. ఇక్కడ వొకే శరీరానికి మూడు తలలున్నాయి. జంతువు కుడివైపుకు నిలుచొని వుండి తలకొంచెం పైకెత్తుకొని వున్నట్లు మొదటి రకంలో కనిపిస్తుంది. రెండవ రకంలో అదే శరీరానికున్న మరొక తలను గమనించిలే మేత మేస్తున్నట్లు కనిపిస్తుంది. మూడవ తలను పోల్చిచూస్తే తల వెనుకకు త్రిప్పి ఏదో గమనిస్తున్నట్లనిపిస్తుంది. మూడు రకాలలోనూ వాస్తవానికి దగ్గరున్నట్లుగా వుండటం గమనించదగింది. ఇదే కల్యాణ మండపంలో ఆరుకాళ్ళ బదులు నాలుగు కాళ్ళతో ముగ్గురు వ్యక్తులను చూపబడింది. ఇక్కడ మధ్యలో వున్న వ్యక్తి యిరు ప్రక్కలున్న వ్యక్తుల చెరోకాలు పంచుకొన్నట్లుగా కనిపిస్తుంది. ఈ విధానం విజయనగర శిల్పుల స్వంత వూహకాదు. ఈ పద్ధతికి సంబంధించిన అవశేషాలు హరప్పన్ నాగరికతలోనే చూడవచ్చు. తర్వాత అజంతాలో గమనించవచ్చు. ఇక్కడ వొకేతలకు నాలుగుశరీరాలుఅమర్చబడివున్నాయి.తర్వాత 'దామి, పట్టదకల్‌లలో బాదామి చాళుక్యుల కాలంనాటి యిలాంటి ప్రతి వచ్చు. ఇక్కడ మనిషి ప్రతిమలు యీ విధంగా చూప ్రత్యకారులు నాలుగు కాళ్ళతో చూపబడ్డారు. ఇలాంటి

ప్రతిమలు కాకతీయ ఆలయాలలోకూడా చూడవచ్చు. ఇంకొక ఆసక్తి కరమైన విషయమేమిటంటే భారతదేశంలోనే కాకుండా మధ్య ఆసియా, ఇటలీ, నార్వే మొదలయిన విదేశాలలో కూడా యిలాంటి ప్రతిమలు కానరావడం.

## వివిధరకాల శిల్పాలు :

ఏ ఆలయమైనా వివిధ రకాల శిల్పాల వల్లనే చాలా అందంగా కన్పించేది. ఈ శిల్పాలు అందాన్నివ్వడమే గాక నాటి శిల్పుల పనితనానికి నిదర్శనాలుగా, నాటి ప్రజల నాగరికత, సంస్కృతులకు ప్రతిబింబంగా వుంటాయి. భారతదేశంలో బౌద్ధ, జైన, హిందూ ఆలయాలలో వివిధరకాల మానవ శిల్పాలు, జంతు, పుష్ప సంబంధిత, కల్పితశిల్పాలు మొదలైన వాటితో దిగ్భ్రమ కలిగించేలాగ కనిపిస్తాయి. విజయనగర శిల్పుల ప్రతిభానైపుణ్యాలకు నిదర్శనాలుగా మిగిలిన ముఖ్యమైన శిల్పాలను గురించి యీ క్రింద వివరించబడింది.

**స్త్రీలు :** మధ్య యుగ సంస్కృతిలో స్త్రీభోగ వస్తువుగానే వుండేది. స్త్రీ అందం పూజించ దగింది, ఆరాధించ దగింది, రక్షించ దగింది అనే భావన వుండేది. స్త్రీ ఆకారాన్ని వర్ణించటంలో, శిల్పించటంలో, చిత్రించటంలో యీభావం కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. భారతీయ శిల్పకారులు స్త్రీ మూర్తిని చెక్కటంలో ప్రత్యేక ఆసక్తి కనబరచేవారనడానికి చాలా దృష్టాంతాలున్నాయి. దేవతా మూర్తులు, మానవ మూర్తులు ఎలాంటి వారినైనా స్త్రీ లావణ్యాన్ని, ఆకృతిని, సౌకుమార్యాన్ని, ఆకర్షణను వ్యక్తంచేసేలా తీర్చిదిద్దేవారు. అప్పటి స్త్రీ ధరించే దుస్తులు, అలంకరణ మొదలుకొని అత్యున్నతమైన కళాభ్యాసాల్లో కూడా నిమగ్నమైన స్త్రీ మూర్తిని వివిధభంగిమలలో వాళ్ళు రకరకాలుగా రూపించి తృప్తిచెందారు. ఇప్పుడు విజయనగర శిల్పాల్లో మనకు కనిపించే స్త్రీ మూర్తులు, వారి ఆకృతి వివరాలు పరిశీలించటం జరుగుతుంది.

బౌద్ధ, జైన, హిందూ శిల్పులు స్త్రీలను అందంగా తీర్చిదిద్దటం లోనే కాక ఎంతో లోతుగా ఆలోచించి స్త్రీ భావాలకు కూడా ప్రాముఖ్యత నిచ్చి రాయిలో రంభలను సృష్టించారు. ఈ విషయంలో చాళుక్య, హోయసల, కాకతీయ, పల్లవ, చోళులతో పోల్చితే విజయనగర శిల్పులు పోటీపడలేక పోయారనే చెప్పవచ్చు. అయినప్పటికీ వీరుకూడా స్త్రీచిత్రా లకు ప్రాముఖ్యత నిచ్చారు. ఆలయాలలో వివిధ భంగిమలలో చాలా చోట్ల స్త్రీ ప్రతిమలు ఏర్పరచారు. ఆలయ గోపుర ద్వారాలలోని క్రింది భాగంలో అడ్డ (క్రాస్‌గా) కాళ్ళతో అందంగా నిలుచొని వుండే స్త్రీ ప్రతి మలు కనిపిస్తాయి. ఈ ప్రతిమల పైన పుష్పలత వుంటుంది. లేపాక్షిలో కూడా యిలాంటి ప్రతిమలు దర్శనమిస్తాయి. విజయనగర ఆలయాలైన తాడిపత్రి, మార్కాపురం, తిరుపతి, హంపీ, తిరువణ్ణామలైలలో కూడా యిలాంటి ప్రతిమలు కనిపిస్తాయి. మామూలుగా వొకచేతితో పైనున్న తీగెను పట్టుకొని వుంటుంది. మరొక చేయి కట్యవలంబిత ముద్రలో వుంటుంది. దీనిని 'స్త్రీ—తీగ', 'స్త్రీ—చెట్టు', 'దోహద' అని వివిధ రకా లుగా పిలిచేవారు. ఇది అనాదిగా భారతీయ శిల్పంలో వాడుకలోవుంది. పురాణాల ప్రకారం స్త్రీలకు చాలా శక్తులున్నట్లు, చెట్లను వెనువెంటనే పుష్పించునట్లు చేయగల శక్తి స్త్రీలకున్నట్లు వర్ణించబడింది. స్త్రీ చెట్టు కొమ్మను తాకిన వెంటనే లేక కాలితో తాకిన వెంటనే పుష్పిస్తుందట (C. Sivaramamurti, Sanskrit Literature and Art Mirrors of Ind an Culture, pp. 35 ff). ఈ ప్రతిమలు తొలుత బౌద్ధ శిల్పుల ద్వారా ప్రాధాన్యతను పొందాయి. సాంచిలోని తోరణం మీదున్న సాలభంజిక మొట్టమొదటిదిగా మనం చెప్పుకోవచ్చు. తర్వాతి కాలంలో హిందూ శిల్పులు కూడా దీనిని ఆదరించారు. బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, హోయసలలు, కాకతీయులు మొదలయిన వారు కూడా 'స్త్రీ—చెట్టు' ప్రతిమను తమ ఆలయాలలో చూపారు. దీనిని బౌద్ధ శిల్పాలలో వున్నంత ప్రాముఖ్యత మరే హిందూ శిల్పాల లోనూ కానరాదు. ఈ ప్రతిమలు అలంకారంగానే మిగిలి, చివరకు గోపుర ద్వారంలోని ద్వారపాలికల స్థానానికి చేరుకొన్నాయి.

తర్వాత చెప్పుకోదగ్గది స్త్రీ అలంకరణ. ఈ శిల్పం ప్రాచీన కాలంనుండి మనకు కనిపిస్తుంది. విజయనగర శిల్పాలు కూడా స్త్రీ అలంకరణకు ప్రాధాన్యమిచ్చారు. లేపాక్షి కల్యాణ మండపంలోని స్తంభం మీద ఒక స్త్రీ ఓపికగా కూర్చొని వుండి, ఎడమ చేతిలో గుండ్రని అద్దం కలిగి, మరొక చేతితో నొసటన తిలకం దిద్దుకొన్నట్లుగా వుంది, అక్కడ గమనించదగ్గది పెద్దకళ్ళు, స్తనాలమీద నుండి జారిన చీర మొదలైనవి. ఇవి ఆ స్త్రీ ప్రపంచాన్నే మరచిపోయి నొసటన తిలకం దిద్దుకొనడంలో పూర్తిగా నిమగ్నమైనట్లు తెల్పుతున్నాయి. ముఖాలంకరణలో ముఖ్యమైనస్థానం తిలకానికుంది. తిలకం తీర్చిదిద్దడంలో అలంకరణ ముఖ్యాయింపు కనిపిస్తుంది. తిలకంతో ముఖ సౌందర్యానికి పరిపూర్ణత వచ్చిందన్నమాట. ఈ ముఖ సౌందర్య సాధనాన్ని ప్రధానంగా గుర్తించి యిక్కడ శిల్పంగా మలచినట్లు కనిపిస్తుంది. మధ్య యుగం నాటి శిల్పులు యీ ప్రతిమలను ఎక్కువగా ఆదరించారు. ఇవి భువనేశ్వర్, ఖజురహోలలో ఎక్కువగా కన్పిస్తాయి. అజంతా వర్ణచిత్రాలలో యిలాంటి చిత్రాలు చాలా కనిపిస్తాయి.

విజయనగర శిల్పులు స్తంభ పుత్తలికలను, ద్వారపాలికలను ముగ్ధ మనోహరంగాను, అందంగాను తీర్చిదిద్దడంలో ఎంతో నైపుణ్యతను చూపారు. లేపాక్షి, తాడిపత్రి, సోంపాలెం అలయాలలో యీ శిల్పాలను చూడవచ్చు. మామూలుగా యీ ప్రతిమలు సమపాద స్థానక స్థితిలోవుండి, వీణ లేదా పూర్ణకలశం చేతుల్లో కలిగివుంటాయి. వీరి దుస్తులు, శిరోజాలంకరణ, గుండ్రంగాను పెద్దగాను వున్న స్తనాలు, సన్ననినడుం, లోపలికివున్న ఉదరం, అందంగా అలంకరించబడిన పూర్ణోరుకం మొదలయినవి ఎంతో శ్రద్ధా జాగ్రత్తలతో మలచినట్లు కనిపిస్తుంది. ఇలాంటి లక్షణాలున్న ప్రతిమలు ఒక్కొక్కసారి ప్రవేశ ద్వారం కిరువైపులా ద్వార పాలికలుగా కూడా చూపబడ్డారు. స్త్రీలు ద్వారపాలికలుగా సోంపాలెం చెన్నకేశవాలయంలో కనిపిస్తారు. పైన

తెలిపిన స్త్రీ శిల్పాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే విజయనగర శిల్పులకు స్త్రీ అందాలమీదున్న అవగాహన తెలుస్తుంది.

**మరుగుజ్జులు :** భారతీయ శిల్పులు యీ వింత మరుగుజ్జులను అలంకరణకు మాత్రమే వినియోగించారు. ఈ శిల్పాలు విశేషంగా విజయనగర కాలంలో వివిధ ఆకారాలలో అలయాలలోని వివిధ భాగాలలో కన్పిస్తాయి. విజయనగర కాలంలో ఉపపీఠ, అధిష్టాన, కపోతం లోనూ, కుంభ పంజరలోని క్రిందిభాగంలోనూ, ప్రస్తరలోనూ, స్తంభాల బ్రాకెట్లలోనూ మరుగుజ్జులను చూడవచ్చు. చాలావరకు మరుగుజ్జులను కూర్చొని వున్నట్లు, తలపై బరువు మోస్తున్నట్లుగా లేక భుజాలపై లేదా చేతులతో బరువు మోస్తున్నట్లుగానో చూపబడింది. కొద్దిలిపి మరుగుజ్జులశిల్పాలు నిలుచొని వున్నట్లుగా లేదా నృత్యం చేస్తున్నట్లుగాకూడా కనిపిస్తాయి. ఒక్కొక్కసారి ప్రతిమల క్రిందవుండే పలకపై కూడా వీటిని చూడవచ్చు. మరుగుజ్జులను కురచైన దుస్తులతోను, కుండలాంటి బొజ్జలతోను, వుబ్బుగా పెద్దగావున్న కళ్ళతోను, ఉదరబంధం, ఏకావళి, కడియాలు, చిన్నటోపీలతోను చూపారు. ఒక్కొక్కసారి ఏనుగు దంతాల వంటివి (చిన్నవి) నోటికిరువైపులా చివరలో చూడబడినాయి. ఇంకా ఆసక్తి కరమైన విషయమేమిటంటే వొక్కొక్కసారి కిరీటముకుటంతో కూడా చూపటం. ఇలాంటి ప్రతిమ లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్యమండపంయొక్క అధిష్టానంలోను హంపీ, శ్రీశైలంలోని స్తంభాల మీద చూడవచ్చు. ఈవుదాహరణంలోనిలుచొని లేదా కూర్చొని బరువును మోస్తున్నట్లు లేదా బరువు ఎత్తుకొన్నట్లుగా పైకిలేచివున్న చేతులు చెప్తున్నాయి. లేపాక్షి నాట్యమండపంలోని అధిష్టాన భాగంలో నున్న మరుగుజ్జుల శిల్పాలుచాలా ఆసక్తిగా కనిపిస్తాయి. ఈ ప్రతిమల ముఖభావాలు చాలా మనోహరంగా కనిపిస్తున్నాయి. కిరీటముకుటం, కేయూరాలు, యజ్ఞోపవీతం, మంజీరాలు, కంకణాలు, స్కంధమాలలు వివిధ రకాల హారాలతో అందంగా అలంకరించబడి వున్నాయి. ఈ ప్రతిమలలో

ముఖ్యంగా గమనించదగ్గది ఉదరం మీద ముఖాలు. ఇలాంటివి విజయ నగర శిల్పాలలో చాలా అరుదుగా కనిపిస్తాయి.

బౌద్ధశిల్పాలలో వీరిని 'యక్షులు'గా చూడవచ్చు. సాంచిస్థూపం లోని తూర్పు ద్వారం పైనున్న ప్రతిమ మొదటిదిగా చెప్పవచ్చు. బార్ హుట్‌లోనూ, భువనేశ్వర్ సమీపంలోవుంచే గణేష్, అనంతగుంప గుహాలయాలలోను యీ ప్రతిమలు భారవాహికలుగా చూపబడినాయి. నాగార్జునకొండ, అమరావతిలో నగ్నంగాను లేదా పొట్టిదుస్తులతోను, తలపాగా లేదా టోపీలతోను చూపబడినాయి. బౌద్ధ శిల్పాలలో యీ ప్రతిమకు ఉదరంమీద ముఖం చూపబడింది. వాల్మీకి రామాయణంలో కబంధుడు యీమరుగుజ్జుం పోలివుండటం గమనించవచ్చు. అమరావతి, ఘంటసాల, అజంతాలలో యిలాంటి ప్రతిమలున్నాయి. హిందూ ఆల యాలలోని మరుగుజ్జులు బౌద్ధశిల్పాల లక్షణాలను పోలివున్నవి. బాదామి చాళుక్యుల కొంటిగుడి, ఐహోళేలో భారవాహికలుగా చూడవచ్చు. రాష్ట్రకూటుల నాటి ఎల్లోరాలోని గుహాలయాలలో వింతజంతువుల మీద తోక పట్టుకొని స్వారిచేస్తున్నట్లుగా వున్నాయి. పై వుదాహరణలన్నిం టిలో కూర్చొని, నిలుచొని, నృత్యం చేస్తున్నట్లు చూపారు. ఒక్కొక్క సారి మనిషిశరీరం జంతువు తలతోకూడ చూపబడినవి. విష్ణుకుండినులు పల్లవులు కూడా యీ ప్రతిమలను ఆదరించారు. ఉండవల్లి, మొగలిరాజ పురం, భైరవకొండ గుహాలయాలలో యివి కనిపిస్తాయి. మహాబలి పురంలో అనంతశయన విష్ణు ఆలయంలో ఉదరేముఖుడుగా చూపబడి వుండటం గమనార్హం. పల్లవుల అధిష్టానాలలో యీప్రతిమలు ఎక్కువగా చూపబడినాయి. ఇక్కడ చాలావరకు నగ్నంగావుండి తలకుపట్టుమాత్రం వుంది. చోళుల కాలంలో యీ ప్రతిమలు విపరీతంగా కన్పిస్తాయి. ఇక్కడ భారవాహికులుగాను, ఎగురుతున్నట్లుగాను, చిన్నచెవ్వు, పెద్ద కళ్ళతోనూ, అర్ధనగ్నంగానూ యీ శిల్పాలున్నాయి. దక్షిణ భారతదేశం లోని వివిధ కాలాలలోని గుహాలయాలు, దేవాలయాలలోని మరుగుజ్జు ప్రతిమలను గురించి పైన వివరించబడింది. ఉత్తర భారతదేశంలోని

ఆలయాలలో కూడా యివి కనిపిస్తాయి. గుప్త, వాకాటక ఆలయాలలో ఎగురుతున్నట్లుగాను, వింత జంతువులపై స్వారిచేస్తున్నట్లు, జారహా కులుగాను వుండి తలపాగలు, హారాలు, కుండలాలు మొదలయినవాటితో అలంకరించబడివుంటాయి. వీరి కాలంలోని వర్ణ చిత్రాలలోకూడ మరు గుజ్జులనుచూడవచ్చు. కళింగరాజుల ముక్తేశ్వర, పరశురామేశ్వర, కోటి తీర్థేశ్వర, రాజేశ్వర, వైతాళ్ మొదలయిన భువనేశ్వర్ ఆలయాలలో మరుగుజ్జులను చూడవచ్చు. ఈ ప్రతిమలలో కూడ పై విధంగా అలం కారాలు కన్పిస్తాయి.

పైన తెలిపిన వివిధ కాలాలలోని మరుగుజ్జులను పరిశీలించితే బౌద్ధ శిల్పాలను చూచి ప్రేరేపితులై అన్నికాలాల వారూ ఆదరించి, అనుసరించినట్లు తెలుస్తుంది. ఈ ప్రతిమలు అన్ని కాలాలలోనూ, వివిధ భంగిమలలో, వివిధ రకాల అలంకరణలతోనూ, ఆలయంలోని వివిధ భాగాలలో దర్శనమిస్తాయి. మరుగుజ్జు ప్రతిమలు సాగరాలు దాటి బర్మా, జావాలకు కూడా ప్రాకినాయి. విజయనగర కాలంనాటి మరుగుజ్జులను పరిశీలించితే పల్లవ, చోళులనాటి లక్షణాలు ఎక్కువగా కనిపిస్తాయి. విజయనగర శిల్పులు వీటిని పెద్దగా బలిసినట్లుగాను, వొక్కొక్కసారి ముగ్ధ మనోహరంగాను, కిరీట మకుటంతోను, ఉదర ముఖాలతోను చూపారు. ఈ లక్షణాలున్న మంచి వుదాహరణ లేపాక్షి వీరభద్రాలయ నాట్యమండపంలోని అధిష్టాన భాగంలో కన్పిస్తుంది.

**చైత్య లేక కూడు :** ఇది విజయనగర కాలంలో ఆలయ భాగాల పైన ఎక్కువగా కన్పిస్తుంది. ఇదికూడ అలంకరణ కోసమే వుపయోగ పడుతుంది. చైత్య లేక కూడు అపరిమితంగా శిల్పించడాన్ని బట్టి నాటి శిల్పులకు దీనిమీద ప్రత్యేకమైన ఆసక్తి, యిష్టముండినట్లుగా గమనించ వచ్చు. అధిష్టానాలలోను, కపోతాలమీద, మధ్యభాగాలలో వున్న చిన్న స్తంభాలమీద, విమాన క్రింది భాగంలోను, గోపుర ద్వారాలమీద,

స్తంభాల మీద, స్తంభపలకలమీద కూడును చూడవచ్చు. ఇవి అలం కరణతోను, అలంకరణ లేకుండా సాదాగాను విజయనగర ఆలయాలలో కన్పిస్తాయి. లేపాక్షి వీరభద్రాలయంలో స్తంభాల మీద, శిల్పపలకాల మీద అలంకరణ లేకుండ సాదాగా వున్నవి కనిపిస్తాయి. ఇవిఅర్ధచంద్రా కారంగా వుండి పైకి చతురస్రాకారంగా ముందరికి పొడుచుకొని వచ్చి నట్లుండి పైన చిన్న గూడు కలిగివున్నాయి. రెండవరకంలో కీర్తిముఖం పైనవుండి నోటినుండి వొంపువొంపులుగావున్న పుష్పాలు బయటికొచ్చి నట్లుంది. దీనికి వుదాహరణాలు లేపాక్షి కల్యాణమండపంలోని స్తంభాల మీద కనిపిస్తాయి (ఫోటో. 21). వీటి అభివృద్ధి దశను పుష్పగిరి, వల్లూరు, తాడిపత్రి, హంపీ మొదలైన విజయనగర ఆలయాలలో గమ నించవచ్చు. వీటన్నిటిలో కూడు అందంగా తీర్చిదిద్ద బడివుంది. పైన పెద్ద కీర్తిముఖం కన్పిస్తుంది. గూడులో మనిషి తల వుంటుంది. ఇంకా చిన్న చిన్న ప్రతిమలు, పుష్ప సంబంధమైనవి, కూర్చొనివున్న మానవ ప్రతిమలు మొదలయినవి కూడా గూడులలో కనిపిస్తాయి. దీనిన్నిట్టు పూర్వోత్తరాలు, వివిధ కాలాలలో కూడు అభివృద్ధిని తెలుసుకొంటే విజయనగర శిల్పులను ఏకాలంనాటి కూడు వుత్తేజపరచిందో తెలుస్తుంది.

మొట్టమొదటిసారి చైత్య బౌద్ధ శిల్పాలలోని లోమాస్‌ఋషి గుహాలయాలలో కనిపిస్తాయి (క్రీ. పూ. 250వ సంవత్సరం). తర్వాత భాజ గుహాలలోని క్రీ. పూ. 150 వ సంవత్సరానికి సంబంధించినవి కని పిస్తాయి. తర్వాతి కాలంనాటివి కందనే, కార్లే మొదలయిన గుహాలయా లలోని కూడు యొక్క గూడులలో మానవుని తలలు, అందమైన స్త్రీ ప్రతిమలు కనిపిస్తాయి. బౌద్ధ శిల్పాలలోని చివరిదశ ఎల్లోరాలోని విశ్వ కర్మ గుహాలయంలో వుంది. హిందూ ఆలయాలైన బాదామి, అజంటా గుహాలయాలలో కూడుల అభివృద్ధి దశను గమనించవచ్చు. బాదామి చాళుక్యుల కాలంలో బాదామి, ఐహోళే, అలంపూర్, పట్టడక్కల్ అల యాలలోని అధిష్టాన, కపోత, దేవకోష్ట, విమాన, ప్రస్తర, స్తంభం, ద్వారబంధాలపై కూడులు కనిపిస్తాయి. వీటి గూడులలో అందమైన

స్త్రీలు, పుష్పసంబంధమైనవి, దేవతామూర్తులు మలచబడి వున్నాయి. ఒక్కొక్కసారి యివి ఖాళీగా కూడ కనిపిస్తాయి. విష్ణుకుండినులనాటి మొగల్ రాజపురం, వుండవల్లి, భైరవకొండలలోని కూడు లేక చైత్య గరిపె కొనసాగింపు పోలివుంది. పల్లవుల కూడు కూడా విష్ణుకుండిను లను పోలివుంది. దళవనూరు, మహాబలిపురం ఆలయాలలో గమనిం చతే యిది విదితమౌతుంది. గూడులో మనిషి తల వుంటుంది. మలి పల్లవ అలయాలలో దేవతా మూర్తులు కనిపిస్తాయి. పైన కీర్తిముఖం కూడా చూపబడింది. చోళుల అలయాలలో కూడుఅధికంగా కనిపిస్తుంది. ఇక్కడ అర్ధచంద్రాకారంగా వుండి, కొన్నింటి పైభాగం అందంగాను, కొన్నింటిలో సాదాగాను కనిపిస్తుంది. గూడులలో మనిషి తలగాని, జంతువులుగాని, పుష్ప సంబంధితమైనవి గాని కనిపిస్తాయి. ఈ కాలం నాటి విమానమందలి కర్ణకూట, నేత్రకోష్ఠ, భద్రకోష్ఠ, చతురస్ర శిఖ రం మొదలయిన భాగాలలో కూడు కనిపిస్తుంది. ఉత్తర భారతదేశంలో కూడా కూడులను అదరించారు. గుజరాత్‌లోని మైత్రిక, సైంధవ ఆల యాలలోనూ, ఒరిస్సాలోని జగమోహన భాగంలోనూ యీ కూడులు కనిపిస్తాయి.

పైన వివరాలను పరిశీలించితే పల్లవ, చోళులనాటి కూడు విజయ నగర ఆలయాలలోని చైత్య లేదాకూడుకు దగ్గర సంబంధం కనిపిస్తుంది.

**మకరతోరణం :** దీనిని విజయనగర శిల్పులు చాలా మితంగా వాడారు. ఇవి మామూలుగా స్తంభాలు, కుడ్యాగంలో వున్న పెద్దపెద్ద ప్రతిమల పైన కనిపిస్తాయి. మంచి వుదాహరణలు లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్య, కల్యాణమండపాల్లోని స్తంభాలమీద కనిపిస్తాయి (ఫోటోలు. 10, 18, 21). మకరతోరణం దేవతలప్రతిమలపై యిక్కడ మలచబడింది. ఇది చూచేందుకు విల్లును వొంపులొంపులుగా వంచినట్లుంటుంది. దీనిపై భాగంలో కీర్తిముఖముంటుంది. కూర్చొని వున్న మకరములు తలలు పైకెత్తివుంచి తోరణం కిరువైపులా వున్నట్లు క్రిందిభాగంలో చూపబడి నాయి. ఇక్కడ రెండు రకాలుండటం గమనించవచ్చు. ఒక రకంలో

మకరములు మాత్రం చూపించబడినాయి. రెండవరకంలో మకరంపైన మనిషి స్వారీ చేస్తున్నట్లు కనిపిస్తుంది. మకరంపైన మనిషి స్వారీ చేస్తున్నట్లున్న దానిని విజయనగర ఆలయమైన పుష్పగిరి చెన్నకేశవాలయంలో చూడవచ్చు. విజయనగర కాలంలో దేవతల ప్రతిమలు పైభాగంలోనే కాక ద్వార బంధంపైన మహానాశికకు ముందు భాగంలోనూ కనిపిస్తాయి.

వల్లూరులోని శివాలయంలో ద్వారబంధంపైన మకర తోరణం కనిపిస్తుంది. ఇక్కడపైభాగంలో కీర్తిముఖం చూపబడింది. ఈతోరణం లోపలి భాగంలో శివుని ఉమా సహితమూర్తి ప్రతిమవుంది. మహానాశి కంలో మకరతోరణం కనిపించే వుదాహరణ హంపీ హజారా రామాలయ విమాన భాగంలో చూడవచ్చు. ఇక్కడ తోరణం మకరముల నోటి నుండి బయటకు వచ్చినట్లుగా కన్పిస్తుంది. మకరము యిరు ప్రక్కల క్రింది భాగంలోవున్నాయి. ఈ తోరణంపై భాగంలో కీర్తిముఖంవుంది. ఈ తోరణం చూచేందుకు అర్ధచంద్రాకారంగా కనిపిస్తుంది. మధ్యలో చిన్న విమానం శాల శిఖరంతో చూపబడింది.

మకరతోరణం మొదట మధుర శిల్పంలో కనిపిస్తుంది. తర్వాత అమరావతిలో కూర్చొని వున్న మకరముల నోటినుండి పూలమాలలు బయటికి వస్తున్నట్లున్నాయి. బౌద్ధ శిల్పం నుండి తర్వాతికాలంలో హిందూ ఆలయాలలో యీ మకరతోరణం దర్శనమిస్తుంది. హిందూ అలయాలలో గుప్తులకాలంనాటి ఆలయాలలో మొట్టమొదట కనిపిస్తుంది. దక్షిణ భారతదేశంలో బాదామి చాళుక్యులు గుప్తులనాటి మకరతోరణం చూసి వుత్తేజితులై వీరుకూడా ఆదరించి పోషించారు. పట్టదక్కల్ విరూ పాక్షాలయంలో మకరం కూర్చొనివుంది. దాని దవడలనుండి తోరణం బయిటకు వస్తున్నట్లుంది. మకరంపైన మరుగుజ్జు కూర్చొని వున్నట్లు చూపబడింది. రాష్ట్రకూటులు కూడా బాదామి చాళుక్యుల ననుసరించారు. ఎల్లోరాలోని నంది మండపంలో వీరికాలంనాటి మకరతోరణాలు కనిపి పిస్తాయి. తూర్పుచాళుక్యుల, మలి చాళుక్యుల కాలంలోకూడా యీతోర

ణాలు కనిపిస్తాయి. తూర్పు చాళుక్యుల మకరతోరణాలు చాలావరకు పల్లవులనాటి తోరణాలను పోలివున్నాయి. కాకతీయుల మకర తోరణం పశ్చిమ చాళుక్యుల మకరతోరణాన్ని పోలివుంది. ఇక పల్లవుల ఆలయాల లోని మకరముల పైన మరుగుజ్జులుస్వారీచేస్తున్నట్లు చూపబడింది. చాలా అందంగా తీర్చిదిద్దబడిన మకరతోరణాలు కంచిలోని కైలాసనాథ ఆల యంలోనూ, వైకుంఠ పెరుమాళ్ ఆలయంలోనూ చూడవచ్చు. వీరి కాలంనాటి మకరతోరణాలలో మనుషులను వివిధ ఆకృతులలోచూపారు. తోరణం మధ్యలో దేవతల ప్రతిమలు కనిస్తాయి. అంతేకాక వొక్కొ క్కసారి వొకటికంటె ఎక్కువ మకరములు క్రింది భాగలో కన్పిస్తాయి. చోళుల కాలంలో దేవకోష్టలు, కూడులు యీ మకరతోరణాలు కలిగి వున్నాయి. వీరికాలంలో వొక్కొక్క మకరంతోరణానికి చెరొక ప్రక్కగా వుండి, వొక్కక్కసారి వొకటికంటే ఎక్కువతోరణాలు కలిగివుంటాయి. ఒక వుదాహరణలో మనుష్యులు వివిధ భంగిమలలో తోరణంలో వరు సగా వున్నట్లు చూపబడింది. వీరికాలంలో కూడా మకర తోరణంలోపల దేవతల ప్రతిమలున్నాయి.

పైన తెలుసుకొన్న వివరాలనుబట్టి మకరతోరణం అలంకరణకు మాత్రం వుపయోగించినట్లు యీ పద్ధతి బౌద్ధ శిల్పం నుండి హిందూ శిల్పానికి ప్రాకిందని తెలుస్తున్నది. తర్వాతికాలంలో దీనిని అన్నికాలాల ప్రభువులు ఆదరించినట్లు తెలుస్తూవుంది. ఇది దక్షిణ భారతదేశంలోని చాళుక్య, పల్లవ, చోళుల కాలంలో శిఖరాగ్ర స్థాయికి చేరింది. విజయ నగర మకరతోరణం ముఖ్యంగా దక్షిణ భారతదేశ వుదాహరణలను పోలి వున్నది. కానీ కొన్ని విషయాలలో వేరుగా కనిపిస్తున్నాయి. లేపాక్షి లోగానీ యితర విజయనగర ఆలయాలలో గానీ మకర తోరణాలలో రెండు మకర తలలు క్రింద భాగంలో కానీ, పై భాగంలో కానీ కానరావు. ఇలాంటి లక్షణాలున్నవి మనకు పల్లవ, తూర్పు చాళుక్యుల కాలంలో కనిపిస్తాయి. మకరతోరణం మధ్యభాగంలో మానవాకృతులు, వ్యాళ,

గజ, హంసలు విజయనగర మకరతోరణాలలో కనిపించవు. ఇలాంటివి చోళుల మకరతోరణంలో ఎక్కువగా కనిపిస్తాయి.

**ఆసీన శార్దూలాలు:** కూర్చొనివుండే శార్దూలాలు విజయనగర శిల్పాలలో ఎక్కువగా కన్పిస్తాయి. ఇవి చూసేందుకు వింత జంతువుల్లా వుండి, అన్నిచోట్లా కూర్చొని వున్నట్లేకనిపిస్తాయి. దీనికి సింహం తల వుండి మిగిలిన శరీరం మానవాకారంలో వుంటుంది. కానీ కాళ్ళు, చేతులకున్న వ్రేళ్ళు చాలా పొడవుగా వుండి, గోళ్ళు పదునుగా పొడవుగా వుంటాయి. ఇది చూడడానికి భూతం లాగా కనిపిస్తుంది. ముందరికి చొచ్చుకొని వచ్చినట్లుండే పెద్దకళ్ళు, వెడల్పాగా తెరవబడి వున్ననోరు బయటికి తోసుకు వచ్చిన నాలుక, పెద్దదిగాను, వంకరగాను వున్నతోక మొదలయినవి కలిగివుంటుంది (ఫోటో. 2). ఒక్కొక్కసారిపురుషాంగాన్ని కూడా పుష్టతంగా చూపించారు. ఇవి స్తంభ పీఠంమీద, అధిష్టాన బాగంలోను, ద్వారాని కిరువైపులా స్తంభాల పైభాగంలోనూ మామూలుగా కనిపిస్తాయి. ఇక లేపాక్షిలోనే కాకుండా మగిలిన విజయనగర అలయాలయిన హంపీ, తాడిపత్రి, పుష్పగిరి, సోంపాలెం ఆలయాలలో కూడా కనిపిస్తాయి. ఎ. గోపాలరావు దీనిని వోరకపు యోగ నరసింహమూర్తిగా వర్ణించారు (A. Gopal Rao, Lepakshi, p. 96, Pl. XXXVI).

ఈ విచిత్రమైన జంతువు విజయనగర శిల్పులు క్రొత్తగా కనుగొన్నదికాదు. భైరవ కొండలోని స్తంభాల పైభాగంలో కన్పించిన శార్దూలం అచ్చు విజయనగర శార్దూలాన్ని పోలివుంది. పల్లవులుకూడా స్తంభాల క్రిందిబాగంలో దీన్ని చూపారు. పైవుదాహరణలో దీనిని సింహ ముఖంతో, మనిషి మొంచెంతో కూర్చొని వున్నట్లు చూపబడింది. జమిదొడ్డిలోని శార్దూలం విజయనగర కాలంనాటి పుష్పగిరిలోని శార్దూలాన్ని పోలివుంది. చోళుల కాలంలో శార్దూలం చాలా అరుదుగా కనిపిస్తుంది. వారికాలంనాటి కావేరి రాజపురంలో ఉమామహేశ్వరాలయంలోని కల్యాణ సుందరమూర్తి ప్రతిమకు పైనవున్న యీ జంతువు అచ్చంగా

విజయనగర శార్దూలాన్ని పోలివుంది. భువనేశ్వరలోని పరశురామేశ్వరాలయంలో కూడా శార్దూలం కనిపిస్తుంది. పైన తెలిపిన వివరాలను పరిశీలిస్తే విష్ణుకుండినుల భైరవకొండలోని కూర్చొనివున్న శార్దూలం విజయనగర శార్దూలానికి దగ్గరగా వుండటం చేత వీరిని విష్ణుకుండినుల శిల్పం వుత్తేజపరచి వుండవచ్చని వూహించవచ్చు.

విజయనగర శిల్పాలలో మరొక చెప్పుకోదగ్గ వింత జంతువు 'వ్యాళ'. ఇది మామూలుగా ఏనుగు వెనక నిలుచొనివుంటుంది. ఈ రెండు జంతువులు (ఏనుగు–వ్యాళ) మండపాలలోని పెద్ద స్తంభాల కంటుకొని వుండేట్లు చూపారు. ఇవిముఖ్యంగా విజయనగర కల్యాణ, నాట్య మండపాలలోని స్తంభాలలో కనిపిస్తాయి. లేపాక్షి వీరభద్రాలయంలో కూడ యీ జంతువు కనిపిస్తుంది (ఫోటో. 5).

**గంధర్వులు :** ప్రాచీన, మధ్య యుగ గ్రంథాలలో గంధర్వ, కిన్నెరల గురించి వర్ణించబడి వుంది. వీరు వింత మనుష్యులుగా కనిపిస్తారు. వీరు అర్ధ దైవ సంబంధీకులు, సంగీత నృత్య కళాకారులుగా, భోగలాలసులుగా పురాణాల్లోనూ ప్రత్యక్షమవుతారు. వీరు ఇంద్రుని ఆస్థానంలో నాట్యంచేసేవారు, సంగీతం పాడేవారు. కిన్నెరలు కూడా గంధర్వులవలె గొప్ప పాటగాళ్ళు. విష్ణు ధర్మోత్తర పురాణం ప్రకారం గంధర్వులకు కిరీటముండదు, కానీ వెంట్రుకలను జడ లాగా శృంగారంగా అల్లుకొంటారు. మత్స్య పురాణం ప్రకారం యీ గంధర్వులు బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరుల పరివారం. మానసార ప్రకారం వీరు సంకరమైనవారు. పైభాగం మానవాకారంగా వుండి రెక్కలు కలిగివుంటారు. క్రిందిభాగం పక్షిలేక జంతువు ఆకృతిలో వుంటుంది. వీరుసంగీత వాద్యాలను మ్రోగిస్తున్నట్లుగానో, నృత్యం చేస్తున్నట్లుగానో వుంటారు.

విజయనగర శిల్పులు, చిత్రకారులు గంధర్వులను మలచడంలోను, చిత్రించడంలోను మిక్కిలి ఆసక్తి చూపారు. ఈ గంధర్వుల

ప్రతిమలు లేపాక్షి వీరభద్రాలయంలోని స్తంభాలమీదున్నాయి. ఒక వుదాహరణలో అప్సరస (గంధర్వుని భార్య) సంకర స్వభావంలో వున్నట్లుంది. పైభాగం మానవాకారంగా, క్రిందిభాగం పక్షి ఆకృతిని పోలివుంది. క్రిందిభాగంలోని కాళ్ళు, పక్షితోక చాలా అందంగా మలచ బడివుంది. హారాలు, కంకణాలు, మేఖలతో అందంగా మలచబడి కుడి చేతిలో వీణ ధరించి, మరొక చేయి శుచిహస్త ముద్రలోవుంది. కిరీట మకుటం కూడా ధరించివుంది. ఇంకొక వుదాహరణలో గంధర్వుడు కుడి చేతిలో ధూపగరిటె కలిగివుండి పైభాగం మానవాకారం, క్రిందిభాగం జంతువును పోలివున్నాడు. పొంపు తిరిగి వున్న తోక, వంగినట్లున్న కాళ్ళు చాలా వాస్తవికంగా వున్నాయి. వివిధరకాల హారాలు, కిరీటమకు టంతో యీ గంధర్వుని అందంగా అలంకరించారు.

ఇలాంటి గంధర్వ ప్రతిమలు పుష్పగిరిలోని చెన్నకేశవాలయంలో కూడా కనిపిస్తాయి. ఇక్కడ దేవతల కిరువైపులా వీరిని చూపటం జరి గింది. వీరు చేతులలో వీణ, వేణువు కలిగివున్నారు. ఈ గంధర్వ, అప్సరసలను విజయనగర వర్ణ చిత్రాలలో కూడా చూడవచ్చు. ఈ చిత్రాలకు రెండు మంచి వుదాహరణాలున్నాయి. ఒకటి లేపాక్షిలోనూ, రెండవది తిరుపాలంజులిలోను వుంది. ఇక్కడ సంగీత పరికరాలను ప్రయోగిస్తున్నట్లు చూపబడ్డారు. గంధర్వులను ప్రథమంగా బౌద్ధ శిల్పా లలో చూడవచ్చు. ఇక్కడ గాలిలో ఎగురుతున్నట్లు చూపబడ్డారు. బార్‌హుట్, సాంచిలలో క్రిందిభాగం పక్షిని పోలివుండి, పైభాగం మాన వాకారంగా వున్నారు. అయితే రెక్కలను కలిగివున్నారు. భువనేశ్వర్ దగ్గరున్న ఉదయగిరి, ఖంగగిరిలలోనృత్యం చేస్తున్నట్లు, వాయిద్యం లేక పుష్పమాలలు చేతిలో వుంచుకొని చూపబడ్డారు. గంధర్వ, అప్సరసలను అజంతా వర్ణ చిత్రాలలో చూపించారు. ఇక్కడకూడా సంకరంగా వుండి వీణ చేతిలో కలిగివున్నారు. గుప్తుల దేవఘర్‌లో వొక జంట గంధర్వ లను ఎదురెదురుగా చూపబడింది. ఇక్కడి గంధర్వులకు పాదాలు మాత్రం పక్షి పాదాలను పోలివుండి, మిగిలిన భాగమంతా మానవా

కాలంలో చూపబడింది. భువనేశ్వర్‌లోని రాజారాణి ఆలయంలో చాలా మంచి వుదాహరణవుంది. ఇక్కడ చేతులలో పెద్దవీణ చూపబడింది.

విజయనగర శిల్పాలలో రెక్కలు కన్పించవు. గాలిలో ఎగురుతున్నట్లు కూడా కానరాదు. అలాగే చేతులలో పూలమాలలు కన్పించవు. విజయనగర కాలంలో చాలావరకు సంగీత పరికరాలను ప్రయోగిస్తున్నట్లు చూపబడింది. అరుదుగా దేవుణ్ని ధూపంతో ఆరాధించేట్లు కన్పిస్తుంది.

**జంతువులు, వృక్షాలు :** విజయనగర శిల్పులు జంతు, వృక్షాలను మలచడంలో ప్రత్యేక శ్రద్ధ, ఆశక్తి చూపారు. ఏనుగులు, జింకలు, ఆవులు, ఎద్దులు, కోతులు, పక్షులు మొదలైన వివిధ రకాలైన జంతువుల గుంపులు ఆలయ వెలుపల, ప్రాకార గోడలమీద, స్తంభాలమీద కనిపిస్తాయి. లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణ, ముఖ, అర్థ మండపాలలోని స్తంభాలమీద వివిధ రకాల జంతువులు వున్నాయి. విజయనగర శిల్పులు వేట దృశ్యాలను కూడా బయటగోడలమీద మలచారు. హంపీ, శ్రీశైలంలో యిలాంటి దృశ్యాలు కనిపిస్తాయి. ఇక్కడ వేట దృశ్యాన్ని పరిశీలిస్తే వాస్తవానికి చాలా దగ్గరగా శిల్పితన తెలివితేటలు చూపించినట్లు కన్పిస్తుంది.

చెట్లు కూడా శిల్పాలలోనూ, వర్ణ చిత్రాలలోనూ కనిపిస్తాయి. అలాగే కొండలు, మేఘాలు మొదలయిన వాటినికూడా చిత్రించడంలోను, మలచడంలోను విజయనగర చిత్రకారులు, శిల్పులు విజయం పొందారు.

విజయనగర శిల్పులు స్థూలమైన శిల్పాలను రూపొందించటంలో కూడా విజయం సాధించారు. లేపాక్షిలో పెద్దనాగలింగం, ప్రసిద్ధిపొందిన నంది, హంపీలోని నరసింహస్వామి మొదలైనవి వీరి అపూర్వ కళా సృష్టికి మచ్చుతునకలు.

**నాగలింగం :** లేపాక్షి వీరభద్రాలయ గర్భగుడికి వెనుకభాగంలో పెద్ద నాగలింగంవుంది(ఫోటో. చివరిఅట్ట). నాగేంద్రుడుపెద్దరాతినుండి మలచ

బడ్డాడు. ఇది మూడు చుట్టలుగా వుంది, ఏడు పడగలను కలిగివుంది. మూడు చుట్టల పైన మధ్యభాగంలో పానవట్టముండి పైన శివలింగం కలిగివుంది. దీనికి తూర్పు భాగంలో మెట్లున్నాయి. నాగలింగ నిర్మాణాన్ని గురించి యీ విధంగా చెబుతారు. లేపాక్షి ఆలయ నిర్మాణ సమయంలో వొకానొక రోజున శిల్పులు మధ్యాహ్న భోజనానికెళ్తే వంట కావడానికి కొంత ఆలస్యమవుతుందని వంటచేసే స్త్రీ చెబుతుంది. అంత వరకు వూరకే వుండటం ఎందుకని అక్కడేవున్న వొకపెద్దరాతిని నాగేంద్రునిగా మలిచారట (V. Kameswara Rao, The Lepakshi Temple, P. 10 పి. కృష్ణమూర్తి, రాయలసీమలోని ముఖ్య దేవాలయాలు, P 80). ఈ నాగేంద్రుని లోపలి భాగానికి అప్పట్లో రంగు కూడా పూసినట్లుగావుంది. నేటికీ కొద్దికొద్దిగా అ రంగు కన్పిస్తూవుంది. కాలానుగుణంగా వచ్చే వాతావరణ మార్పులవల్ల ఆ రంగు చాలావరకు పోయింది.

ఇలాంటి నాగలింగాలను మలచడం భారతదేశంలో బౌద్ధ శిల్ప కాలంనుండి వాడుకలో వుంది. శాతవాహనుల కాలంలో కూడా యివి కనిపిస్తాయి. పల్లవ, చాళుక్యుల కాలంలోకూడా నాగలింగాలు కనిపిస్తాయి. కానీ యింత పెద్ద నాగలింగం మరెక్కడా కానరాదు. మూడు చుట్టలకు ఏడు తలలుండి చూడడానికి సరిసమానంగా సంపూర్ణా కృతిలో కనిపిస్తుంది. వీరభద్రుని గర్భగుడి కంటే యిది ఎత్తుగా వున్నట్లు కనిపిస్తూ చూపరుల నాకట్టుకొంటూంది.

**నంది :** వీరభద్రుని ఆలయానికి కొన్ని ఫర్లాంగులలోను, నాగలింగానికి సుమారుగా 200 గజాల దూరంలో నాగలింగం లాగే వొకే రాతిలో మలచబడిన పెద్ద నందివుంది (ఫోటో. ముఖచిత్రం). దీనిని 'లేపాక్షి బసవయ్య' అని కూడా పిలుస్తారు. ఇది సుమారు 18 అడుగుల ఎత్తు, 30 అడుగుల పొడవు వుంది. పైకి లేచివున్న తల, పొట్టికొమ్ములు, పొట్టిగా కుదించి నట్లున్న ముఖం, ఎత్తైన మూపురం, పెద్ద కాలిగిట్టలు, మెడలో వివిధ రకాల దారాలు, గంటలు, పైభాగాన అందంగా అలంక

రించిపున్న సప్త మొదలయిన అంశాలలో అప్పటి శిల్పుల సజీవ కల్పనా చాతుర్యానికి, ప్రతిభకు నిదర్శనంగా వుంది.

దీనిని భారతదేశం లోకెల్ల పెద్దనందిగా చెప్పవచ్చు. తంజావూరు, హాళేబీడులలోని ఎద్దు, మైసూరు చాముండిలోని నంది లేపాక్షి నంది కన్న చాలా చిన్నవి. అంతేగాక చూడడానికి వయసులో మిగతా ఎద్దుల కన్నా యిదిచిన్నదిగా కనిపిస్తుంది. దీని చిన్న కొమ్ములు, మూసుకొని వున్న నోరు, చిన్నముక్కులు, చిన్నతల మొదలయినవి ఆవిషయాన్నే సూచిస్తున్నాయి. ఇది విజయనగర శిల్పాలన్నిటిలో అత్యున్నతమైందిగా కొందరు వర్ణించారు (V. Kameswara Rao, The Lepakshi Temple, P. 16).

ఇప్పటి వరకు తెలిపిన వివిధ రకాల శిల్పాలే కాకుండా నాట్య కత్తెలు, మేళగాళ్ళు, సంగీత విద్వాంసులు, సన్యాసులు, ఋషులు, నాగ బంధాలు మొదలయిన ఎన్నో శిల్పాలను లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్య, కల్యాణ, అర్ధమండపాలలో విజయనగర శిల్పులు సృష్టించారు.

విజయనగర శిల్పులకు మతేతర, దైవేతరమైన యితరజీవనంతో, ప్రకృతితో, నాగరికతతో వున్న పరిచయం కూడా ఎంతో గాఢమైంది, విస్తృతమైంది అన్న విషయాన్ని పైన వివరించిన వారి శిల్ప సృష్టి లోని వైవిధ్యం మనకు తెలియ పరుస్తూవుంది.

ఏడవ అధ్యాయం

# వర్ణచిత్రాలు

చతుష్షష్టి కళల్లో చిత్రలేఖనం కూడా వొకటి. కళల ద్వారామానవుడు జీవితాన్ని వ్యాఖ్యానించటం, వ్యక్తీకరించటం చేస్తాడు. మనస్సులో మెదిలే భావాలకు వో క్రమమైన, అందమైన రూపం కల్పించటంలో మనిషి కూడా సృష్టి కర్త అవుతాడు. ఈ సృజనాత్మకత ఆదిమకాలం నుంచి విభిన్న దశల్లో ఎలా పరిణమిస్తూ వచ్చిందీ, ఆయా కాలాల్లోని జీవన స్థితిగతులను ఎలా ప్రతిబింబిస్తూ వచ్చిందీ మనం ప్రాచీన కళావశేషాలను అధ్యయనం చేయటం ద్వారా గ్రహించ గలుగుతున్నాం.

మన ప్రాచీన బౌద్ధ, జైన, హిందూ సాహిత్యాల్లో చిత్రలేఖనానికి సంబంధించిన వివరాలెన్నో చోటు చేసుకోవటం మనం గమనించవచ్చు. ఆ కాలపు రాజుల, రాణుల, ధనికవర్గీయుల కళలమీద ఆసక్తికి, అభిరుచికి అవి నిదర్శనాలుగా మనకు కనిపిస్తాయి. అప్పట్లో కొయ్యమీద, వస్త్రాలమీద, యింకా త్వరగా నశించే గుణం వున్న వస్తు సముదాయంమీద చిత్రించటం చేసేవారు. వాతావరణ ప్రభావం కూడా తోడ్పడటంతో సహజంగానే కొద్దికాలంలో నశించే ఆవస్తువులతో బాటు ఆనాటి అపురూపమైన ఆ చిత్రాలుకూడా మనకిప్పుడు లభించకుండా పోయాయి.

రామాయణ, మహాభారతాల్లో వర్ణచిత్రాల గురించి ప్రస్తావన వుంది. భవభూతి వర్ణచిత్రశాలలను 'వీధి' అన్నాడు. బాణుడు వర్ణచిత్రాలు వరుసను 'విమాన పంక్తి' అని వర్ణించాడు. నిషాద చరితంలో శృంగారానికి సంబంధిచిన వర్ణచిత్రాల ప్రస్తావనవుంది. నవసాహసాంక చరితంలో గోష్టి, క్రీడలు, వేటదృశ్యాలు, రాసలీలలు మొదలయిన చిత్రాల గురించిన వర్ణనవుంది.

భారతదేశంలో మొట్టమొదటి వర్ణచిత్రాలు చరిత్రకు పూర్వయుగంలోని ప్రాచీన గుహల్లో లభించాయి. ఉత్తరప్రదేశ్‌లోని మిర్జా

పూర్, దాండా ప్రాంతాలలో, బుందేల్‌ఖండ్‌లోని మహాదేవ కొండల్లో, కైమూర్ కొండల్లో, బళ్ళారి గుహల్లో ప్రాచీన వర్ణచిత్రాలు మనకు కన్పిస్తున్నాయి. ఈ చిత్రాల్లో జంతువుల వేటకు ప్రాముఖ్యత నివ్వటం మనం గుర్తించవచ్చు.

అజంతాలోని వర్ణచిత్రాలను గురించి తెలుసుకోవటంతో భారత దేశ కుడ్య చిత్రలేఖనానికి సంబంధించిన క్రొత్తఅధ్యాయం మొదలైంది. ఇక్కడ లభించిన వర్ణచిత్రాలు క్రీ. పూ. 2వ శతాబ్దం నుండి క్రీ. శ. 6వ శతాబ్దం వరకు వివిధ కాలాలకు సంబంధించినవి. శాతవాహనులు, గుప్తులు, వాకాటకులు దీనినిపోషించినట్లూ, ఆరాధించినట్లూ తెలుస్తూంది. ఈ చిత్రాలను సి. శివరామమూర్తి యీ క్రింది విధంగా వివరించారు. అజంతాలో వున్న వర్ణచిత్ర రూపాలను ఆరు విధాలుగా విభజించవచ్చు. ఈ రూపాలను 'షడంగ' అంటారు. దీనినిగురించి జయమంగళ వ్రాసిన వాత్సాయన కామ సూత్ర గ్రంథంలో పేర్కొనటం జరిగింది. అవి (1) రూపభేద (నమూనాకు సంబంధించినది) (2) ప్రమాణ (స్థలానికి సంబంధించినది) (3) భావ (భావాలకు సంబంధించినది) (4) లావణ్య యోజన (సౌందర్య కాంతికి సంబంధించినది) (5) సాదృశ్య (యిష్టము) (6) వర్ణికాభంగ (అన్ని రంగుల మిశ్రమం) (C. Sivaramamurti, South Indian Paintings, New Delhi, 1968, p. 49). అజంతాలోని మానవ, జంతు, వృక్ష వర్ణ చిత్రాలు ఆనాటి చిత్రకారుల నైపుణ్యానికి నిదర్శనాలు. వొక వ్యక్తిని చిత్రించిన చిత్రాల్లోనే కాకుండా, వ్యక్తుల సమూహాన్ని చిత్రించిన చిత్రాల్లోకూడా ఆనాటి చిత్రకారుల గొప్ప కళాభినివేశం మనం గుర్తించ వచ్చు. పురాణ గాథల చిత్రీకరణలో అంగికమైన ముఖ్యంగా ముఖ కవళికలకు సంబంధించిన భావ ప్రకటనలకు ప్రాముఖ్యమిచ్చేవారు.

తర్వాత చెప్పుకోదగ్గ వర్ణ చిత్రాల అవశేషాలు బాగ్‌లోనిరాతిలో మలచిన విహారాలలో లభించాయి. ఇవి చాలావరకు అజంతా చిత్రాల

రీతిని, సాంకేతిక నిపుణతను పోలివున్నాయి. ఈ చిత్రాలు క్రీ.శ. 5 వ శతాబ్దానికి సంబంధించినవి. కాబట్టి అజంతా, బాగ్‌లలోని వర్ణ చిత్రాలను తొలికాలంనాటి గొప్ప వర్ణచిత్రాలుగా మనం పేర్కొనవచ్చు.

బాదామి చాళుక్యులు (క్రీ.శ. 6—8 శతాబ్దాలు) చిత్రలేఖన విషయంలో గుప్తులను, వాకాటలను అనుసరించారు. బాదామిలోని నాలుగవ గుహాలయంలో (వైష్ణవ గుహాలయం) వర్ణ చిత్రాలున్నాయి. ఈ చిత్రాలు కీర్తివర్మన్ సోదరుడైన మంగలేశ కాలానికి సంబంధించినవి. హిందూ ఆలయాలలోని తొలి వర్ణ చిత్రాలుగా వీటిని చెప్పుకోవచ్చు. ఇక్కడ విష్ణు అవతారాలయిన త్రివిక్రమ, నరసింహ, విరాట, భోగ శయన, వరాహాలతోబాటు విద్యాధరులు, రాణులు, పరివార బృందం మొదలైన చిత్రాలు మనం చూడవచ్చు.

ఎల్లోరాలోని వర్ణచిత్రాలు క్రీ.శ. 8—13 శతాబ్దాలకు సంబంధించినవి. ఇవిరాష్ట్రకూటులకు చిత్రలేఖనం మీదున్న అభిమానానికి, ఆరాధనకూ నిదర్శనాలుగా మనకీనాడు మిగిలివున్నాయి. ఇక్కడి కైలాసాలయంలో పైకప్పు, ఇంద్ర సభా గుహాలయంలోని నటరాజ, లింగోద్భవ మూర్తి, పద్మాల కొలనులోని ఏనుగు, విద్యాధరులు మొదలయిన చిత్రాలతో అందంగా తీర్చిదిద్దబడివుంది. ఎల్లోరాలోని కైలాసాలయం వివిధ కాలాలకు సంబంధించిన చాలా పొరల వర్ణచిత్రాలను కలిగివుంది.

పశ్చిమ చాళుక్యులకు సంబంధించిన వర్ణచిత్రాలు ఆంధ్రప్రదేశ్ మెదక్‌జిల్లా అల్లాదుర్గలో వున్నాయి. ఇవి 1967లో కనుగొనబడినాయి. ఈ చిత్రాలు అంజతా, రోము వర్ణ చిత్రాలతో పోల్చదగినవని కొందరు ప్రశంసించారు (Md. A N. Khan, A. Monograph on the Discovery of Mural Paintings of Kalyani Chalukyas at Alladurg, Hyderabad, 1968, p. 6, Pls. I, II, III).

కాకతీయులు కూడా చిత్రలేఖనాన్ని ప్రోత్సహించారు. పిల్లలమర్రిలోని సముద్రమథన చిత్రం వీరికి చిత్ర లేఖనం మీదున్న ప్రీతిని

వ్యక్తపరుస్తుంది. పాలంపేటలోని శివాలయంలోకూడా కొన్ని వర్ణ చిత్రాల అవశేషాలు మనకు కనిపిస్తాయి.

పల్లవులు (క్రీ. శ. 7—9 శతాబ్దాలకు సంబంధించిన వారు) అజంతాలోని చిత్రలేఖన సాంప్రదాయాన్ని కొనసాగించారు. వీరికాలంలోని మామండూరు గుహాలయాల్లోకూడా కొన్ని వర్ణ చిత్రాల అవశేషాలు దొరికాయి. వీరి కాలానికి సంబంధించిన అందమైన వర్ణచిత్రాలు కంచి, పానమలైలలో వున్నాయి. పానమలైలో కిరీటాన్ని పెట్టుకొన్న దేవత చిత్రంవుంది. ఈ చిత్రం పైదాగాన గొడుగు కూడా చిత్రించబడివుంది. కంచిలోని సోమాస్కంద చిత్రం పల్లవ రాజైన రాజసింహుని కాలానికి సంబంధించింది. ఈచిత్రం (సోమాస్కంద) పల్లవులకు అత్యంత ప్రీతి పాత్రమైంది.

పాండ్యులు (క్రీ.శ. 7—9 శతాబ్దాలకు సంబంధించినవారు) చిత్ర లేఖనంలో పల్లవుల ననుసరించారు. సిత్తన్నవాసల్, తిరుమలైపురం లోని చిత్రాలను పరిశీలిస్తే యిది తెలియవస్తుంది. ఇక్కడ పుష్పాలు, పక్షులు, అలంకరణ సామగ్రి, చేపలు, బాతులు, ఎద్దు, ఏనుగు, మానవాకృతులు చాలా అందంగా చిత్రించబడి వున్నాయి.

వీరి తర్వాత చోళులు (క్రీ. శ. 9—13 శతాబ్దాలు) చిత్ర లేఖనాన్ని ఎంతగానో ఆదరించారు. నార్తమలై, మండగప్పట్టు, తంజావూరు లోని బృహదీశ్వరాలయం వీరికాలంనాటి వర్ణచిత్రాలకు నిలయాలు. వీరి చిత్రాలు ఆనాటి సాంఘిక స్థితిగతులను తెలుపుతాయి.

ఇప్పటి వరకు వివిధ కాలాలలో పేర్కొంటూ వచ్చిన చిత్రలేఖనం అభివృద్ధి, దాని వెనుక ప్రభువుల ఆదరణ విజయనగర కాలంలో వుచ్ఛస్థితిని అందుకొనింది. చిత్రలేఖనం సాధించిన సర్వతోముఖప్రగతికి యీ విజయనగర రాజులు చివరి గొప్పపోషకులుగా నిలిచిపోయారు.

తర్వాత నాయకరాజులకాలంలో మనకు చిత్రలేఖనంలో కన్పించే అంతరం వొకానొక క్షీణ స్థితిని, చిత్రలేఖనం కోల్పోతున్న ఆదరణను సూచించే దిగా వుండటం గమనార్హం. ఈ కారణాలన్నిటినీ గుర్తించటం వల్ల విజయనగర రాజుల చిత్రలేఖనా కళాభిరుచికి తార్కాణంగా, వారి ఆధ్వర్యంలో ఆ కళ సాధించిన ప్రగతి, వున్నతి, విశ్లేషణాత్మకంగా పరిశీలించటం ప్రస్తుత వ్యాసపరిధిగా పెట్టుకోవటం జరిగింది. ఆ దృష్టిలోనే విజయనగర రాజుల కళాసక్తికి సంబంధించిన విషయాలు ఆకాలంలో రచించబడిన గ్రంథాల్లోంచి, ఆ కాలంలో విజయనగర సామ్రాజ్యాన్ని దర్శించిన విదేశీ యాత్రీకుల పుస్తకాల్లోంచి కొన్ని పరిశీలనకు తీసుకోవటం వల్ల క్షుణ్ణంగా గ్రహించగలుగుతాం.

## దేశ, విదేశీ రచనలు :

శ్రీ కృష్ణదేవరాయలు రచించిన ఆముక్త మాల్యదలోని మొదటి ఆశ్వాసంలో విల్లిబుత్తూరుపట్టణం గురించి వివరణవుంది. ఇతని ప్రకారం పట్టణ కోటలు చాలా పెద్దవనీ, గంభీరమైనవని, కోటలోని ద్వారబంధాలు గజలక్ష్మి చిత్రాలతో అలరారు తున్నాయనీ తెలుస్తోంది. ఈ పట్టణంలో రెండు వుత్సవ రథాలున్నాయనీ, యీ రథాలు అందమైన యువతీ యువకుల జంటల వర్ణచిత్రాలు కలిగివున్నాయనీ తెలుస్తోంది (Amuktamalyada, Madras, 1964, 1, V. 41, P. 55 V. 58). చిత్ర శాలల గురించి వసు చరిత్రలోవుంది(Vasucharitra,Madras, 1926, 1, V. 105, V.73; N. Venkataramanaiah, Studies in the Third Dynasty of Vijayanagara, Madras, 1935, p. 364). ఆ చిత్రశాలలు సముద్రమథనం, లక్ష్మి, విష్ణుల కల్యాణోత్సవం, కామంతో దహించుకోక పోతున్న శివుడు, శివపార్వతుల కల్యాణం, శ్రీరాముడు ధనుస్సు నెక్కుపెట్టుట, సీతారామ కల్యాణం మొదలైన హిందూ పురాణ గాథలతో నిండి వుండేవట.

ధూర్జటి రచించిన శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యంలో విజయ నగర వర్ణచిత్రాల గురించిన ప్రస్తావనవుంది. దీనిలో అనాటి వర్ణచిత్రాల గురించి తెలిపే చిన్న వుదాహరణ యివ్వబడింది. మాణిక్యవల్లి అనే భోగసాని తనవృత్తిని కుమార్తెలకు నేర్పడంతో ఎంతో శ్రద్ధ, జాగ్రత్త వహించింది. ఆమె రతీ-మన్మథ, రంభా-నలకూబర, ఊర్వశీ-పురూరవ, మేనకా-కౌశిక, శ్రీకృష్ణుడు - గోపికలు, ధాన్యమాలిని - రావణుడు, మత్స్యలోచన-ఋష్యశృంగ, నళినాక్షణ - పరాసర, తారా - చంద్రులు, అహల్య-ఇంద్ర, ద్రౌపతి - పాండవులు మొదలయిన శృంగార జంటల వర్ణచిత్రాలతో అందంగా, ఆకర్షణీయంగా తన యింటి గోడలను నింపి వుండేదట. సానివృత్తిలో ఎలాంటి వరుసలు, సత్సంబంధాలకు తావు లేదన్న విషయం కుమార్తెలకు బోధించడానికి మాణిక్యవల్లి యిలాంటి వర్ణచిత్రాల విషయంలో యింతశ్రద్ధ తీసుకొనిందట. పడక గదుల లోని వర్ణచిత్రాల విషయంలో మరింత శ్రద్ధ చూపి, యింకొంచెం ముందుకు పోయింది. అంటే పడకగదుల లోపలిగోడలకు వర్ణచిత్రాలుగా 84 రతి భంగిమలు వేయించిందట. దీన్నిబట్టి ఆనాడు వర్ణ చిత్రాలలో భక్తినే గాక రక్తిని కూడా ప్రదర్శించారని చెప్పవచ్చు (Sri Kala-hasthi Mahatmyam, Hyderabad, 1968, IV P. 123, V. 14, IV P. 123, V. 15).

విజయనగర ప్రభువులు స్వదేశీ పండితులనేగాక విదేశ రాయబారులను, యాత్రికులను కూడా బాగాఆదరించి అభిమానంతో చూచారు. అబ్దుల్‌రజాక్, నికోలా-డి-కాంటి-డొమింగోస్‌పేయిస్, ఫెర్నినోనూనిజ్ మొదలగు విదేశీయులు విజయనగర రాజ్యానికి రావటమేగాక కొంత కాలం ఆస్థానంలో వుండి, రాజ మర్యాదలను స్వీకరించారు. వీరి రచనలు నాటి సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాలు తెలుసు కొనేందుకు ఎంతైన తోడ్పడుతున్నాయి. డొమింగోస్‌పేయిస్, ఫెర్నినోనూనిజ్ రచనలలో నాటి విజయనగర చిత్రలేఖనల గురించి కూడా విశదీకరించి వుండటం మనం గమనించవచ్చు.

డొమింగోస్ పేయిస్ కృష్ణదేవరాయల రోజువారీ కార్యక్రమం గూర్చి ఈ విధంగా వర్ణించాడు. కృష్ణదేవరాయలు రోజూ భవనంలోని వరండాగుండా పోయేవాడు. ఆవరండాలో చాలా స్తంభాలూ, తెరలూ వున్నాయి. ఆవరండా గోడలు పూర్తిగా చిత్రాలతో నింపబడివుంది. బహుశ యిది ప్రేక్షకుల హాలు కావచ్చు. ఈ హాలు ప్రవేశద్వారానికి ప్రక్కన రెండు పెద్ద వర్ణ చిత్రాలున్నాయి. కుడిభాగంలో వున్న వర్ణచిత్రం రాజు తండ్రిది, ఎడమ భాగంలో వున్న రెండవ చిత్రం రాజుది. తండ్రి ~~(శ్రీకృష్ణదేవరాయలు)~~ చిత్రం నలుపు రంగులో వుండి, రాజు చిత్రం మాత్రం అందంగా వుంది. రాజభవనంలో పెద్ద స్తంభాల మండపముంది. ఇది చూడడానికి పెద్దహాలు లాగా వుంది. ఇక్కడి గోడలకు మనిషి జీవన విధానం తెలిపే వర్ణ చిత్రాలున్నాయి. ఇందులో సామాన్యుడి జీవితం నుంచి విదేశీరాయబారుల జీవన విధానం వరకు వున్నాయి. ఇవి ముఖ్యంగా రాణివాసం తమ రాజ్యంలోని ప్రజల జీవన విధానాన్ని తెలిసికోవడాని కుపయోగ పడతాయి అని పేయిస్ తన రచనలో అభిప్రాయపడ్డాడు (Vasundhara Fillizot, The Vijayanagara Empire, As seen by Domingos Paes and Fernao Nuniz Two 16th Century Portugues Chroniclers (Translated by Robert Sewell), New Delhi, 1977, pp. 31-32; pp. 63-64).

విజయనగర కాలంలోని సాళువ ప్రభువులేగాక అరవీడు రాజుల కూడా చిత్రలేఖనాన్ని ఆదరించిరనుటకు నిదర్శనాలున్నాయి. రెండవ వెంకట కాలంలో క్రైస్తవ వర్ణ చిత్రాలకు బాగా ఆదరణ లభించినట్లు ఫ్ర - దు - జర్రిక్ తెలిపారు. అదివరకే వున్న హిందూ పురాణ వర్ణ చిత్రాలు క్రైస్తవ వర్ణచిత్రాలకు సాటిరాలేదనీ, ఫాంటబాస అనే విదేశీ చిత్రకారుడు రాజకిష్టమైన చిత్రకారుడుగా పేరుతెచ్చుకొన్నాడనీ జర్రిక్ తన రచనలో తెల్పారు (Henry Heras, The Aravidu Dynasty of Vijayanagara, Madras, 1927, p. 486; p. 49, pp. 493 ff).

స్వదేశీ, విదేశీరచనలవలన విజయనగర ప్రభువులకు చిత్రలేఖన కళపట్లగల అభిరుచి మనకు తెలుస్తుంది. అప్పటి ఆలయాలు, రాజభవనాలు, ఆలయ వుత్సవరథాలు, సానిభవనాలు మొదలయినవి వివిధరకాల వర్ణ చిత్రాలతో నిండి వుండేవని తెలుసుకోవచ్చు. వీటి ద్వారా తెలియవచ్చే అప్పటి జీవన విధానంలోని ఎంతో ఆసక్తికరమైన అంశం ఏమిటంటె భోగసాని (వేశ్య) వర్ణచిత్రాల ద్వారా వృత్తి ధర్మాన్ని, బాధ్యతలను మరియు వివిధ శృంగార భంగిమలను తన కుమార్తెలకు నేర్పడం. విజయనగర కాలంనాటి రచనలలో గమనించదగ్గ విషయం రెండవ వెంకటకాలంలో విదేశీ వర్ణచిత్రాలే (క్రైస్తవ) కాక విదేశీ చిత్రకారులను కూడా పోషించటం.

## విజయనగర వర్ణచిత్రాలు :

దక్షిణ భారతదేశంలో చాలా విజయనగర ఆలయాల్లో వర్ణచిత్రాలు, వర్ణచిత్రావశేషాలూ మనకీనాటికీ మిగిలివున్నాయి. వీరి కాలంనాటి మొట్టమొదటి వర్ణచిత్రావశేషాలు తిరుప్పరుట్టికున్రంలోని వర్ధమాన ఆలయంలోని సంగీత మండపంలో మనం చూడవచ్చు. రెండవ బుక్కరాయల కాలంలో ఇరుగప్ప అనే మంత్రి దీనిని కట్టించాడు. ఇక్కడ మనకు కొన్ని వర్ణచిత్రావశేషాలే మిగిలినప్పటికీ యివి చాలా విలువైనవిగా భావించవచ్చు. ఇవి క్రీ. శ. 14వ శతాబ్దంలోని చివరి దశకు చెందినవి. ఇరుగప్ప జైనాభిమానికాబట్టి యిక్కడ వర్ధమానుని జీవిత గాధలు వర్ణచిత్రాలుగా చిత్రీకరించటం జరిగింది. తీర్థంకరుడు తల్లి ప్రియకామిని నివ్వడం, సౌధర్మేంద్రుడు సతి శచితో కలిసిబిడ్డకు స్నానం చేయించటం, వర్ధమానుని ముందు సౌధర్మేంద్రుడు నృత్యం చేయటం యిందు ముఖ్యమైనవి (C. Sivaramamurti, South Indian Paintings, New Delhi, 1968, pp. 103 ff). రెండవ హరిహర (క్రీ.శ. 1378–1401)కు సంబంధించిన జైన వర్ణచిత్రాలు కాంచీపురానికి దగ్గరలోవున్న జినకంచిలో వున్నాయి.

హంపీలోని విరూపాక్షాలయాన్ని విజయనగర కాలపు ఆలయాల లోని మచ్చు తునకలలో వొక్కటిగా చెప్పవచ్చు. ఇక్కడి రంగమండ పంలోని పైకప్పుమీద క్రీ.శ. 15వ శతాబ్దంలోని చివరి భాగానికి సంబం ధించిన అందమైన వర్ణ చిత్రాలున్నాయి. విజయనగర ప్రభువుల గురు వగుస్వామి విద్యారణ్యుని పూరేగింపు, అర్జునుని విలు విద్యాపాండిత్యం, రాముడు శివధనుస్సు నెక్కుపెట్టుట, సీతారాముల కల్యాణం, విష్ణు అవ తారాలు, శివుని అవతారాలయిన మధురాంతక, త్రిపురాంతక మూర్తులు, దిక్పాలురు మొదలయిన వర్ణచిత్రాలు రంగ మండపంలో కన్పిస్తాయి. విద్యారణ్యుని పూరేగింపు చిత్రాన్ని గొప్ప వర్ణ చిత్రంగా చెప్పవచ్చు. ఇక్కడ విద్యారణ్యుడు పల్లకి మీద రావటం చూపబడినది. దీని వెనుక భాగాన చాలా మంది అనుచరులు, ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, వాయిద్య గాళ్ళతో పెద్దపూరేగింపు రావటాన్ని అందంగా చిత్రీకరించారు.

## లేపాక్షి :

లేపాక్షిలోని వీరభద్రస్వామి ఆలయాన్ని విజయనగర వర్ణ చిత్రాలకు నిజమైన ప్రదర్శనశాలగా చెప్పవచ్చు. ఇక్కడున్న వర్ణ చిత్రాలు 16వ శతాబ్దానికి సంబంధించినవి. ఈ ఆలయ అర్ధమండపంలో, నాట్య మండపంలో చాలాఅందమైన వర్ణచిత్రాలున్నాయి (ఫోటోలు. 24 25, 26, 27, 28, 29, 30). ఈ రెండు మండపాల్లోని వర్ణచిత్రాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే అర్ధ మండపంలోని వర్ణచిత్రాలు నాట్య మండపం లోని వర్ణచిత్రాలకంటె ముందు చిత్రీకరించబడినవని తెలుసుకోవచ్చు. ఈ అర్ధమండపంలోని వర్ణచిత్రాలు వొక గొప్ప చిత్రకారుని ప్రతిభకు, కృషికి నిదర్శనంగా వున్నాయి. అర్ధమండంలో మార్కండేయానుగ్రహ మూర్తి, అంధకాసుర సంహారమూర్తి, దక్షిణామూర్తి, చండేశానుగ్రహ మూర్తి, భిక్షాటనమూర్తి, హరిహరమూర్తి, వృషభారూఢమూర్తి మొద లగు చిత్రాలు ముఖ్యమైనవి (ఫోటోలు. 24, 26, 28). నాట్య మండ పంలో రామాయణ మహాభారత పురాణగాథల చిత్రాలు, శివపార్వతుల

కల్యాణం, గంగాధరమూర్తి, అర్జునుని ధనుర్విద్య, బాలకృష్ణుడు వటపత్రశాయిగా, కిరాతార్జునీయం, మనునీతి కొండచోళుని నీతికథ మరెన్నో వర్ణచిత్రాలున్నాయి.

ఇదివరకే కొందరు చరిత్రకారులు లేపాక్షి వర్ణచిత్రాల బహిర్వర్ణనల గురించి వివరించారు (P. Sreenivasachar, Vijayanagara Paintings-Lepakshi, Hyderabad, 1956; V. Kameswara Rao, The Lepakshi Temple, Tirupati, 1982; A. Gopala Rao, Lepakshi, Hyderabad, 1970; Vijaya nagara Sexcentenary Commemorative Volume, Dharwar, 1936). But a Beginning was made by S.G.K. Murthi (The Art of Lepakshi, Hyderabad), and R. N Saletore (Vijayanagara Art, New Delhi, 1982) to Study the Meterial Culture Depicted in the Vijayanagara Paintings). కాబట్టి యీ అధ్యాయంలో కొన్ని ముఖ్య చిత్రాలను క్లుప్తంగా వివరిస్తూ, నాటి వర్ణచిత్రాలలో చిత్రకారులుపయోగించిన సాంకేతిక పద్ధతులు, విజయనగర వర్ణచిత్రరీతులు, ఆ వర్ణచిత్రాలలో ప్రతిబింబించే ఆనాటి సంస్కృతీ నాగరికతలు మొదలగు అంశాలను లోతుగా, విశ్లేషణాత్మకంగా అధ్యయనం చేయడానికి ప్రయత్నం చేయడం జరిగింది.

అర్ధ మండపంలో శివుని అవతారాలకు సంబంధించిన వర్ణచిత్రాలున్నాయి. ఇందు మొదటి చిత్రం మార్కండేయానుగ్రహమూర్తి. ఈ చిత్రంలో లింగం వేదిక మీదున్నట్లుగా, లింగం పైభాగం నుండి శివుడు బయటకు వచ్చినట్లుగా చూపబడింది. పరశు, అగ్నిజ్వాలలు పై చేతులలో కలిగివుండి, క్రిందిచేతులు అభయ, వరదముద్రలలోవున్నాయి. లింగం చుట్టూ భక్తులను కూడా చిత్రించారు. ఈ చిత్రాన్ని కొందరు చరిత్రకారులు లింగోద్భవ మూర్తిగా వర్ణించారు (P. Sreenivasa char, Vijayanara Paintings (Lepakshi), Hyderabad, 1956, p. 45; V. Kameswara Rao, The Lepakshi

Temple, Pl. XXXI, p. 54). తర్వాతిచిత్రం అంధకాసురసంహార మూర్తి. ఇక్కడ శివుడు అంధకాసురునిమీద నిలబడివుండి, నాలుగుచేతులు కలిగివున్నాడు. పై చేతులతో పరశు, అగ్నిజ్వాలలు కలిగివుండి క్రింది చేతులతో త్రిశూలాన్ని అసురునిశరీరంలోకి దించుతున్నట్లు చూపబడింది. శివుడు పులిచర్మాన్ని దుస్తుయిగా ధరించివున్నాడు. స్వామి కిరుపైపురా భక్తులున్నారు. చండేశానుగ్రహమూర్తి చిత్రంలో క్రింది కుడిచేతిలో వున్న పరశును చండేశకు యిస్తున్నట్లుగా, చండేశుడు ముందుకు వంగి భక్తితో శివుడిస్తున్న పరశుస్వీకరిస్తున్నట్లూ చిత్రించబడివుంది. దక్షిణామూర్తిగా కొండపైన చెట్టుక్రింద వీరాసనంలో కూర్చొని పెద్దలకు చదువునేర్పిస్తున్నట్లు చూపబడింది (ఫోటో. 28). హరిహర లేదా 'హర్యర్ధమూర్తి' చిత్రంలో వొకే శరీరంలో కుడిభాగం శివుణ్ని, ఎడమ భాగం విష్ణువును చూపించారు. శివుని నుదుట మూడవకన్ను, వొక చేతిలో పరశు, మరొక చేయి అభయముద్రలో వున్నాయి. విష్ణువుకు మూడవకన్ను లేదు. వొకచేతిలో శంఖం, మరొకచేయి వరదముద్రలో వుంది (ఫోటో. 26). కుడి అర్ధభాగం శివుడు, ఎడమువైపు అర్ధభాగంలో పార్వతి వుండే అర్ధనారీశ్వర చిత్రంలో శివుని వొకచేతిలో పరశు, మరొకచేయి అభయ ముద్రలోకలదు. పార్వతి వొకచేతిలో పద్మం కలిగియుండి మరొకచేయి వరదముద్రలో వుంది. ఎడమభాగాన గుండ్రని వక్షోజం చూపబడింది. వృషభారూఢమూర్తి చిత్రంలో ఆది దంపతులయిన శివపార్వతులను ఎద్దుమీద కూర్చొనివున్నట్లు చూపబడింది. భిక్షాటనమూర్తి చిత్రంలో శివుడు త్రిభంగాకృతిలో చూపబడ్డాడు. స్వామికి ఎడమవైపున నల్లటి మరుగుజ్జు భిక్షపాత్రలో వున్నాడు. కుడివైపున స్త్రీ భిక్షపాత్రలో బియ్యం పోస్తున్నట్లుగా చిత్రీకరించబడింది (ఫోటో. 21). కల్యాణసుందరమూర్తి చిత్రంలో శివపార్వతులతోపాటు బ్రహ్మ, నంది, విష్ణు, దిక్పాలురు వున్నారు. పెళ్ళిమండపం అరటిచెట్లతో అలంకరించబడినట్లుగా చిత్రకారుడు అపూర్వంగా చిత్రీకరించాడు. భుజంగ లలిత భంగిమలో నటరాజ చిత్రంకలదు. మూడుకన్నులు, నాలుగు చేతులతో స్వామి చిత్రాన్ని చూపబడింది.

లేపాక్షి వీరభద్రాలయంలోని నాట్య మండపం యొక్క వితానం వర్ణచిత్రాలతో నిండివుంది. అందుముఖ్యమైన చిత్రాలను యీ క్రింద వివరించాము. అర్జునుని మత్స్యయంత్రచ్ఛేదన చిత్రంలో ద్రుపదమహారాజు పెద్దపీట (సింహాసనం) మీద కూర్చొని వున్నాడు. ద్రౌపతి తండ్రి తొడమీద కూర్చొనివుంది. అర్జునుడు ఎడమకాలుమీద నిలుచొని కుడి కాలు కొద్దిగావంచి చేతులకు శక్తిని చేకూర్చుకొని బాణాన్ని వదిలేటట్లు చూపబడింది. చేప వుండాల్సిన చోటగాక మరొకచోట చిత్రీకరించటం గమనిస్తే అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించినట్లు తెలుస్తూవుంది. అర్జునుని ప్రక్కన వొక నల్లని మానవాకారంవుంది. ఇది బహుశ శ్రీ కృష్ణుని చిత్రంకావచ్చు. ఇంకొక చిత్రంలో బాలగోపాలుడు వటపత్ర శాయిగా చిత్రీకరించబడి వున్నాడు. కృష్ణుని పత్రిఆకుల మీద పరుండ బెట్టినట్లుంది. కృష్ణుడు తన కుడిచేతిలో ఎడిమకాలిని నోటిలోకి తీసు కొన్నట్లు చాలా జాగ్రత్తగా చిత్రీకరించటం జరిగింది. దీని ప్రక్కన శిథిలావస్థలోవున్న వీరభద్రుని చిత్రంవుంది. తర్వాతి చిత్రం పార్వతి అలంకరణ. ఈమె ధరించినచీర అందమైన డిజైన్లతో చిత్రించబడివుంది. జడ చాలా పొడవుగా చూపబడింది. వెనుక భాగాన పరిచారిక జను లున్నారు (ఫోటో. 25). ఇంకా దక్షిణామూర్తి, నటరాజ చిత్రాలు కూడా వున్నాయి.

కిరాతార్జునీయకథ శిల్పాలలోనేగాక వర్ణచిత్రాలలో కూడావుంది (ఫోటో. 27) అర్జునుని తపస్సు కోసం ఇంద్రకీల పర్వతానికి పంప వలసిందిగా వ్యాసమహర్షి ధర్మరాజుకు సలహాయిచ్చే వర్ణచిత్రం నుండి కిరాతార్జునీయ కథ మొదలౌతుంది. ప్రక్క చిత్రంలో అర్జునుడు ధర్మ రాజు దగ్గరనుండి వీడ్కోలు తీసికోవటం. మూడవ చిత్రంలో యింద్ర కీలపర్వతంలో అర్జునుడు శివలింగాన్ని పూజించటం వుంది. ఇక్కడ చిత్రకారుడు పర్వతాలను చాలా నైపుణ్యంగా చిత్రీకరించాడు. ఇంకో చిత్రంలో శివుడు భైరవమూర్తిగా అర్జునునికి దర్శనమిస్తాడు. ఈ స్వామికి నాలుగు చేతులున్నాయి. పై చేతులలో త్రిశూలం, ఢమరు,

క్రింద చేతులలో కత్తి, ఒక గుండ్రని వస్తువు వున్నాయి. శివుణ్ని చాలావరకునగ్నంగా చూపటంజరిగింది. మెడలో కపాలముంది. తర్వాత యింద్రుడు కొంతమంది అందగత్తెలను యింక్రీలను పంపించి అర్జునుని వ్రతభంగం చేయడానికి ప్రయత్నిస్తారు. కానీ అర్జునుడు తపస్సులోనిమగ్నమైనట్లుగా తర్వాతి చిత్రం తెలుపుతుంది. ఇంద్రునిజిత్తులు అర్జునుని కదిలించక పోవటంతో అర్జునుని భక్తికిమెచ్చి ఇంద్రుడు దర్శనమిస్తాడు. అర్జునుడు తపస్సునుండి తేరుకొని కళ్ళుతెరచి ఇంద్రుని చూచినట్లుంది. ఇక్కడ అర్జునుడు నిలుచున్నట్లు చూపించారు. వీరిప్రక్కన పుష్పక విమానముంది. తర్వాతి చిత్రంలో అర్జునుడు మరలా తపస్సులో నిమగ్నమైనట్లు చూపబడింది. ఇందుకు నిదర్శనంగా చిత్రకారుడు అర్జునుని శరీరంమీద, శిరస్సుమీద సర్పాలు పారాడునట్లు చూపించాడు. అర్జునుని ఘోర తపస్సుకు నిదర్శనంగా సర్పాలను చిత్రించటం గమనించదగ్గది. ప్రక్కచిత్రంలో ఆదిదంపతులయిన శివపార్వతులు మారువేషంలో కిరాత దంపతులుగావటం చిత్రీకరించడింది. పంది (వరాహం)భయంతో అడవిలో పరుగెత్తునట్లు ప్రక్కచిత్రంలో చూపబడింది. అప్పుడుకొందరు ఋషులు భయభ్రాంతులై, ప్రాణరక్షణకై పరుగెత్తే దృశ్యం చాలా వాస్తవంగా చిత్రించటం జరిగింది. తర్వాత చిత్రాలలో కిరాతార్జునుల పోరాటం, అర్జునుడు క్రిందపడిపోయి కిరాతుని (శివుడు) చేతిలో ఓడిపోయినట్లుగా చూపబడింది. చివరగా అర్జునుడు వినయంగా చేతుల జోడించి ఆదిదంపతులకు అంజలి ఘటిస్తున్నట్లు, తర్వాత చేతులుచాచి శివపార్వతుల నుండి పాశుపతాస్త్రాన్ని భక్తితోస్వీకరిస్తున్నట్లు, శివపార్వతులు నందిపై కూర్చొన్నట్లూ చూపబడింది. ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సిన విషయమేమిటంటె చిత్రకారుడు తనప్రతిభతో ప్రేక్షకుల దృష్టినాకట్టు కొనునట్లుగా యీకథను వరుసగా చిత్ర రచన చేయుటం.

నాట్య మండపంలోని వర్ణచిత్రాలలో మనుచోళుని భక్తి ప్రపత్తులకు, నీతికి నిదర్శనంగా చెప్పేకథను అందంగా చూపించటం జరిగింది. మనునీతికొండ చోళునికథ గురించి యీవిధంగా చెప్తారు. మనుచోళుడు

గొప్పరాజు, అంతకన్నా గొప్పన్యాయ నిర్ణేతఅనిచెప్పవచ్చు. న్యాయం కోసం రాత్రింబవళ్ళు ఎప్పుడయినా రాజుగారి దగ్గరకు పోవచ్చు. అందు కోసం కోటముందు పెద్దగంట వుంటుంది. ఈ గంటను మ్రోగించి ఏ సమయంలోనైనా రాజు దర్శనంచేసుకొని బాధలు మొరపెట్టుకోవచ్చు. ఒకానొకరోజు కోటముందున్న గంటమ్రోగడంతో రాజు బయటకు వచ్చి చూడగా ఆగంటదగ్గర వొకఆవునిలుచొని వుంటుంది. విషయమేమిటంటె ఆవుయొక్క చిన్నదూడ యువరాజు రథచక్రాలక్రిందపడి మరణిస్తుంది. అందువలన ఆవు న్యాయంకోసం రాజుదగ్గరకు వస్తుంది. ఆవు దీనగాథ విన్నరాజు యువరాజును కూడా అదే రథచక్రాల క్రింద (ఆ ఆవు దూడను త్రొక్కించినట్లే) త్రొక్కించ వలసిందిగా నిష్పక్షపాతంగా ఆజ్ఞా పిస్తాడు. తన, మన అనే విచక్షణ లేకుండా న్యాయం చెప్పడంలో చివ రకు తన కుమారుడనికూడా సంశయింపక శిక్ష విధిస్తాడు. అప్పుడుశివుడు ప్రత్యక్షమై రాజు గొప్పతనాన్ని మెచ్చుకొని దర్శనమిచ్చి ఆవుదూడను, యువరాజును బ్రతికిస్తాడు (V. Kameswara Rao, The Lepakshi Temple, pp. 49 ff. పి. కృష్ణమూర్తి, రాయలసీమ లోని ముఖ్య దేవాలయాలు, P. 83).

పై కథ ఆధారంగా విజయనగర చిత్రకారులు చాలాఅందంగా చిత్ర రచనచేశారు. మొదటి దృశ్యంలో పెద్దకోటను చిత్రించారు. అందు స్తంభాల మండపం మొదలయినవి అతి జాగ్రత్తగా చిత్రించారు. ఇంకా యువరాజు రథచక్రాల క్రింద దూడపడి చనిపోవటం, ఆవు న్యాయం కోసం గంటదగ్గర వుండటం, కిరీటంతో మనుచోళుని, తర్వాత యువ రాజుని రథచక్రాలక్రింద చూపటం, చివరంగా శివపార్వతులను సందిమీద చూపటం, వీరిముందు చచ్చి బ్రతికిన దూడ, యువరాజు అంజలిఘోసు, ప్రక్కన మనుచోళుని చూపటం జరిగింది. కథలో వర్ణించినట్లే చిత్ర కారుడు యీ వర్ణచిత్రాలను సమగ్రంగా తీర్చిదిద్దాడు.

పైన తెలిపినవే గాకుండ నాట్య మండపంలోని వొక వర్ణచిత్రం చాలా శిథిలమైవుంది. అందులో శివపార్వతులతో బాటు నారద, భృంగి,

సంగిదేసుడు, బ్రహ్మ నిలుచొని వున్నారు. ఇంకొక వర్ణ చిత్రంలో శివపార్వతులు చదరంగం ఆడుతున్నట్లు చిత్రీకరించబడింది.

వీరభద్రస్వామి ఆలయ ప్రాంగణంలో విష్ణు మందిరం కలదు. దీని ముఖ మండప వితానం విష్ణు అవతారాలకు సంబంధించిన వర్ణ చిత్రాలను కలిగివుంది. శయనాగారంలోని వితానం కూడా వర్ణచిత్రాలను కలిగివుంది. తర్వాత చెప్పుకోదగ్గది వీరభద్రుని వర్ణచిత్రం. వీరభద్రుని గర్భగుడికి ముందున్న మండపంలో వీరభద్రస్వామి చిత్రంకలదు. ఇది సుమారు 25 అడుగుల పొడవు, 14 అడుగుల వెడల్పు వుంటుంది. ఈ చిత్రానికి కుడిప్రైపున (క్రిందిభాగంలో) విరూపణ్ణ, ఎడమ భాగాన విరూపణ్ణ భార్య చిత్రాలున్నాయి. ఇలాంటి గొప్ప చిత్రాలు భారతదేశంలో చాలా అరుదుగా కనిపిస్తాయి.

16వ శతాబ్దానికి సంబంధించిన విజయనగర వర్ణచిత్రాలు సోం పాలెంలోని చెన్నకేశవాలయంలో వున్నాయి. ఇవి చాలా వరకు శిథిలమై వున్నాయి. ఇక్కడ ముఖ్యంగా రామాయణ గాథ చిత్రాలున్నాయి. రాముడు తాటకిని వధించటం, దశరథుడు కైకేయిని ఓదార్చటం, యింకారాజులు, వాయిద్య బృందం మొదలయిన చిత్రాలున్నాయి. ఇక్కడున్న చిత్రాలు లేపాక్షి అర్థ మండపంలోని చిత్రాలతో పోల్చదగినవిగా వున్నాయి.

కదిరి లక్ష్మీనరసింహస్వామి ఆలయంలోని మహా మండపంలో కూడా విజయనగర కాలంనాటి వర్ణచిత్రాలున్నాయి. కానీ యివి చాలా వరకు శిథిలమయ్యాయి.

16వ శతాబ్దం మూడవభాగానికి సంబంధించిన విజయనగర చిత్రాలు అనెగొందిలోని వుచ్చియ్యప్ప మఠంలో వున్నాయి. ఇక్కడి ఆసక్తికరమైన విషయమేమిటంటే ఆడవారు పల్లకీ మోస్తున్నట్లు చూపడం. నాడు అంతఃపురములో స్త్రీలను ఎలా వుపయోగించుకొనేవారో

తెలుస్తుంది. దక్షిణ భారతదేశంలోని నాయకరాజుల మంటపాలలోని స్తంభాల మీద స్త్రీ యమునరాణిను భుజాలమీద వుంచుకొనినట్లు చూప బడింది.

కంచి వరదరాజ స్వామి ఆలయంలో కూడా విజయనగర కాలం వర్ణచిత్రాలున్నాయి. ఆండళ్ పూంజల మండపంలోని పై కప్పులో కొన్ని చిత్రాలున్నాయి. గోపికా వస్త్రాపహరణ, కాళీయమర్దన, విష్ణు, లక్ష్మి, విద్యాధరులు, రతీమన్మధులు, గరుడ, దేవతలు మొదలయిన చిత్రాలున్నాయి. ఇవి క్రీ. శ. 16వ శతాబ్ద చివరి భాగానికి చెందినవి.

ఇక విజయనగర రాజుల చివరి దశకు చెందినచిత్రాలు కంచిలోని వరదరాజస్వామి ఆలయంలో చూడవచ్చు. ఇవి 17వ శతాబ్దానికి చెంది నవి. ఇక్కడ విష్ణుమూర్తి గరుడ వాహనంపై వున్నాడు. పైన పెద్ద గొడుగు వుంది, ప్రక్కన వింజామరలతో భక్తులు చూపబడ్డారు. దీనికి దగ్గరగా విష్ణు, లక్ష్మి చిత్రాలున్నాయి. ఇక్కడి చిత్రాలు క్షీణదశను సూచిస్తున్నాయి.

వాస్తవానికి తళ్ళికోట యుద్ధంలో విజయనగర సామ్రాజ్యం రాజ కీయంగాను, సాంఘిక, సాంస్కృతిక పరంగాను పూర్తిగా దెబ్బతినింది. అంత ఘనకీర్తిని గడించిన సామ్రాజ్యం వొక్కసారిగా ఇస్లాం సముద్రం లోనికి త్రోసివేయబడింది. ఒకప్పుడు సామంతులుగా నున్న నాయక రాజుల కూడా స్వతంత్రులయ్యారు. వీరిలో తిరుమల నాయక, రఘు నాథ నాయకులు ప్రధానమైన వాళ్ళు. వీరికాలంలో కూడా కళ అభివృద్ధి చెందింది. వీరు కూడా చిత్రలేఖనాన్ని ఆదరించటంలో విజయనగర ప్రభువుల ననుసరించారు. తిరుప్పరుట్టికుడ్రం, తంజావూర్, తిరువాళూర్, చిదంబరం, తిరువాలంజులి మొదలయిన ప్రదేశాలలో నాయకరాజులనాటి చిత్రలేఖనాన్ని మనం చూడవచ్చు.

## సాంకేతిక పద్ధతులు :

ఈ విభాగంలో విజయనగర వర్ణచిత్రాల నుపయోగించిన సాంకేతిక పద్ధతులను గురించి వివరింపబడింది. లేపాక్షిలోను మిగిలిన విజయనగర ఆలయాల్లోనూ లభించిన కొన్ని నమూనాలను సునిశితంగా శాస్త్ర పరిశోధన చేసినందువల్ల చాలా ఆసక్తికరమైన విషయాలు తెలిశాయి. వర్ణచిత్రాలను వేసేందుకు కావలసిన రకంగా గోడలను, పైకప్పును తయారు చేసికొనటం, రంగులు బాగా పట్టుకొనేలా ఆ ప్రదేశాన్ని సిద్ధం చేసుకోవటం, చిత్రలేఖనంలో వాడిన పరికరాల వివరణ మొదలయిన అంశాలిక్కడ చర్చించబడ్డాయి.

విజయనగర ఆలయాలలోని వర్ణ చిత్రాలు పై కప్పుకు మాత్రం వున్నాయి. కానీ లేపాక్షిలో పై కప్పుకు, గోడలకు మాత్రం వున్నాయి. కానీ లేపాక్షిలో మాత్రం పై కప్పుకు, గోడలకు కూడా చిత్రాలున్నాయి. ఇక్కడ చిత్రలేఖనం చేయటానికి గోడలనుగానీ, పై కప్పును గానీ ఎలా తయారు చేశారో ముందుగా మనం గుర్తించాల్సి వుంటుంది. ఒక చరిత్రకారుని అభిప్రాయం ప్రకారం - లోపలనున్న రాతిని రాతిరోల్లర్లతో నున్నగా చేసెడివారు (V. Kameswara Rao, The Lepakshi Temple, p. 37). కానీ లోపలి రాయిని నునుపు చేయలేదని, రాతిరోల్లర్ల నుపయోగించలేదని మనం తరచి పరిశీలిస్తే తెలుస్తుంది. కాబట్టి విజయనగర చిత్రకారులు పై భాగానికి లోపలనున్న భాగాన్ని గరుకుగానే వదిలివేశారని విదితమవుతుంది. ఇక్కడ మనం గమనించాల్సిన విషయమేమిటంటె అజంతా, ఎల్లోరాలలో కూడ లోపలి భాగాన్ని యిలాగే గరుగ్గా వదిలిపెట్టారు (S. Paramasivan, Annual Reports of the Hyderabad Archaeological Department, 1936—37, p. 26, p. 3?). దీనిని బట్టి విజయనగర చిత్రకారులు వర్ణచిత్రాల కనుగుణంగా నేలనుతిర్చిదిద్దుకోవటంలో పూర్వీకుల ననుసరించినట్లు తెలుస్తుంది.

ఏర్నాక పై భాగాన్ని అంటే లోపల గరుకుగా వున్నరాతిమీద గార చేసి గచ్చువేస్తారు. లేపాక్షిలోని గార లేక గచ్చును సూక్ష్మంగా పరిశీలించి చూస్తే మూడు పొరలుగా కనిపిస్తుంది. క్రిందపొర కొంచెం ముదరకగా వుండి, పై పొర చాలా సన్నగా రంగువేసినట్లుంది. ముతక నుండి సన్నగా వున్న పై పొరను వేరుచేయ లేనంత గట్టిగావుండి పొక్కుటిగా ఏర్పడి వుంటుంది. క్రిందనున్న పొరకన్నా పై రెండు పొరలు చాలా సన్నగా, పలుచగా వున్నాయి. లోపలిపొరనున్న గరుకు గారలో కూరగాయపీచు వాడినట్లు తెలుస్తుంది లేపాక్షి, హంపీ, సోంపాలెంలలో గరుకుగార 3.5 మి.మీ. నుండి 12 మి.మీ. వరకుంది. ఇలాంటి గరుకుగార వివిధ కాలాల్లో పరిశీలిస్తే సిత్తన్నవాసల్, కాంచీపురం ఆలయాలలో దీని మందం 1.4 మి. మీ. నుండి 4మి. మీ. వరకు తంజావూర్ విజయాలయచోళేశ్వరాలయంలో 1.7 మి.మీ నుండి 5 మి.మీ. వరకు వున్నట్లు తెలియవస్తుంది. అజంతా గుహలలో దీని మందం 5.1 మి.మీ. నుండి 7.3 మి.మీ. వరకువుంది (S. Paramasivan, Indian wall Paintings, Journal of Madras University, XII, No. 1, 1940, p. 100).

మధ్యలో వున్న సన్నటిగార కొలవటం చాలా కష్టం. కానీ కొంతమంది పరిశోధకులు (S. Paramasivan) అతికష్టంమీద గరుకు గార నుండి సన్నటి గారను విడగొట్టి చాలా పరీక్షలు చేసి దీని మందం 0.1 మి.మీ. నుండి 0.4 మి.మీ. వరకు వున్నట్లు కనిపెట్టారు. ఇది చాలా సన్నగా వుంటుంది. సన్నగా చేసేందుకు రోల్లర్లను వాడినట్లు తెలుస్తుంది. ఇది చాలా వరకు ఎల్లోరాలోని పై భాగాన్ని పోలివుంది. ఇక పై సున్న రంగుపూత లేపాక్షి, హంపీ, సోంపాలెంలలో 0.3 మి.మీ నుండి 0.5మి.మీ. వరకుంది. ఇదేపూత అజంతాలో 0.1మి.మీ. వుంది, ఎల్లోరాలో 0.3మి.మీ. నుండి 0.6మి.మీ. వరకు మందాన్ని కలిగివుంది (Journal of Madras University, Vol XII, p. 103; Annual Reports of the Hyderabad, Archaeological Department, 1936-37, p. 26, p. 32). కాబట్టి పైనవున్న

రంగుపూత అజంతాకంటె, ఎల్లోరా, లేపాక్షి, హంపి, సోంపాలెంలలో మందంగావుందని తెలుస్తోంది. ఇక్కడ ప్రధానంగా కనిపించేది చిత్ర కారుని ప్రతిభ. అజంతా చిత్రకారులు మిగిలిన కాలంలోని చిత్రకారుల కంటే తెలివైన వారుగా, పరిశీలనా జ్ఞానం కలిగిన వారుగాను మనం గుర్తించవచ్చు. వారి నైపుణ్యమంతా వీరొక సంతత పలచగా చేయుటంలోనే కనబరచేవారని తెలుస్తోంది.

పైన కనబరచిన విధంగా పై భాగానున్న మూడుపొరలు (గరుకు గార, నున్నటి గార, రంగుపూత) వొకదానినుండి మరొకటి వేరు చేయ టం కష్టమని తెలుసుకొన్నాం. కానీ ఆకాలంలో అని అంత గట్టిగా విడి పోకుండా వుండేందుకు ప్రత్యేకంగా ఎలాంటి జిగురుగానీ, అతుక్కొనే నూనెలుగానీ వాడినట్లు కనబడకపోవటం చాలాఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. వారు వుపయోగించిన సున్నం, కూరగాయల పీచువల్లనే యింత గట్టిగా యివి వొకపై వున్నాయి. కానీ అజంతాలో మాత్రం వొక రకమైన జిగురు పదార్థంవాడినట్లు తెలుస్తుంది (Annual Reports of the Hyderabad Archaeological Department, 1936 - 37 p. 30). చాలా పరిమితమైన సాంకేతిక సాధనా సంపత్తితోనే విజయ నగర కాలంనాటి చిత్రకారులు వర్ణ చిత్రలేఖనానికవసరమైన వేదికను నిర్మించుకోవడం వారి ప్రజ్ఞను సూచిస్తుంది.

లేపాక్షిలోని రంగులను గమనిస్తే చాలావరకు తక్కువ రంగు లను వాడినట్లు తెలుస్తుంది. చుట్టుప్రక్కల లభించేవీ వర్ణచిత్ర వేదికకు అనుకూలంగా వుండేవి మాత్రం వాడినట్లు తెలుస్తూవుంది. అవిముఖ్యంగా పసుపుకావిరంగు, ఎరుపుకావిరంగు, సింధూర వర్ణం, సున్నం, బొగ్గు లతో మెరిసే వివిధ రకాల ఛాయలు, బంగారాన్ని కూడా రంగులలో కలిపినట్లుగా లేపాక్షిలోని వర్ణచిత్రాలను గమనిస్తే తెలుస్తుంది. బంగారు పూతను ప్రధానంగా ధోతి, చీరల అంచులను వేసేందుకు వాడారు.

లేపాక్షి వీరభద్రాలయంలోని తులాభార మండపానికి ముందరి భాగాన వరుసగా కొన్ని గుంతల లాంటివి రాతిలో మలచబడివున్నాయి.

ఒహుశయిది అకాలంలో రంగులు మిశ్రమం చేసుకొనేందుకు వాడిఉండి వచ్చని ఊహించవచ్చు.

## విజయనగర వర్ణచిత్ర రీతులు :

సాధారణంగా విజయనగర వర్ణచిత్రాలు చతురస్రంగాను, వెడల్పు కంటేఎక్కువ నిడివిగాను, యిటుకులవలె నిలువుగానువుంటాయి. లేపాక్షి, సోంపాలెంలలో వర్ణచిత్రాలు చతురస్రంగాను, పొడవైన యిటుకులవలె నిలువుగాను వున్నాయి. ఈ చిత్రాలచుట్టూ అంచులున్నాయి. అంచులలో గుండ్రని ఆకారంగల గుర్తులు, పక్షులు, పుష్ప గుర్తులు, వాయిద్య సంబంధమైన గుర్తులు మొదలయినవి వున్నాయి (ఫోటోలు. 24, 25, 26, 27). ఇలాంటి గుర్తులు పశ్చిమ దేశంలోని చిత్రలేఖనంలో వుండటం మనం గమనించవచ్చు. బహుశ విజయనగర చిత్రకారులు యీఅంచుల విషయంలోను, ఆకారాల విషయంలోను పశ్చిమ భారతదేశంలోని చిత్రలేఖనాన్ని అనుసరించి వుండవచ్చు.

మానవాకారాల్ని చిత్రించటంలో అర్థముఖంమరుగైనట్లు, కోణాలు కలిగి, నాశికం, గడ్డం మొనదేలి వుండుట మున్నగునవి విజయనగర కాలపు వర్ణచిత్రలక్షణాలు. ఇంతేగాక ముడుచుకొని పోయిన చెంపలు, ఖాళీ స్థలంలో బయటకు తోసుకొని వచ్చినట్లుగా వొక ప్రక్క కన్ను చూపబడి వుంటుంది. ఈ లక్షణాలు ముఖ్యంగా లేపాక్షి వీరభద్రాలయం లోని నాట్య మంటపం పై కప్పుకు ప్రదక్షిణాపథమున్నచోట్ల గమనించ వచ్చు.(ఫోటో. 25; చిత్రం. II). పై లక్షణాలన్నీ విజయనగర చిత్ర కారుల నూతన సృష్టికాదను విషయం మనం గమనించవచ్చు. పశ్చిమ దేశంలోని జైన చిత్రాలను పరిశీలిస్తే యిది విదితమౌతుంది.

పై లక్షణాలున్న చిత్రాలు మనకు అజంతాలో కన్పిస్తాయి. తర్వాత ఎల్లోరాలోని వివిధ కాలాలకు సంబంధించిన చిత్రాలలోనూ యీ లక్షణాలు చూడవచ్చు. మధ్యయుగానికి సంబంధించిన పంచ తంత్ర

కసలు విష్ణు ఆలయం (మదన్‌పూర్, ఉత్తరప్రదేశ్)లో వున్నాయి. దక్షిణదేశంలోని తిరుమలైలోని దిగంబర జైన్ ఆలయంలోని విజయా లయ చోళేశ్వర ఆలయంలోను యిలాంటి లక్షణాలు మనకు కనిపిస్తాయి.

లేపాక్షి వీరభద్రాలయంలోని వర్ణచిత్రాలలో ముఖ్యంగా గమ నించదగ్గది ఏమిటంటే మిగతా వర్ణచిత్రాల కంటే అర్ధ మండపంలోని చిత్రాలు సాంకేతిక పరిజ్ఞానంలోనూ, రీతిలోనూ గొప్పగా వుండటం. గుండ్రని ముఖం, భావాలను తెలియచెప్పే కన్నులు, విల్లులా వంగి వున్న కనుబొమలు, సున్నితమైన చేతివ్రేళ్ళ గోళ్ళు మొదలయిన లక్ష ణాలను అర్ధ మండపంలోని చిత్రాలలో చూడవచ్చు. ఇవి నిజంగా ఆనాటి చిత్రకారుల ప్రతిభకు, నైపుణ్యానికి, చిత్రలేఖనం మీదున్న ఆధి పత్యానికి నిదర్శనంగా వున్నాయి. ఇలాంటి లక్షణాలున్న చిత్రాలు చోళుల కాలంనాటి తంజావూర్‌లోని బృహదీశ్వరాలయంలోను, తిరువలంజులి కపర్దీశ్వరాలయంలోను చూడవచ్చు. తిరువలంజులిలోని వృషారూఢ మూర్తి వర్ణచిత్రం లేపాక్షిలోని శివుడు మనునీతి చోళుని ఆశీర్వదించే చిత్రాన్నిపోలివుండటం గమనించవచ్చు. అంతేగాక గంధర్వులు, మేఘాలు, చెట్లు, అంచులు మొదలగు విషయాలలో కూడ లేపాక్షిలోని చిత్రాలు తిరువలంజులిలోని చిత్రాలను పోలివున్నాయి.

ఏ దేశంలో అయినా, ఏ కాలంలో అయినా, శిల్పంలోగానీ, వర్ణ చిత్రాలలోగానీ మానవాకృతులకు గొప్ప ప్రాముఖ్యత, ఆదరణలభించింది. భారతదేశంలోని వర్ణచిత్రాలలో పురుషుడిని పెద్దముఖం, పెద్దభుజాలు, కాయపుష్టిగల నడుం, ఎత్తుగా, దృఢకాయంగానూ చూపించారు. ఇవవర్ణ చిత్రాలలో స్త్రీలకు గుండ్రని వక్షోజాలు, శరీరాకృతికి తగిన పిరుదులు, సన్నటి నడుం, మీనాకృతి కలిగిన కన్నులను, గజగమనం లాంటి నడ కను చూపించారు.

పై లక్షణాలు విజయనగర వర్ణచిత్రాలలోని స్త్రీ, పురుష చిత్రా లలో ఎంతవరకున్నాయో పరిశీలించి తెలుసుకొందాం. లేపాక్షిలో మానవా

కృతులకు చుట్టూ అంచులు డిజైన్లతో చిత్రించబడి వున్నాయి. చాలా వరకు నిలుచొనివుండి కొంచెం ఏటవాలుగా చూపబడినవి. అంతే అన్నీ నిలుచున్నవేకాక కొన్ని ముఖ్యంగా శివుని ఆకృతి నందిమీద, కొండ మీద, చెట్టుక్రింద, వీరాసనంలోనూ చూపబడినవి (ఫోటో. 28). నిలు చొని వున్న మానవ చిత్రాలలో గమనించదగ్గది అంజలి ఘటిస్తున్నట్లు చేతులు హృదయం దగ్గరవుంచుకొన్నట్లు, వొకచేయి తలకంటె పైకెత్తి అర్చన చేస్తున్నట్లుగా వున్నటువంటివి. వెడల్పాటి భుజాలు, కొంచెం లావుగాను, వుబ్బినట్లున్న పొత్తికడుపు, పెద్దనడుం మొదలయినవి యిక్కడ మానవ చిత్రాలలోనే గాక దేవుళ్ళ చిత్రాలలోకూడా గమనించ వచ్చు (ఫోటోలు. 26, 28). దీనినిబట్టి విజయనగర శిల్పులు పురా ణాలలో తెల్పిన లక్షణాలను పూర్తిగా ఆచరించకుండా నాటి ప్రజలజీవన విధానాలను క్షుణ్ణంగా పరిశీలించి వుత్తేజితులై వర్ణచిత్రాలలో కూడ ఆకాలరీతికనుగుణంగానే చిత్రించేవారని తెలుస్తుంది. లేపాక్షి చిత్రా లలో స్త్రీ మనోహరంగాను, ప్రీతిపాత్రంగాను చూపబడింది. చాలావరకు నిలుచొని వున్నట్లు చూపబడింది (ఫోటో. 25). అరుదుగా కూర్చొని వున్న చిత్రాలున్నాయి. పొడవుగాను, సన్నగాను, అందంగాను, సుందర మైన అలంకరణతోను, గుండ్రమైన వక్షోజాలు, అందమైన కన్నులు, గుండ్రని కనుబొమలు, కనుపాపలు గుండ్రంగాను, నల్లగాను, ముక్కు మొనదేలినట్లుగానూ లేపాక్షిలోని స్త్రీ చిత్రాలున్నాయి (చిత్రం. II). మానవ చిత్రాలను చిత్రించడంలో విజయనగర చిత్రకారులు శరీరంలోని అవయవాలకు ప్రాముఖ్యత నిచ్చారు.

భారతదేశంలోని శిల్పాలలోను, వర్ణచిత్రాలలోను జంతువులకు కూడా ముఖ్యమైన స్థానమున్నట్లు తెలుస్తుంది. ఎన్నోరకాల జంతువు లను మనం అజంతా చిత్రాలలో చూడవచ్చు. ఇవి చాలా సహజసిద్ధంగా వున్నట్లనిపిస్తాయి. అజంతాలోని చిత్రకారుడు ఎన్నో జంతువులను చూచి ఉత్తేజపడి చిత్రించినట్లనిపిస్తుందే తప్ప జంతువుల పటాలను ముందుంచుకొని చిత్రించినట్లు కనిపించదు. విజయనగర చిత్రకారులు

కూడా జంతువులను చిత్రించటంలో ఆసక్తి చూపించారు. [illegible]
గుర్రం, జింక, మకరం, పొట్టేలు, దున్నపోతు మొదలయినవి [illegible]
చిత్రాలలో కనిపిస్తాయి. ఏనుగును ఎదురుదాడిరంగులో [illegible]
పొడవుగా వంగివున్న తొండంతో, బయటకు పొడుచుకు వచ్చిన [illegible]
దంతాలలో, పెద్ద కళ్ళలో, విసనకర్రలాంటి చెవులతో చూపి-
చారు. ఏనుగులను, గుర్రాలను రథాలు లాగుతున్నట్లు [illegible]
వానికి దగ్గరగా వున్నట్లుంది. ఒంటె విద్యారణ్యస్వామి [illegible]
(హంపీ)లో చిత్రించబడింది. ఇంకాలేపాక్షిలోని చిత్రాలలో [illegible]
ఆవుదూడ, పంది, కుక్క, కోతి మొదలయిన జంతువులు [illegible]
వీటి కందరాలను చిత్రించడంలో విజయనగర చిత్రకారులు [illegible]
సాధించారు. ముఖ్యంగా ఎద్దుకొమ్ములు, మూపురం, [illegible]
గిట్టలను చిత్రించటం చాలా వాస్తవంగా కనిపిస్తాయి. ఆవు [illegible]
ఆవుకంటే చిన్నదిగా చూపేందు కోసం ఆవుకడుపు [illegible]
దూడను చూపించారు. ఇక్కడ యింకా గమనించదగ్గది [illegible]
మెడ క్రింది భాగంలో వాకరకమైన మిట్టపల్లాలుగా [illegible]
వుండటం. ఇలాంటి లక్షణాలున్న చిత్రాలను పశ్చిమ [illegible]
చిత్రలేఖనంలో చూడవచ్చు.

విజయనగర కాలంనాటి వర్ణచిత్రాలలోని పక్షులను [illegible]
చిత్రకారులు పక్షుల అలవాట్లను, వాటి శరీరాకృతులను [illegible]
త్తలో గమనించి చిత్రించినట్లు తెలుస్తుంది. హంపీ [illegible]
లోని హంసల జంటను గమనిస్తే యిది నిజమనిపిస్తుంది. [illegible]
పొడవైన మెడలు, అందమైన ముక్కులు, బాగా [illegible]
విసనకర్రలాంటి తోకలు మొదలయినవి వాస్తవానికి దగ్గరగా [illegible]
ఇంకొక వుదాహరణలో చిలుకలు ఆకర్షణీయంగా వున్నాయి. [illegible]
వీరభద్రాలయంలోని అర్ధ మండపంలో వర్ణచిత్రాల [illegible]
జంతువులను చిత్రీకరించారు. సోంపాలెంలోని వర్ణచిత్రాలలో [illegible]
లను చిత్రీకరించారు. పై విజయనగర చిత్రాలలోని జంతువులను, [illegible]

లను గమనిస్తే చిత్రకారులు వాస్తవానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చి నట్లు తెలుస్తుంది.

లేపాక్షి, హంపి, సోంపాలెంలలోని చిత్రాలను పరిశీలిస్తే యివి చాలావరకు నిజంగానే చిత్రించినట్లు తెలుస్తుంది. అందులోను వారి వ్యక్తిని చిత్రించిన చిత్రాంకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చారు. వరుసగా వారులు తీరినట్లు చూపడం చాలాఅరుదుగా కనిపిస్తుంది (ఫోటోలు. 24, 25, 26, 27, 28). చిత్రం యొక్క ఎత్తు, స్థలం చిత్రంలోని వ్యక్తి ప్రాముఖ్యతను బట్టి లేదా అవసరాన్ని బట్టి వుంటుంది. హంపి విరూపాక్షాలయంలో ఒంటెలు, ఏనుగులు మనుషులకంటె ఎత్తుగా చూపించడంతో వాస్తవాన్ని గుర్తించవచ్చు. దేవతల చిత్రాలు, ఋషులు మనుషులకంటె ఎత్తుగా చూపబడ్డారు. లేపాక్షిలోని భిక్షాటనమూర్తి, హరిహర, మనునీతికొండ చోళ, విరూపణ్ణ, వీరణ్ణ మొదలయిన వారిని చాలా ఎత్తుగా చిత్రీకరించారు. ఇలా చిత్రించటంలో ఆ ఎత్తుగావున్న చిత్రాలలోని దైవత్వం, గౌరవం, గొప్పహోదాను తెలియచేసినట్లుంది (ఫోటోలు. 21, 26).

తర్వాత చెప్పుకోదగ్గది వర్ణచిత్రాలలోని వెనుకభాగం అలంకరణ. విజయనగర కాలంలో వివిధరకాలుగా అందంగా వెనుక భాగాన్ని చిత్రించారు. కొన్నిచోట్ల వెనుకభాగాన చెట్లను చిత్రించారు. ఒక్కొక్కసారి వీటి ఆకులను గుండ్రంగా వరుసగా పూబంతిలాగా చూపటం వలన గొడుగులాగా వున్నట్లనిపిస్తుంది. శాఖలను కూడ అందంగా చిత్రించారు. ఇలాంటివే నాయకరాజుల తిరుప్పరుట్టికున్రంలోని వర్ణచిత్రాలలో వుండటం గమనించవచ్చు. పశ్చిమ భారతదేశంలోని జైనుల చిత్రాలలో యిది వాడుకలో వుండినట్లు తెలుస్తోంది. కాబట్టి వీరు ముఖ్యంగా జైనులను అనుసరించి వుండవచ్చు. లేపాక్షి వర్ణచిత్రంలోని చెట్లను గమనిస్తే చాలాసాంకేతిక పరిజ్ఞానంతోచిత్రించినట్లు తెలుస్తుంది(ఫోటోలు. 24,26,27,28). ఇక్కడ శివుడు భక్తులను ఆశీర్వదించే వర్ణచిత్రంలోని చెట్లను గమనిస్తే వాస్తవానికి ఎంతో దగ్గరగా చిత్రించినట్లనిపిస్తుంది.

చెప్లేవార అలంకరించిన వస్తువులు వ్రేలాడదీసినట్లు కనిపిస్తాయి (చిత్రం. IV–7 నుండి 13). ఎగిరే అప్సరసలు, మేఘాలు, కొంగలు, పుష్పాలు మొదలయిన వాటితో చిత్రాలలోని వెనుక భాగాన్ని అతిసుందరంగా, నేత్రపర్వంగా తీర్చిదిద్దినట్లుంటుంది. వివిధ రకాల గంటలు, పూలతోరణాలు, పద్మ రేకలు మొదలయినవి కూడా కనిపిస్తాయి. ఒక్కొక్క సారి అందంగా అలంకరించిన తోరణాలుంటాయి. ఇవి ముఖ్యంగా హంపిలో కనిపిస్తాయి. తోరణాల అలంకరణలో విజయనగర చిత్ర కారులు హొయసల కాలంలోని శిల్పకళా సాంప్రదాయాన్ని పాటించారు.

వర్ణచిత్రాలలో వాస్తును చూపించడం మరో లక్షణంగా చెప్ప వచ్చు. ఇది అజంతా వర్ణచిత్రాలలో ఎక్కువగా కనిపిస్తుంది. విజయ నగర చిత్రకారులు దీనిని పెద్దగా ఆదరించలేదు. కానీ కొన్ని వుదాహర ణలు మాత్రం మనకున్నాయి. హంపీలోని కొన్ని చిత్రాలలో మంట పాలు, శిఖరాలు చూపబడ్డాయి. లేపాక్షిలో వొక వుదాహరణలోమాత్రం మనకు వాస్తు కనిపిస్తుంది. శివుడు భక్తుల నాశీర్వదించే చిత్రంలో మండపం లేదా కోటలాంటి కొంతభాగం వెనుక కనిపిస్తుంది (చిత్రం. III). అలాగే సోంపాలెం వర్ణచిత్రంలోకూడా కోటను చూడవచ్చు.

వర్ణచిత్రాలు వేయికముందు వెనుక భాగాన్ని తయారు చేయు టంలో కూడా విజయనగర చిత్రకారులు చాలా శ్రద్ధ వహించారు. హంపీలో ఎరుపుకావిరంగు చిత్రం వెనుకభాగాన వాడబడింది. లేపాక్షిలో ముదురు, లేతరంగులు కనిపిస్తాయి. అర్ధ మండపంలోని వర్ణానికి, నాట్య మండపంలోని వర్ణానికి చాలా తేడా కనిపిస్తుంది. అర్ధ మండపంలోని చిత్రాలను గమనిస్తే రంగుల మిశ్రమం చాలా సరిసమానంగాను, మనో హరంగాను వుండి అతి జాగ్రత్తగా చిత్రించినట్లు తెలుస్తుంది. ఇలాంటి నిపుణత నాట్య మండపంలోని చిత్రాలలో లోపించినట్లుగా తెలుస్తుంది. బాధ పడవలసిన విషయమేమిటంటే వాతావరణ ప్రభావంవలన, ఆదుపు, ఆదరణ లోపించినందువలన చాలా చిత్రాల నాణ్యత లోపించి, వర్ణం

వెలిసిపోయి అసలు కనిపించటమే లేదు. అయినప్పటికీ చిత్రాల వెనుక భాగాన ముదురు లేత రంగులు కనిపిస్తున్నాయి. అవి మామూలుగా ఎరుపుకావిరంగు, పసుపురంగు, కమలారంగు, నీలిరంగులను కలిగి వున్నాయి. చిత్రాలకు ముదురు పచ్చ, నీలి, నల్లటినీలి, సాధారణ ఎరుపు, ఆకాశ నీలం, పసుపు, నేరేడు వర్ణాలలో మానవాకృతులను, జంతు జాలాలను చిత్రించారు. అలాగే బంగారు వర్ణాన్ని చీర, ధోతి, ఉత్తరీయ, ప్రభామండలాల అంచులకు వాడేవారు. ఈ విషయంలో విజయనగర చిత్రకారులు వారికున్న తెలివితేటలన్నీ వుపయోగించి ఏ రంగుకు ఏ రంగు కలుస్తుందో బాగా గుర్తించి చిత్రించారు. ముఖ్యంగా లేపాక్షిలోని వర్ణచిత్రాలలోని దుస్తులను క్షుణ్ణంగా పరిశీలిస్తే యిది విదితమవుతుంది.

## సంస్కృతీ నాగరికతలు :

మానవుడు సమూహాలుగా స్థిర నివాసం ఏర్పరచుకొని సహజీవనం ప్రారంభించినప్పటి ఆదిమ నాగరికత నుంచీ ఆధునిక కాలంవరకు నాగరికతలో ఎన్నో దశలున్నాయి. కొన్ని విశిష్టమైన నాగరికతలు నూతనంగా అవతరించి సమూలంగా అంతరించినాయి. కానీ త్రవ్వకాల మూలంగా, పురావస్తు పరిశోధనల ద్వారా వాటిని గురించిమనం తెలుసుకొంటున్నాం. అప్పటి నాగరికతకి, ఆధునిక నాగరికతకి కొన్నిఅంశాల్లో గల సాదృశ్యాలను, తారతమ్యాలను గమనించి చకితులవుతున్నాం.

మానవుని భౌతిక, ఆత్మిక జీవనానికి సంబంధించిన పలుఅంశాలు నాగరికతలో భాగాలుగానే మనం పరిశీలిస్తాం. వాస్తు, శిల్పం, చిత్రలేఖనం మొదలయిన అంశాల ద్వారా నాటిప్రజల నాగరికతను, సంస్కృతిని తెలుసుకోవచ్చు. అజంతాలోని చిత్రలేఖనం, సాంచి, గాంధార, నాగార్జునకొండ, ఎల్లోరాలలోని శిల్పాలు నాటి చరిత్రను చాటి చెప్పేందుకు ఎంతో వుపయోగపడు తున్నాయి. లేపాక్షి, హంపి, సోంపాలెం

మొదలయిన ప్రదేశాలలోని వర్ణచిత్రాలు విజయనగర కాలంనాటి సాంస్కృతిక జీవనానికి, నాగరికతకు చిహ్నాలుగా మిగిలివున్నాయి. ఈ వర్ణచిత్రాల ద్వారా నాటి దుస్తులు, కేశాలంకరణ, తలపాగాలు, టోపీలు, అలంకరణలు, పాదుకలు, వాయిద్యాలకు సంబంధించినవి, రవాణా సౌకర్యాలు, గొడుగులు, చామరలు, కుడ్యాలంకరణలు, కోటలు, గృహోపకరణాలు మొదలయిన వాటిని గూర్చి చాలా విలువైన విషయాలు తెలుస్తున్నాయి. ఈ దిగువవీటిని గూర్చి పరిశీలనాత్మకంగా వివరింపబడింది. అంతేకాకుండా యీచిత్రాలకు సంబంధించిన వివరాలను కొన్ని గ్రంథాల ఆధారంగా విశదీకరించటం జరిగింది.

**దుస్తులు :** దుస్తులు అనేవి స్థాయిని, సాంఘిక హోదాని చెప్తాయి. ఏ కాలంనాటి నాగరికతో కూడా ఖచ్చితంగా చెప్పేందుకు వుపయోగపడుతాయి. అంతేగాక దుస్తులనేవి లింగ భేదాన్నికూడా సూచిస్తాయి, అందాన్నిస్తాయి. నాగరికత కనుగుణంగా దుస్తులూ మారుతూవచ్చాయి.

వివిధ రకాలయిన దుస్తులు విజయనగర చిత్రలేఖనంలో మనకు కనిపిస్తాయి. వీటి ద్వారా చాలా అసక్తికరమైన విషయాలు తెలుస్తున్నాయి. ధోతి (పంచ) అనేది విజయనగర కాలంలో చాలా ముఖ్యమైంది. ఇది పురుషుల క్రింది దాగప్పు శరీరాన్ని కప్పేందుకు వుపయోగపడుతుంది. చాలా పెద్ద గుడ్డగా వుండి పురుషుల నడుం క్రిందిభాగానికి చుట్టబడుతుంది. ఇక్కడి చిత్రాలలో రెండు రకాల ధోతిలు కన్పిస్తాయి. మొదటి వుదాహరణలో ధోతి కాలి మడమవరకు వదులుగావుండి రెండు పద్ధతుల్లో వున్నాయి (చిత్రం. V–1,2,3). మొదటి పద్ధతిలోముందటి మడతలు చాలా ఆకర్షణీయంగా వుంటాయి. రెండవ పద్ధతిలో యీ మడతలు కన్పించవు. రెండవ వుదాహరణలో ధోతి మోకాళ్ళ వరకే వుండి అర్ధోరుకాన్ని పోలి వుంటుంది. ఇది చాలా బిగుతు అనిపిస్తుంది. దీనిని నడుంకిరువైపులా బిగిస్తారు (ఫోటో. 24; చిత్రం. V–4),లేపాక్షిలోని వర్ణచిత్రాలను పరిశీలించిచూస్తే రాజులు, మంత్రులు, అతిముఖ్యులు

కాలిమడిమ వరకు ధోతితోను, క్రింది అధికారులు, మిగిలినవారు అర్ధో రుకాన్ని ధరించేవారని తెలుస్తుంది. అర్ధోరుకాలలోని బిగుతుగావుండే ధోతిని విలుకాళ్ళు, పల్లకి మోసేవారు ధరించేవారని తెలుస్తుంది. కానీ లేపాక్షిలోని వర్ణచిత్రంలో భిక్షాటనమూర్తినికూడా యిలాంటి అర్ధోరుకం తోనే చూపించారు (ఫోటో. 24). ఇలాంటి దుస్తుచే హంపీ విరూపాక్షా లయంలోని విద్యారణ్యస్వామి వూరేగింపులో పల్లకి మోసేవారు ధరించి వుండటం గమనార్హం (చిత్రం VI-1). ధోతిని మామూలుగా తెల్లటి రంగులో చూపించారు. అరుదుగా ముదురు పచ్చ, లేతపచ్చ రంగులో, కూడ చూపడం జరిగింది. అంచులు అందమైన డిజైన్లతో చిత్రించి నట్లుగా వొక్కొక్కసారి చూపించారు. ధోతి అంచులు నలుపు, ఎరుపు, నేరేడు రంగులలోనూ చూపబడింది.

నడుం పైభాగాన్ని కప్పేందుకు పురుషులు ఉత్తరీయ అనేగుడ్డను వాడేవారు. ఇదే పెద్దదిగావుండి భుజాలను, రొమ్ము భాగాన్ని కప్పేందు కుపయోగపడేది. ఇది వొక్కొక్కసారి మోకాలు వరకూ వుంటుంది. ఈ ఉత్తరీయం మామూలుగారాజులు, మంత్రులు, ప్రముఖులు, భక్తులు వాడినట్లు లేపాక్షి చిత్రాల ద్వారా తెలుస్తుంది. ఇవి వివిధ రకాల డిజై న్లను కూడా కలిగి వున్నాయి (ఫోటోలు. 24, 26, 30).

ధోతి, ఉత్తరీయాలతో బాటు వొకరకమైన గుడ్డ నడుంకు కట్టు కొనుటకు వుపయోగించబడింది. ఇది రెండు విధాలుగా వుపయోగపడు తుంది. నడుం దగ్గర ధోతిపైన కట్టుబడివుండి ధోతిని గట్టిగా పట్టి వుం చేందుకు వుపయోగపడుతుంది. మరియూ అది కట్టుకొన్న మనిషిహోదా ను తెలిపేదిగా వుంది. దీనిని సాధారణంగా ఆలయాలకు వెళ్ళేటప్పుడు కట్టుకొంటారు. రాజు ఎల్లప్పుడూ దీనిని కట్టుకొనేవుంటాడు. ముఖ్యంగా యిది హోదాను తెలిపేదిగా మనం గమనించవచ్చు. ఇప్పటికీ యిది కొన్నిచోట్ల వాడుకలోవుంది. ఇలాంటివి లేపాక్షిలోనే గాక హంపీ, సోం

పాడెం, తిరువాలంజులిలిలోని వర్ణచిత్రాలలో కూడా చూడవచ్చు (ఫోటోలు. 24, 26; చిత్రం. V-5, 6).

పై దుస్తులతోపాటు పురుషులు వొక్కొక్కసారి కంచుకలు (జుబ్బాలు) కూడా ధరించినట్లు చూపబడింది. దీనిని తెల్లటి గుడ్డలో తయారు చేస్తారు. ఇది కొంచెం వదులుగా వుండి వొక్కొక్కసారి కాళ్ళవరకు వుంటుంది. దీనిపైన వొక గుడ్డతో నడుం దగ్గర కట్టబడి వుంటుంది. ఇలాంటి దుస్తులు లేపాక్షిలో విరూపణ్ణ, వీరణ్ణ మరియు వీరి సహచరుల వర్ణచిత్రాలలో చూడవచ్చు (ఫోటో. 30). ఇక్కడ గమనించదగ్గ విషయమేమిటంటే విరూపణ్ణ, వీరణ్ణలు మాత్రం జుబ్బాను కాళ్ళవరకు ధరించి వుండటం. వారిపరివారం జుబ్బాలు మోకాళ్ళ వరకు ధరించి వుండటం, కొబట్టి యిది కూడా వ్యక్తి హోదాను తెలిపేదిగా వుంది. ఈ జుబ్బాలకు పూర్తి చేతులుంటాయి (చిత్రం. V-5, 6). ఒక్కొక్కసారి యివి బిగుతుగా కూడా వుంటాయి. ఇలాంటివి హంపీ విరూపాక్షాలయంలోని విద్యారణ్యస్వామి వూరేగింపులో పల్లకీ మోయు వారు ధరించి వుండటం గమనించవచ్చు (చిత్రం. VI-1). ఇవిడిజైన్లు లేసు సాదాగాను చూపబడినాయి. కిరాతులు ఆకులు, వృక్ష సంబంధ మైన డిజైన్లు గల దుస్తులు ధరించేవారు.

దేశ విదేశీ రచనలలో నాటి దుస్తులను గురించి వర్ణించబడింది. ఫెర్నినోనూనిజ్ (పోర్చుగీసు) అచ్యుతదేవరాయ మహారాజ దుస్తులను గురించి వర్ణించాడు—"ప్రభువు వొకసారి ధరించిన దుస్తులు మరలా ధరించేవారు కాదు. ఆలా తీసివేసిన దుస్తులు యితరులకిచ్చేవారు కాదు. ఈ దుస్తులు చూచుకొనేందుకు వొక అధికారికూడా వుండేవాడు. రాజు గారి దుస్తులు మంచి నాణ్యత కలిగిన పట్టుతో తయారుచేసినవి. చాలా వరకు బంగారు పొదగబడి వుంటాయి" (Vasundhara Fillizot, Vijayanagara Empire, pp. 159 ff ) డొమింగోస్ పేయిస్ (పోర్చుగీసు) రాజు దుస్తుల గురించి యీ విధంగా తెలిపాడు—"రాజు

డుస్తులకు విలుపైన తెల్లని గుడ్డ నుపయోగించెడివారు. ఆ చొక్కాపై అక్కడక్కడా బంగారు గులాబీలు అల్లబడి వుండేవి. చొక్కా మెడ దగ్గర వజ్రపై డూర్యాలు పొదగబడి వుండేవి" (Ibid. p. 35).

పై రచనలపలన ప్రభువులు బంగారుపొదిగిన పట్టుదుస్తులు వాడి నట్లు తెలుస్తుంది. వీరు తెలిపిన లక్షణాలుకల దుస్తులు యిక్కడ వర్ణ చిత్రాలలో ధోతి, ఉత్తరీయాలు నడుంకున్న గుడ్డలతో పోల్చుకోవచ్చు. అల్లసాని పెద్దన మను చరిత్రలో 'జిలుగు కంచుకము' గురించి వివరిం చాడు. ఈ దుస్తులు మనిషిపుచ్ఛ్వాస, నిశ్వాసాలకే కదులునంత తేలికగా వుండేవట. బంగారుఅంచులు కలిగివున్న ఉత్తరీయులను, ధోతిలనుగురించి కూడా ప్రస్తావన వుంది (Manucharitra, Madras, 1968, p. 633; p. 626; p. 296. V. 71).

విజయనగర వర్ణచిత్రాలలో పురుషుల దుస్తులేకాక స్త్రీల దుస్తుల గురించికూడ ఆసక్తికరమైన విషయాలను తెలుసుకోవచ్చు. ఈకాలంలో స్త్రీ దుస్తులు మామూలుగా చీర, రవిక. చీర పెద్దదిగా వుండి, నడు ముకు చుట్టివుండి మడిమవరకుంటుంది. ఇంకొక వైపు చీర చివరిదాగం కుడిపైటలాగ వుంటుంది. ఒక్కొక్కసారి ఎడమ పైటగా కూడా వుంటుంది (చిత్రం. II—4). ఈ చీరలు చాలా రకాలయిన డిజైన్లతో వుంటాయి. ఒక్కొక్కసారి సాదా (అలంకరణ లేకుండా) చీరలుకూడా కనిపిస్తాయి. చీరల అంచులు నలుపు, నీలం, మట్టిఎరుపు, పచ్చ, బంగారు మొదలయిన రంగులతో కనిపిస్తున్నాయి. ఒక్కొక్కసారి చీరలు ధోతి లాగా ధరించినట్లు చూపబడింది.

చాలా వరకు యిక్కడి చిత్రాలలో స్త్రీలు రవికెలు లేకుండా వున్నారు (ఫోటో. 25). అలా అని పూర్తిగా లేకుండా పోలేదు. కొన్ని చిత్రాలలో పలుచటి రవికెలు (చోళి) ధరించినట్లు తెలుస్తోంది. వర్ణచిత్రంలో పార్వతి ధరించినచోళికి చిన్న మెడవుండి, చేతిలు మోచేయి

[illegible] ముడివేసు కోవటం వొకపద్ధతి. ఈ ముడి మెడ పై భాగాన వుంటుంది. దీనిని మరలా మూడు పద్ధతులుగా విభజించవచ్చు. [illegible] మొదటి పద్ధతిలో వరుసగా అల్లికలాగ వుండి వెనక ముడి [illegible] వుంటుంది. రెండవ పద్ధతిలో యీ ముడి [illegible] మెడమీద వాలి వుంటుంది. మూడవ పద్ధతిలో ఈ ముడి మెడమీద నిటారుగా నిక్కినట్లుంటుంది. ఈ ముడి అలా [illegible] వుండేందుకు గాను ఏదో చెక్కపిన్నులాంటిదిలోపల [illegible] తెలుస్తుంది (చిత్రం. II–1,2,3,4) ఇలాంటి కేశాలంకరణ పద్ధతి నవీనకాలంలో గమనించవచ్చు. ఇలాంటి అలంకరణ పద్ధతులు విజయనగర శిల్పాలలో కూడ కనిపిస్తాయి. విజయ నగర కాలంనాటి రచనలలో యీరకపు ముడులను 'కొప్పు' అని వర్ణిం చారు. కేశాలంకరణలో పువ్వులను ఎక్కువగా వుపయోగించేవారు. అలాగే వుంగరాలుగా వెంట్రుకల నేర్పరచు కోవటం కూడా ప్రస్తావించ బడింది (ఉంగరపు కురులు) **(Amuktamalyada, p. 156, V. 61; p. 488, V. 9; p. 506, V. 38).** ఇక రెండవరకమైన కేశాలం కరణలో వెంట్రుకలను వెనుకకు దువ్వి మధ్యలో విడదీసి వెనుకభాగాన జడలాగా ఏర్పరచటం (ఏకవేణి). వెంట్రుకలను చాలాఅందంగా మెలి వేసి చివరకు వచ్చేటప్పటికి సన్నగా వుండేట్లు తీర్చటం, ఈ రకమైన అలంకరణ విజయనగర రచనలలో 'జడ'గా వర్ణించబడింది **(Ibid. p. 406, V. 163. Ivory Combes were used for Combing the hair (Manucharitra, p. 220, V. 23)** (ప్లేట్. 25; చిత్రం II–1).

**తలపాగాలు, టోపీలు :** టోపీలు, తలపాగాలు పురుషులు మామూ లుగా తలపైన ధరించేవారు. విజయనగర కాలంలోని వర్ణచిత్రాలలోను, శిల్పాలలోను వీటిని చూడవచ్చు. ఇవి చాలా వరకు కూసుగా వుండి, [illegible]గా వివిధ రంగులలోను, వివిధ డిజైన్లలోను వున్నాయి. ఇక్కడ ముఖ్యంగా గమనించదగ్గది ఏమిటంటే దేవతాచిత్రాలలోకూడా యిలాంటి

టోపీలను చూపించటం. ఇవి రాజులు, సంస్థానాధిపతుల చిత్రాలలో ఎక్కువగా కనిపిస్తాయి (చిత్రం. V-8, 9, 10). క్రింది అధికారులు కూడా టోపీలు ధరించి వున్నారు. కానీ ఆ టోపీలు వేరే విధంగా వుండ టం గమనించవచ్చు. అవి ఎత్తు తక్కువగా వుండి పైన చదరంగా వున్నాయి. అంతేగాక తెల్లగావుండి సాదాగా కనిపిస్తాయి (చిత్రం. V-7).

ఇక్కడ వర్ణచిత్రాలలో చిత్రించబడివున్న పొడవాటి టోపీలను గురించి పోర్చు గ్రీసు యాత్రికులు కూడా తమ రచనలలో ప్రస్తావిం చారు. పేయిస్ రాజుగారి దుస్తులను గురించి వర్ణించేటప్పుడే టోపీల గురించి కూడా వివరిస్తూ—"రాజుగారి తలమీద బాగా అలంకరించబడిన టోపీవుంది. అది గెలాసియన్ టోపీని పోలినట్లుంది (Vasundhara Fillizot, The Vijayanagara Empire, As seen by Domingos paes and Fernao Nuniz two 16th Century Portuguese Chroniclers, p. 32). ఉత్సవ సమయాలలో 20 మంది స్త్రీలు అందంగా అలంకరించుకొని తలపైన పెద్దటోపీలు కలిగి వున్నట్లు వర్ణించారు. ఈ టోపీలను వారు 'కొల్లాయి' అని వర్ణించారు. కొల్లాయిలలో ముత్యాలు పొదిగివున్నట్లుకూడా తెలిపారు (Ibid.p.52). కాబట్టి పురుషులేగాక స్త్రీలుకూడా టోపీలు ధరించినట్లుగా తెలుస్తూవుంది. పేయిస్ వర్ణించిన కొల్లాయిలు మనకు లేపాక్షి చిత్రాలలో కనిపిస్తాయి (చిత్రం. V-8, 9, 10). ఫెర్నినో నూనిజ్ కూడా టోపీలను గురించి వివరించారు. అచ్యుతదేవరాయలు కూడా టోపీలుధరించేవారని, అయితే వొకసారి తలమీదవుంచిన టోపీ మరలా తలమీద పెట్టుకొనే ప్రసక్తి లేనేలేదని వివరించారు (Ibid. p. 153). శ్రీనాథమహాకవి 'కుల్లాయి' అనుపదాన్ని వాడినట్లు అధారాలున్నాయి (N.Venkataramanaiah, Studies in the Third Dynasty of Vijayanagara, p.371) బహుశ యీ కుల్లాయి విజయనగర కాలపు కొల్లాయి వొకటే కావచ్చు. తిరుమలలోవి శ్రీకృష్ణదేవరాయలు, వెంకటలకాంస్య విగ్రహాల తలమీద కూడా యిలాంటి టోపీలుండుట గమనించవచ్చు.

ఇస్తాడు—"మీరూ, నేను కూర్చొనివున్న యీ తివాసీ విదేశంనుండి వచ్చి నదే, వీటి మీద గాని మనం కూర్చొనకపోతే, అక్కడ యీ చిత్రం వుండకూడదు. అంతేగాదు మీ తలల మీదున్న పొడవైన టోపీలు కూడా ఆదేశంనుండి వచ్చినవే" (Henry Heras, The Aravidu Dynastry of Vijayanagara, Madras, 1927, P, 491) కాబట్టి దీని ద్వారా పొక్కు టోపీలే గాక తివాసీలు కూడా విదేశాలనుండి దిగుమతి చేసుకొన్నట్లు మనం తెలుసుకోవచ్చు.

తలమీద తలపాగాలు ధరించటం విజయనగర వర్ణచిత్రాలలో మనం గమనించవచ్చు. ఇవి తలను సూర్యరశ్మినుండి రక్షించటమేగాక, వీన్ని ధరించిన వారి విలువను కూడా తెలియజేస్తుంది. పెద్దగుడ్డను తల మీద చుట్టు కోవటమే తలపాగ. ఇవి డిజైన్లతోను, సాదాగాను కూడా కనిపిస్తాయి. ఒక్కొక్కసారి చిన్న టోపీలూ దర్శన మిస్తాయి. వీటి మధ్యభాగం కూనుగా పైకి లేచి వుంటుంది (చిత్రాలు. V–5; VI–1). ఈనాడు వాడుకలో వున్న టోపీలను పోలినవి కూడా వున్నాయి (వెలిత పారంబులు). కొన్ని టోపీలు బంగారు అంచు కలిగి వున్నాయి (పసిడి తీగలు నిన్చిన జిలుగు పాగ). వీటిని గురించి స్వదేశ గ్రంథాలలోకూడా వర్ణించారు (Amuktamalyada, p. 311; Manucharitra, p. 628, V. 58).

**ఆభరణాలంకరణ** : భారతీయులు అందంగా అలంకరించు కొనేం దుకు చాలా ప్రాముఖ్యతనిస్తారు. స్త్రీలు ఎక్కువగా ఆభరణాలపట్ల ఆసక్తి చూపుతారు. అలాగే పురుషులు కూడా ఆభరణాలపట్ల ఆసక్తి చూపి నట్లు వివిధ కాలాలలో నాగరికతల్ని గమనిస్తే తెలుస్తుంది. చిత్రలేఖనం లోను, గ్రంథాలలోను, శిల్పాలలోను గమనించిన విదితమౌతుంది. విజయ నగర వర్ణ చిత్రాలను పరిశీలిస్తే అలంకరణకుపయోగపడే ఆభరణాలను గురించి చాలా విషయాలు తెలుస్తాయి. వీటిని శిరోజాలంకరణ, కర్ణాలం కరణ, నాశికాలంకరణ, హస్తాలంకరణ, కటి అలంకరణ, కంఠాభరణాలు,

పాదభూషణాలు మొదలైన భాగాలుగా విభజించి యీ క్రింద వివరింప బడినది.

i. శిరోలంకరణ: స్త్రీలు తలపై సీమంత భూషణం దరించేవారు(ఫోటో. 25; చిత్రం. II-1). వెంట్రుకలను వెనక్కి దువ్వి మధ్యలో విడదీసి, ఆమధ్యలో ముత్యాలు పొదిగిన పతకాన్ని వుంచుకొనేవారు. దీనిని తెలుగులో 'పాపిట బొట్టు' లేక 'చేర్‌చుక్క' అనీ, సంస్కృతంలో 'లలాటిక' అనీ పిలిచేవారు. ఇలాంటి ఆభరణాలు మనకు శుంగ, శాతవాహన, కుషాణుల కాలంలో ఎక్కువగా కనిపిస్తాయి.

నొసట అందమైన బొట్టు(చుక్క) వుండటం ముఖ సౌందర్యాన్ని యినుమడింప చేస్తుంది. ఈ అలవాటును యిప్పటికీ స్త్రీలు ఆచరిస్తున్నారు. ఒక్కొక్కసారి యిది అర్ధచంద్రాకారంగా వుంటుంది. ఆముక్తమాల్యదలో కస్తూరిని చుక్కగా వాడినట్లు తెలుస్తుంది. ఇది ఆడవారికి అందాన్నిచ్చేదిగా వర్ణింపబడింది(Amuktamalyada,p.524,V.62). లేపాక్షి వీరభద్రాలయంలోని కల్యాణమండపంలో వాక స్తంభం మీద ప్రతిమలో స్త్రీ చాలా తీరికగా కూర్చొని నొసటన బొట్టు పెట్టు కొంటున్నట్లుంది.

ii. కర్ణాలంకరణ : లేపాక్షిలోని వర్ణచిత్రాలను పరిశీలిస్తే స్త్రీ పురుషులిద్దరూ అనేక రకాలైన ఆభరణాలతో అలంకరించుకొన్నట్లు తెలుస్తుంది (ఫోటో. 25). వీటిని చాలా రకాలుగా విభజించవచ్చు. ఇవి చాలా వరకు గుండ్రని ఆకారాన్ని పోలి వుంటాయి. 1. గుండ్రంగా వుండి, రింగు ఆకారంలో సాదాగావుంటుంది(చిత్రం.VII-1). 2. రింగు చుట్టూ ముత్యాలు పొదగ బడివుంటుంది(చిత్రం. VII-2). 3. రింగు భాగంలో పద్మం వుండినట్లుంటుంది (చిత్రం. VII-3). 4. పద్మం మొగ్గలాంటిది క్రిందిభాగంలో వ్రేలాడ దీసినట్లు కనిపిస్తుంది (చిత్రం. VII-4). 5. కొన్నింటిలో యీమొగ్గ క్రిందిభాగాన ముత్యాలు పొదగ బడి వున్నాయి (చిత్రం. VII-5). 6. ఈ రకంలో ఆభరణం దీర్ఘ

చతురస్రాకారంలో వుండి మధ్యలో ముత్యాలు పొదగబడి వున్నాయి (చిత్రం. VII–6). 7. ఈ వుదాహరణలో రెండు వరుసలలో ఎని మిది ముత్యాలు పొదగబడి వున్నాయి (చిత్రం. VII–7). 8. చిలుకాల ఆకారంలో వుండి, చెవికి మధ్యభాగంలో వొకటి వుండి, మరొకటి చెవికి వ్రేలాడదీసినట్లుగావుంటుంది (చిత్రం.VII–8; ఫోటోలు. 24,25, 26). ఆముక్తమాల్యదలో చెవి ఆభరణాలు శంఖం, చక్రం ఆకారంలో వుండినట్లు చెప్పబడింది.

**iii. నాశికాలంకరణ:** లేపాక్షిచిత్రాలలో నాశికాలంకరణ చాలా అరు దుగా కనిపిస్తుంది. అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించే వర్ణచిత్రంలో వొక స్త్రీ నాశికాలంకరణంలో చూపబడింది (చిత్రం.II-1,2,3). ఇంకొక వుదాహరణ సీతారాముల కళ్యాణ చిత్రం. ఇందులో నాశికాభరణం మామూలుగా గుండ్రని ఆకారంలో చూపబడింది. ఆముక్తమాల్యదలో బంగారు నాశికాభరణాలను బంగారు 'ముంగర' అని వర్ణించబడినాయి (Amuktamalyada, p. 270, V. 21). బర్బోస (విదేశీయుడు) నాశికాలంకరణ గురించి యీ విధంగా తెలిపారు–"ముక్కుకు వొకవైపు చివరగా చిన్న రంధ్రం చేయబడి వుండి, ఆ రంధ్రానికి సన్నని పోగు లాంటిది అమర్చు కొంటారు. ఒక్కొక్కసారి దీనికి ముత్యాలు, కెంపులు పొదగ బడివుంటాయి" (B.A. Saletore, Social and Political life in the Vijayanagara Empire, Madras, 1934, Vol. II, p. 178).

**iv. హస్తాలంకరణ :** వీటిని రెండు భాగాలుగా విభజించవచ్చు. చేయిపై భాగాన అలంకరించుకొనే అభరణాలను స్త్రీ పురుషులిరువురూ ధరించేవారు. వీటిరకాలు — మొదటి రకంలో రెండు పట్టీలు లాగా వుండి పైన వంకీలుగా త్రిప్పబడివుంటుంది (చిత్రం. VII–9). రెండవ వుదాహరణలో కూడా రెండుపట్టీలుండి, పైపట్టీలో ముత్యాలు పొదగబడి వుంటాయి. పైన కూసుగావుండి అందుకూడా ముత్యాలు పొదగబడివుంది

(చిత్రం. VII-10). ఇంకొక వుదాహరణలో రెండు పట్టీలుండి పైన కూసుగా వంకీలాగుంది (చిత్రం. VII-11). పూసలతో రెండు సరాలుగా వుండి క్రింద ముత్యాల కుచ్చు వ్రేలాడుతూ వుంది (చిత్రం. VII-12). ఇంకొక రకంలో రెండు పట్టీలపైన ఆకులలాంటి అలంకరణ వుంది (చిత్రం. VII-13). ఇంకొక రకంలో వొకే పట్టీ ముత్యాలతో వుండి, పైన, క్రింద ముత్యాలు వివిధ రకాలుగా అలంకరించబడి వున్నాయి (చిత్రం. VII-14). మరో రకంలో ముత్యాలతో పొదిగిన రెండి పట్టీ లుండి మరే అలంకరణ లేకుండా సాదాగా వుంది (చిత్రం. VII-15; ఫోటో. 24).

రెండవ భాగంలో చేతిమణికట్టు దగ్గరున్న ఆభరణాలను గురించి వివరించబడింది—మణికట్టు దగ్గర స్త్రీలు గాజులు పురుషులు కంకణాలూ ధరిస్తారు. లేపాక్షి చిత్రాలను పరిశీలిస్తే యిలాంటి కంకణాలు, గాజులు కనిపిస్తాయి (ఫోటోలు. 25, 26, 27). మొదటి రకంలో మొత్తం నాలుగు గాజులున్నాయి. మధ్యలోనివి సాదాగాను, క్రింద పైనవుండేవి ముత్యాలు పొదగబడి వున్నాయి (చిత్రం. VII-16). రెండవ వుదాహరణలో ముత్యాలు పొదిగిన గాజులున్నాయి. రెండింటిని ముత్యాలు కలుపుతున్నాయి (చిత్రం. VII-17). మూడవ వుదాహరణలో ముత్యాలు పొదిగిన మూడు గాజులు, రెండు సాదావి వొకటి మార్చి వొకటి వున్నాయి (చిత్రం. VII-18). ఇంకొక రకంలో సాదావీ, ముత్యాల గాజులూ పైన ముత్యాల సరాలూ వున్నాయి (చిత్రం. VII-19). ఇంకొక వుదాహరణలో సాదాగా వున్న గాజులపైన ముత్యాలు అమర్చబడివున్నాయి (చిత్రం. VII-20). మరొకచోట వరుసగా మూడు కంకణాలున్నాయి (చిత్రం. VII-21). చివరి వుదాహరణలో వొక కంకణ మాత్రం వుంది (చిత్రం. VII-22), చివరి రెండు వుదాహరణలలోని కంకణాలు పురుషులు ధరించే వారు (చిత్రం. VII-21, 22). ఇవి అలంకరణలేని సాదావి. వొక్కొక్కసారి ముత్యాలు పొదిగినవి వర్ణచిత్రాలలో కనిపిస్తాయి. గాజులను బంగారు, వెండి యితర లోహాలతో చేసి

నట్లు తెలుస్తుంది. ఆముక్తమాల్యదలో అద్దం గాజులు కూడా వాడుకలో వున్నాయని ప్రస్తావించబడింది (Amuktamalyada, p. 573, V. 123).

**V. కటి అలంకరణ :** మామూలుగా నడుముకున్న ఆభరణాలు రెండు రకాలుగా వుపయోగ పడ్డాయి. ధోవతినిగానీ, చీరనుగానీ గట్టిగా పట్టుకోవటం మొదటి వుపయోగం. రెండవది యీ ఆభరణాలు వ్యక్తుల అంతస్తును తెలుపుతుంది. లేపాక్షిలోని వర్ణచిత్రాలంలో అరుదుగా స్త్రీలు నడుం పట్టీలాంటిది ధరించినట్లు కనిపిస్తుంది. దీనికి గల కారణం బహుశ చిత్రకారులు చీరను వివిధరకాలుగా చూపేందుకే ప్రాధాన్య మివ్వటం అని తెలుస్తూంది. అలాగే పురుషులు మామూలుగా నడుంకు గుడ్డ బిగించుకొని వున్నట్లువుంది. కానీ హంపీలోని విజయ నగర చిత్రాలలో స్త్రీ, పురుషులు నడుమును వివిధరకాల ఆభరణాలతో అలంకరించుకొన్నట్లు వుదాహరణయున్నాయి.

**Vi. కంఠాభరణాలు :** వివిధ రకాల కంఠాభరణాలను లేపాక్షి చిత్రాలలో చూడవచ్చు. ఒంటిపేట ముత్యాల కంఠాభరణం మెడకు బిగుతుగా వుండేటట్లుగా చాలా చిత్రాలలో కనిపిస్తాయి (ఫోటోలు. 25, 27). ఇంకొక రకంలో వొంటిపేట హారం కొంచెం పొడవుగావుండి సాదాగా కనిపిస్తుంది. దీనిని 'ఏకావళి' అని కూడ అంటారు. ఇలాంటి హారాలు చాలా సూక్ష్మ భేదాలతో యిక్కడ చిత్రాలలో కనిపిస్తున్నాయి (చిత్రం. VIII –8). మొదటి రకంలో ఏకావళి ముత్యాల కుచ్చులు కలిగివుంది. రెండవరకంలో హారానికి అక్కడక్కడ ముత్యాల రింగులు అమర్చబడి వున్నాయి. మూడవ వుదాహరణలో హారం చాలా పొడవుగావుండి చివరగా మొగ్గలాంటిది వ్రేలాడుతూవుంది. దీనిని స్త్రీ, పురుషులిరువురూ ధరించినట్లు తెలుస్తూంది (చిత్రం. VIII--8).

**పాద భూషణాలు :** ఈ పాద భూషణాలను రెండుగా విభజించవచ్చు. మొదటిది 'నూపురాలు' రెండవది "పాదసరాలు', నూపురాలు

కాలి చీలమండలం దగ్గరుంటాయి. పాదసరాలు పాదం పైనాగానుంటాయి. లేపాక్షి చిత్రాలలో వివిధరకాల నూపురాలను చిత్రించారు. మొదటి రకంలో రెండు పట్టీలుండి పైన వంకీ ఆకారంలోవుంది (చిత్రం. VIII-1). రెండవ రకంలో సాదా పట్టీ వొకటుండి పైన వంకీలు కూసుగా వున్నాయి (చిత్రం. VIII-2). మూడవ వుదాహరణలో కూడా సాదా పట్టీ వొకటుండి, క్రింద ముత్యాలు వ్రేలాడదీసి నట్లున్నాయి (చిత్రం. VIII - 1). ఇంకొక పాదభూషణం పట్టీలుండి, పైన పుష్పాలంకరణ వుంది (చిత్రం. VIII-6). చివరి వుదాహరణలో మూడు, నాలుగు పట్టీ లుండి పైన ముత్యాల కమ్మీలున్నాయి (చిత్రం. VIII-7)

లేపాక్షి వర్ణచిత్రాలలో మూడురకాల పాదసరాలు కనిస్తున్నాయి. మొదటి రకంలో రెండు సాదా పట్టీలున్నాయి (చిత్రం. VIII-5). రెండవరకంలో మూడుపట్టీలుండి క్రింద, పైన పట్టీలు ముత్యాలు పొదగ బడి వున్నాయి. మధ్య పట్టీ సాదాగా వుంది (చిత్రం. VIII-7). మూడవ వుదాహరణలో పట్టీపైన పూసలవరుస కలిగివుండి క్రిందిభాగాన గల గలమనే చిన్ని గంటలను పోలివున్నాయి (చిత్రం. VIII-6).

ఇప్పటి వరకు వివరించిన వివరాలను బట్టి విజయనగర కాలంలో స్త్రీ, పురుషులిరువురూ అలంకార ప్రియులవి తెలుస్తూవుంది. స్త్రీలు ఎప్పుడూ అలంకరణకు ప్రాముఖ్యత విస్తారు. ముఖ్యంగా పండుగ సమ యాలలో స్త్రీలు ప్రత్యేకించి వివిధరకాల ఆభరణాలతో అందంగా అలంక రించుకొనేవారు. పేయిస్ విజయనగర రాజధానిలోని వివిధ పండుగలను గురించి, పండుగ సమయాలలో ముఖ్యంగా స్త్రీల అలంకరణ గురించి వివరించాడు. ఒక పండుగ సమయంలో 20 మంది స్త్రీల అలంకరణ గురించి వివరిస్తూ-"వారంతా చాలా అందమైన పట్టువస్త్రాలుధరించి తలపైన పెద్దకొప్పులాయికలిగివున్నారు.అవిముత్యాలుపొదిగిన పుష్పాలతోఅలంకరించ బడివున్నాయి.ఇంకా మెడలోవజ్ర పైడూర్యాలు, కంఠాభరణాలు,గాజులు, వడ్డాణాలు, పాదసరాలు, నూపురాలు మొదలయిన వాటితో అందంగా

అలంకరించు కొన్నారు" (Vasundhara Fillizot, Vijayanagara Empire, As seen by Domingos paes and Fernao Nuniz Two 16th Century Portuguese Chroniclers, p. 53.

**పాదరక్షలు :** ఆముక్తమాల్యద, మనుచరిత్రలో నాటి పాదుకల గురించి ప్రస్తావించబడింది (Amuktamalyada, I, V. 41, VI, V. 6; Manucharitra, I, V. 27, P. 42). ముచ్చెలు, మంకడాలు, పాదుకలు మొదలయిన పేర్లతో అనాడు పాదరక్షలను పిలిచెడివారట. విజయనగర వర్ణచిత్రాలలో చాలావరకు పాదరక్షలులేని పాదాలు చూపబడినాయి. లేపాక్షిలోని వొక వర్ణచిత్రంలో రాజు యీనాటిబూట్లలాంటి పాదరక్షలు ధరించి వున్నాడు. అలాగే కిరాతార్జునీయంలో కూడా పురుషులు పాదరక్షలు ధరించి వున్నారు (ఫోటో. 27). ఈ పాదరక్షల పైన పట్టీలు వున్నాయి. విదేశీ రాయబారులు, యాత్రికులు కూడా విజయనగర కాలంనాటి పాదరక్షల గురించి వివరించారు. బర్బొస స్త్రీలు కూడా చర్మంతో చేసిన పాదక్షలు వాడినట్లు తెలిపాడు. అవి చాలా అందంగా అలంకరించబడినట్లు వర్ణించాడు. పేయిస్ యీ విధంగా తెలిపాడు—"పాదుకల చివరన కూనుగా వుండి పురాతసద్వమును తెలిపే విధంగాను, కొన్నింటిపైన పట్టీలుండి కాలిని గట్టిగా అంటిపెట్టుకొని వున్నాయి. ఇవి రోమనుల పాదరక్షలను పోలివున్నాయి" (Vasundara Fillizot, Vijayanagara Empire, p. 33). ఆముక్తమాల్యద మనుచరిత్ర పాదరక్షలకు ముత్యాలు కూడా పొదిగినట్లు తెలిపాయి. అలాగే క్రొత్త పాదరక్షలకు మెత్తబడడానికిగాను నూనెను పూసేవారని యీ గ్రంథాల ద్వారా తెలుస్తూవుంది (Amuktamalyada, p. 606, V. 6; Manucharitra, p. 102. V. 83).

**సంగీత సాధనాలు :** విజయనగర ప్రభువులు సంగీతాన్ని, నృత్యాన్ని అత్యున్నతంగా ఆదరించారు. రాజస్థానాలలో, దేవాలయాలలో ముఖ్యంగా పండుగ రోజులలో కళలు ప్రదర్శించబడేవి. విజయనగర

కాలంనాటి కావ్యాలలోను, విదేశీ రచనలలోను నాట్యశాలలను గురించి, నాటి విజయనగర ప్రభువులకు సంగీత, నృత్యాల మీదున్న ఆసక్తి, పోషణ గురించి వివరించబడింది. ఈ సంగీత సాధనాలను, వాటి ఆకారాలను బట్టి వివిధ రకాలుగా విభజించబడినాయి.

i. **వీణ :** లేపాక్షి వర్ణచిత్రాలలో సంగీత సాధనమైన వీణను చిత్రించారు. విజయనగర చిత్రాలలోను, శిల్పాలలోను రెండు రకాల వీణలు కనిపిస్తాయి. మొదటి రకంలో చెక్కతో రెండు గుండ్రవి ఆకారాలు లోపల ఖాళీగా వుండేట్లు తయారుచేయబడి ఆ రెండింటి మధ్య పట్టీలాంటి చెక్కతో కలపబడి వుంటుంది. గుండ్రంగా వుండేవి వొకటి పెద్దదిగాను మరొకటి చిన్నదిగాను వుంటుంది. ఈ రెండింటిని తీగలతో అమర్చారు. వీటికి కొయ్యతో చేసిన చీలలుండి, తీగెలను సవరించుకొనేందుకు వుపయోగపడ్తాయి (చిత్రం. IX-10). రెండవరకంలో వొకవైపు గుండ్రని ఆకారంలోవుండి దీనికి చెక్కలాంటిది అమర్చబడి వుంటుంది. ఇదికూడా తీగెలను, కొయ్యచీలలను కలిగివుంటుంది (చిత్రం. IX-11). ఇది చూడడానికి ఎరుకలు వాడే తుంబురను పోలివుంటుంది. ఇది మరో రకమైన వీణలాంటిది. దీనిని 'దండి' అని ఆముక్తమాల్యదలో వివరించబడింది. ఇదేకావ్యంలో 'కిన్నెర' అనే సంగీతసాధనం గురించి వివరించబడింది. ఇంకొక కావ్యములో 'ముఖ-వీణ'ను గురించి తెలుపబడింది (Amuktamalyada, pp 288 ff, Vasucharitra, p.167, V.26)

ii. **మృదంగ, దుందుభి:** చర్మావర సంగీత సాధనాలలో చెప్పుకోదగ్గవి మృదంగాలు, దుంధుభులు. ఈ రెండింటికి ఆకారంలోను, పరిమాణంలోనూ తేడావుంది. మృదంగం సాంప్రదాయ సంగీత సాధనం. లేపాక్షి వర్ణచిత్రాలలో వివిధరకాల మృదంగాలను చూపించారు. ఒక రకంలో యిది కొంచెం పొడవుగావుండి మధ్యలో వుబ్బెత్తుగా వుంటుంది (చిత్రం. IX-1, 2). రెండవ రకంలోకూడా పొడవుగా వున్నా మధ్యలో వుబ్బెత్తు లేకుండా సమముఖంగా కనిపిస్తుంది

(చిత్రం. IX-3). మూడవ రకంలో కూడా పొడవుగానే వుంది సమం గాను, గుండ్రంగాను వుంటుంది (చిత్రం. IX-4). ఒది చర్మపు పట్టీ కలిగి వుంటాయి. సంగీత వూరేగింపులో మెడకు తగిలించుకొనేటట్లు కొన్ని చిత్రాలలో, సంగీతోత్సవాలలో నేలమీదుంచి వీటిని వాయిస్తున్నట్లు కొన్ని చిత్రాలలో చూపబడింది. వీటిని చేతులతోనే ప్రయోగించినట్లు ఆధారాలు కలవు. కర్రల నుపయోగించినట్లు అరుదుగా కన్పిస్తుంది. వీటిని తయారు చేయడానికి బోలుగా వుండే కొయ్యను వాడేవారు. వీటి రెండు వైపులకు ఆవుదూడ చర్మం లేక మేకచర్మం బహుశ వాడివుండవచ్చు. ఓరకమైన నల్లటిపదార్థం యిరుప్రక్కలచర్మానికీ అతికించబడివుంటుంది. ఎక్కువ శబ్దం వచ్చేందుకుగాను నేటి మృదంగాలలో కూడా యిలాంటి ఏర్పాటును మనం గమనించవచ్చు. దీనిని మాంగనీసు, వుడికించిన బియ్యం, చింతపండు మొదలయిన మిశ్రమాంతో తయారు చేస్తారు. మృదంగాన్ని చర్మం పట్టీలలో గట్టిగా బిగించేవారు. దీని వలనఎక్కువ శబ్దం రావటమే గాకుండా అందంగా కూడా వుంటుంది.

మృదంగాన్ని చాలాపురాతనమైన సంగీతసాధనంగా చెప్పవచ్చు. త్రిపురాసుర సంహారం తర్వాత శివుడు విజయోత్సాహంతో ఆనంద తాండవం చేసేటప్పుడు సంగీతసాధనం కోసం బ్రహ్మ దీనిని కనుగొన్నాడట (M. K. Dhavalikar, Sanchi, A Cultural Study, p. 65). లేపాక్షి నాట్యమండపంలోని వొక స్తంభంమీద నందికేశ్వరుడు మృదంగం వాయిస్తున్నట్లున్న ప్రతిమవుంది,

ఢుండుభిని హంపీ చిత్రాంలో చూడవచ్చు. ప్రస్తుత కాలంలో దీన్ని 'నగారా' అని అంటారు. క్రిందిభాగం చిన్నదిగా వుండి, పైభాగం చాలా పెద్దదిగా వుంటుంది. దీనిని కర్రలలో ప్రయోగిస్తారు. వీటినియుద్ధా రంభంలోను, ముగింపులోను, వూరేగింపులలోను వుపయోగించే వారట (చిత్రం. IX-5).

ఇలాంటిదే రూపంలో కొంచెంవేరుగావుండే 'తప్పెట' అనేవాయిద్య సాధనం నాడు వాడుకలో వుండేది. దీనిని కూడా వుత్సవ వూరేగింపుల్లో వుపయోగించేవారని తెలుస్తూవుంది.

**iii. శంఖము, సన్నాయిలు :** ఇవి కూడా భారతదేశంలో మృదంగం లాగేచాలా పురాతనమైన సంగీత సాధనాలు. శంఖాన్ని పండుగ సమయాలలో, ప్రతిరోజు యుద్ధారంభమున, ముగింపున వుపయోగించే వారు. ఇవి పూలకుచ్చులు, చిన్నచిన్న పట్టుగుడ్డ ముక్కలతో అలంక రించబడివున్నాయి(చిత్రం. IX-12).

ఇక సన్నాయిలలోని చాలా రకాలను యిక్కడి వర్ణచిత్రాలలో చూడవచ్చు. ఒక రకంలో కొద్దిగా వంగివుండి వొకప్రక్క పలుచగాను, మరొక ప్రక్క లావుగా, మందంగా వుంటుంది. అదే వైపు నోటిలో వుంచుకొని వాయించేవారు. రెండవరకంలో వొంపులు లేకుండా చక్కగా వుండి మధ్య, మధ వుబ్బెత్తుగావుంటుంది. ఇలాంటిది లేపాక్షి కల్యాణ మండపంలోని వో శిల్పంలో చూడవచ్చు. ఇంకోరకంలో చక్కగావుండి ఎలాంటి వుబ్బెత్తులు వుండవు. వీటన్నిటికి సాధారణంగా కొన్ని రంధ్రా యుంటాయి (దార-రంధ్రాలు), మరి కొన్ని రంధ్రాలు లేకుండా కూడా కనిపిస్తాయి. వీటిని తెలుగులో 'నాగస్వరాలు' లేక 'సన్నాయిలు' అంటారు(చిత్రం. IX-7,8,9).

పైన కనబరచిన సంగీత సాధనాలేగాక ఆముక్తమాల్యదలో యింకా ఎన్నో సంగీతపరికరాల ప్రస్తావనవుంది (Amuktamalyada, pp. 288 ff). అవి ఉపాంగము, అపటము, దండే, వురుజు, ముఖవీణ, డోలు, భేరి, హూరి, గుమ్మెట, ఢక్కి మొదలయినవి. ఉపాంగము, వురుము తోలుతో చేసినవి. వీటిని శృతికోసం వాడేవారట. డోలులు వివాహాలు, ఆలయ వుత్సవాలలో వాడేవారు. ఢక్కి చిన్నదిగా వుండి చేతులతో వాయించేవారు. గుమ్మెటను ఒగ్రకథ చెప్పేవారు వుపయో గించేవారు. ఇది చిన్న మృదంగాకారంలో వుంటుంది. కానీ దీనివి

పట్టిలో చేస్తారు. అలాగే వొకప్రక్క పూయకుండా వుంటుంది. దీనిని మామూలుగా దుణానికి గానీ, మెడకు గానీ తగిలించుకొని వాయిస్తారు.

**వాహనాలు, రవాణా :** విజయనగర చిత్రాంలో రవాణా గురించి గానీ, వాహనాల గురించిగానీ చాలా తక్కువ సమాచారం దొరుకుతుంది. కానీ దీని ద్వారా నాటి ప్రజలు రవాణా సౌకర్యాల గురించి తెలుసుకో వచ్చు. వీరికాలంలో భూమిమీద రవాణా సౌకర్యాలు మాత్రం వుండి నట్లుంది. నీటిపై రవాణా సౌకర్యాలు లేనట్లు తెలుస్తుంది. ఈ కాలంలో జంతువులు, చక్రాలబండ్లు, రథాలు, పల్లకీలు మొదలయినవి రవాణా సౌకర్యాలు. వీటిని గురించి యీ క్రింద వివరించబడింది.

**i. గుర్రం :** హరప్పా నాగరికత నుండి గుర్రం రవాణా సాధనంగా ముఖ్యమైన స్థానాన్ని వహించింది. విజయనగర వర్ణచిత్రాలలో ముఖ్యంగా లేపాక్షి, హంపీలలో యిది చాలావరకు రథాన్ని లాగడానికే వుపయోగించినట్లు తెలుస్తూవుంది. ఈకాలంలో గుర్రాన్ని జీను, నొసట పట్టీ, ముక్కుపట్టీ, వుదరపు పట్టీ మొదలయిన వివిధరకాల పట్టీలతో అందంగా అలంకరించేవారు. ఈ పట్టీలకు చాలావరకు ఘల్లు ఘల్లుమనే గంటలు అమర్చబడి వుండేవి. జీను మామూలుగా నూలు గుడ్డయి వుంటుంది. అది వుదర భాగాన్నంతా కప్పుతూవుండేది.

**ii. ఏనుగు :** ఏనుగు రాజులకు, సంస్థానాధీశులకు ప్రియమైంది. దీన్ని మామూలుగా రాచరికపు వూరేగింపులలో రథాన్ని లాగుతున్న ట్లుగా చూపబడినది. వీటిని యుద్ధ సమయాలలోకూడా వాడారు. విజయ నగర చిత్రాల్లో రథాన్ని లాగుతున్నట్లుగాను, మరియు హంపీలో విద్యా రణ్యుని వూరేగింపులోనూ ఏనుగు కనిపిస్తుంది. ఏనుగుని చాలా అందంగా అలంకరించేవారు. వివిధరకాల అల్లికలను కలిగిన పట్టు వస్త్రంతో దీనను అలంకరించినట్లు కనిపిస్తుంది. పైన కూర్చుండుటకు గాను చిన్న వేదిక లాగ అమర్చేవారు. దీనిని కదలకుండా గట్టి దారాలతో వుదరంచునట్టూ

కట్టబడి వుంటుంది. దంతాలు మువ్వల కుచ్చులతోను, పెద్ద వివిధ రకా లయిన పట్టీలతోను అలంకరించబడినట్లు యీవర్ణచిత్రాలలో కనిపిస్తుంది.

iii. ఒంటె : ఇది లేపాక్షి చిత్రాలలో కనిపించదు. కాని హంపీలోని విద్యారణ్యస్వామి వూరేగింపులో ఏనుగు వెనకభాగాన ఒంటె చూపబడింది. దీనినికూడా వివిధరకాల పట్టీలతో అలంకరించారు. విజయనగరకాలంలో ఏనుగులు, ఒంటెలను ప్రతి వూరేగింపులోనూ తీసికొని పోవడం ఆన వాయితీ. విజయనగర వర్ణచిత్రాల్లో ఒంటె కిరువైపులా రెండు పెద్ద భేరీలున్నాయి.

iv. రథాలు : లేపాక్షి, హంపీలలోని వర్ణచిత్రాలలో రథాలను చూడవచ్చు. వీటిని రాజులు, సంస్థానాధీశులు రవాణా సాధనాలుగా వుప యోగించారు. వివిధ రకాలయిన రథాలు విజయనగర వర్ణచిత్రాలలో వున్నాయి. ఇవి నాలుగు, ఆరు, ఎనిమిది చక్రాలు కలిగివున్నాయి. (చిత్రాలు. VI-2; X - 1,2). ఈ చక్రాలు ఆకులు కలిగివుండేట్లు, లేకుండేటట్లు మరియు పుష్పాలంకరణతో కూడవున్నాయి. ఈ చక్రాల మీద రథ నిర్మాణం జరిగింది. వివిధరకాల చెక్కడలతో ఎంతోఅందంగా పైభాగాన్ని అమర్చినట్లు చిత్రాల ద్వారా తెలుసుకోవచ్చు. ఈ రథాలు వొక్కొక్కసారి శిఖరాలు కలిగివున్నాయి (చిత్రం. VI-2). కొన్ని వుదాహరణలలో శిఖరాలు లేకుండాకూడ కనిపిస్తాయి. చక్రాలకు రంధ్రాలు కలిగివుండి యినుప ముక్కలోపల అమర్చినట్లుంది, యిరు చివరల చీల లున్నాయి. ఈ రథాలు చాలా అరుదుగా పొగదాగం కలిగివున్నాయి. ఈ రథాలను ప్రభువులు వుత్సవ సమయాలలో ఎక్కువగా వాడినట్లు నాటి కావ్యాలు తెలుపుతున్నాయి. వసు చరిత్రలో ఎక్కువగా చక్రాల రథాల్ని గురించి వుత్సవాల్లో, వూరేగింపుల్లో దీనిపాత్ర గురించి వివరించ బడింది (Vasucharitra, p 130, V. 145).

ఆలయ రథాల విషయాని కొస్తే దక్షిణ భారతదేశంలో చాలా వరకు ప్రతి ఆలయంలోను కొయ్యరథంవుంది. విజయనగర చిత్రాలలో

పనకు అరుదుగా యిలాంటివి కనిపిస్తాయి. హంపీలోని విద్యారణ్య వూరేగింపులో వో మూలయిలాంటి రథంచూపబడింది. ఇందులో నృత్య భంగిమలో వ్యాళి చిత్రాలు, ఎగిరే హంసలు చిత్రించబడి వున్నాయి. దీనిని తెలుగులో 'తేరు' లేక 'రథం' అంటారు. ఆముక్తమాల్యదలో వెలుబత్తూరు విష్ణువుకు, లక్ష్మికి రెండు రథాలుండినట్లు ప్రస్తావించ బడింది (Amuktamalyada, P. 15 V 58).

**V. పల్లకీలు :** ముఖ్యంగా రాజులు, రాణులు, సంస్థానాధీశులు, ధన వంతులు వీటిని రవాణా సాధనాలుగా వుపయోగించారు, చాలా ఆసక్తి కరమైన వర్ణచిత్రం హంపీలో వుంది. చివరిలో నాగ ఆకారంలోవుండి మధ్యలో కూర్చొనేందుకు వీలుగా పైన వొంపుగావున్న కర్ర నుపయో గించినట్లు దీని ద్వారా తెలుస్తుంది. కుర్చీలాంటిది లేక మెత్తని పరుపు లాంటిది మధ్యలో వుంటుంది. పట్టూపట్టు వస్త్రాలతో కప్పుటకు వీలుం డేది (చిత్రం. VI-1). మామూలుగా పల్లకీలు మోసేందుకు బోయీ లను వాడినట్లుగా వుంది. ఆనాటి కావ్యాలలో పల్లకిని 'పల్యంకి' లేదా 'అందలం' అని పేర్కొన్నారు (Amuktamalyada, p 176, V. 91, p. 178, V. 95, p. 257, V. 7), ఈ పల్లకీలను రాణులను వాడినట్లు విదేశీ రచనల ద్వారా తెలుసుకోవచ్చు. పేయిస్ యీ విధంగా తెలిపారు—"ముసలివారై రాజుకు దగ్గరివారైన వారుతప్ప రాణులు ఏ పురుషుడూ చూడడానికి వీలులేదు. ఈ రాణులు బయట వెళ్ళాలను కొన్నప్పుడు ఎవరికీ కనబడకుండా పూర్తిగా కప్పబడిన పల్లకీలలో పోయే వారు. దీని వెనుక దూరంగా మూడు, నాలుగు వందల మంది పరివార జనులుకూడ అనుసరించేవారు" (Vasundhara Fillizot, Vijaya-nagara Empire, p. 30). నూనిజ్ యీ పల్లకీలను గురించి ప్రస్తా విస్తూ రాజుగారి పట్టపురాణి పల్లకి వజ్ర, వైడూర్యాలు, బంగారు మొదలగు వాటితో పొదగబడి వుండేదని, మిగిలిన రాణుల పల్లకీలు వెండితో చేయబడి వుండేవని తెలిపారు (Ibid. pp. 174 ff). విజయనగర కాలంనాటి అనెగొంది ఉచ్చయ్యప్ప మఠంలోని వర్ణచిత్రంలో ఆడవారు పల్లకీ మోస్తున్నట్లుగా చూపారు.

[illegible]: [illegible] నుండి శరీరాన్ని రక్షించుకొనేందుకు
[illegible] తోడ్పడుతుంది. లేపాక్షిలోని వర్ణచిత్రాలలో వివిధ రకాల
[illegible] చిత్రించబడివున్నాయి. మొదటి రకంలో ముంచినట్టువాంటి
[illegible] గుండ్రంగా పొడవాటి కమ్మికి పై భాగాన అమర్చబడి
[illegible] క్రింది భాగం కంకాకారంలోవుంది (చిత్రం. XI-1).
[illegible] పై విధంగానే వుండి తెల్లని గుడ్డతో చేసినట్లుంది.
[illegible] నుండి పై భాగాన్ని రెండు చిన్న కమ్మీలు గట్టిగా
[illegible]న్నాయి. గొంతు క్రిందిభాగంలో రెండు గుండ్రని పువ్వొత్తు
[illegible]. దీని మధ్యలో చిన్న చిన్న పట్టుకుచ్చులు వ్రేలాడు
[illegible] (చిత్రం. XI-2). మూడవ వుదాహరణ పై రెండింటిలాగ
గుండ్రంగా [illegible] పై భాగం చదునుగావుంది. క్రిందిభాగంలో అర్ధ
[illegible] పూసలు లేక ముత్యాల సరాలు అమర్చబడినట్లున్నాయి
([illegible]. XI-3). నాలుగోరకంలో గుండ్రంగానే వున్నాయి. కానీ సీటి
[illegible] క్రిందికి వుండి పట్టుగుడ్డ పై భాగంలో వివిధ రకాలుగా
[illegible] అలంకరించినట్లుంది. ఈ గుడ్డ అంచులు ముత్యాలు లేక పూస
[illegible]వున్నాయి. పై సకలశాలను పోలిన భాగంవుంది. ఇవి చూడ
[illegible] దీపంలాగా వుంది (చిత్రం. XI-4,5,6). ఐదో
[illegible] అందంగా వుండడానికే గానీ వుపయోగానికి పనికి
[illegible]. ఇది అంతస్థులు అంతస్థులుగా పొరదానిపైన పొరకి
[illegible] అమర్చినట్లుంది (చిత్రం. XI-7). [illegible]
[illegible] కనిపిస్తుంది. అంటేపై నున్నది దోర్లించిన
[illegible]లోవుండి పైన కలశం కలిగివుంది. క్రిందిభాగం కొద్దిగా
[illegible] వుండినట్లు అనిపించి పట్టుగుడ్డ అంచులలో పూసల కుచ్చులు
[illegible]ట్లుంది (చిత్రం. XI-8). ఇక చివరి రకం చూడటానికి చదు
[illegible]లో వుండి, అందంగా అలంకరించబడి క్రింది భాగం పూసల
[illegible] పై భాగం కలశంతోను వుంది (చిత్రం. XI-9).

ఇప్పటివరకు వివరించిన వివిధరకాల గొడుగులన్నీ ముడుచుటకు వీలుపడేవే అని ఆముక్తమాల్యదలో వివరించబడివుంది. (విప్పిన గొడుగులు మింట వేగము మోగిదన్) (Amuktamalyada, p. 263, V. 12).

**చామరాలు :** రాజులు, రాణులు, సంస్థానాధీశులు, రాజగురువులు వూరేగింపుగా వెళ్ళేటప్పుడు గొడుగులు పట్టుకొన్నవాళ్ళూ, చామరాలు పట్టుకొన్నవాళ్ళూ చాలా మంది వారి ననుసరించేవారు. ఈ చామరలు విజయనగర చిత్రాలలో చిత్రించబడినాయి. లేపాక్షిలోని పార్వతి అలంకరణ చిత్రంలోను, హంపీ విరూపాక్షాలయంలోని విద్యారణ్యస్వామి వూరేగింపులో యివి చూపబడినాయి. ఇంకా విరూపణ్ణ, వీరణ్ణ మరియు అనుచరులున్న లేపాక్షి చిత్రంలోనూ, కుడ్యాలంకరణలో కూడా చామరాలు చూపబడినాయి. వీటికి చాలా అందంగా అలంకరించబడిన చేతికొడలున్నాయి. బహుశ యివి వెండివిగా వుండవచ్చు. ఒక చివరన కుంచె వుంటుంది. ఈ కుంచె తయారీకి బహుశ జంతువులలోక వెంట్రుకలను వాడివుండవచ్చు. ఇవి చాలావరకు తెల్లని రంగులో చూపబడినవి (చిత్రం. IV-4,5). ఊరేగింపు సమయాల్లో వుపయోగించే గొడుగులు కూడా వర్ణచిత్రాలలో కనిపిస్తాయి (చిత్రం. IV-1,2,3).

**విసనకర్రలు :** ఇది ప్రతి యింట్లో వుండవలసిన అవసరమైన పరికరాలలో వొకటి. వాతావరణం వేడిగావుండేటప్పుడు ముఖ్యంగా వేసవిలో దీని వుపయోగం తెలుస్తుంది. ఆముక్తమాల్యదలో తాటి ఆకులలో విసనకర్రలు తయారుచేసేట్లు వివరించబడింది. ఒక్కొక్కసారి నెమలి ఫింఛాలలో కూడా చేసినట్లు అదే కావ్యంలో చెప్పబడింది (Amuktamalyada, p. 158, V. 63, p. 160, V. 64). లేపాక్షి పార్వతి అలంకరణ వర్ణచిత్రాలలో పరిచారిక తనకుడిచేతిలో విసనకర్ర పట్టుకొని విసరుతూ వున్నట్లుగావుంది. దీని అంచులు దోర్లించిన అర్ధచంద్రాకారంలో

వుంది చిన్నరాతి కలిగివుంది. ఇదిమునుముకోపటానికి కూడా వుపయోగ పడేట్లు కనిపిస్తూవుంది(చిత్రం. IV-6).

**కుడ్యాలంకరణాలు:** విజయనగర వర్ణచిత్రాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే వెనుకనాగాన మామూలుగా వివిధ రకాల అలంకరణ సామగ్రి వివిధ పరిమాణాలలో చిత్రీకరించి వుండటం తెలుస్తుంది. వీటిని గురించిన వివరాలు పోర్చుగీసు యాత్రికుల రచనలలో కూడ వివరించబడింది. రాజసౌధాలు సుందరంగాను, మోహనంగాను, పట్టుగుడ్డలతో క్రిందినుండి పై వరకు అలంకరించబడి వుండేవట. ఒక్కొక్కసారి గోడ పైభాగాలు పద్మాలు, రోజా పువ్వులతోను అలంకరిచేవారట. ఇవి చాలా వరకు దంతంతో చేసినవేనట (Vasundhara Fillizot, Vijayanagara Empire, pp. 31, 32, 63 ff). కాబట్టి నాటి చిత్రకారులు కూడా రాజ సౌధాలలో లాగానే ఆలయాలలోని వర్ణచిత్రాలలో అంకరణ చూపించి వుండవచ్చు. చాలావరకు ఆలయాలలో చిత్రాలలోని అలంకరణలు రాజసౌధంలోని అలంకరణలు వొకే రకంగా వుండటం కూడ గమనించవచ్చు. ఇలాంటి అలంకరణలు లేపాక్షి, సోంపాలెం, తిరువాలంజులిలలో కనిపిస్తాయి. కానీ హంపీలో కానరావు. లేపాక్షి వర్ణ చిత్రాలలో యిలాంటి గోడల అలంకరణలుచాలా కనిపిస్తాయి. మొదటి రకంలో చతురస్రాకారంగాను మూలలందు కొద్దిగా గుండ్రంగా కనిపిస్తూవుండి పైన వజ్రాకార ముద్రలున్నట్లుంది (చిత్రం. IV-8). రెండవరకంలో అర్ధచంద్రాకారంలో వుండి. పైన పుష్పాలంకరణ కూడా వుంది (చిత్రం. IV-7). మూడవ రకంలో చేనెటీగల పుట్ట ఆకారంలో క్రింద తోకలాగుండి పైన అలంకరించబడి వుంది (చిత్రం. IV-9). నాలుగోరకంలో వ్రేలాడదీసిన గంటలాగా వుంది (చిత్రం. IV-10). ఇంకో రకంలో అర్ధ పద్మాకారంలా అలంకరింబడి వుంది (చిత్రం. IV-11). మరొక వుదాహరణలో అర్ధచంద్రాకారంలో వుండి అంచులు మాత్రం పద్మాలతో అలంకరించి నట్లుంది (చిత్రం. IV-12). ఇంకో రకంలో కూడా అర్ధచంద్రాకారంలో వుండి క్రింది భాగం పద్మ మొగ్గ

ఆకారంలో వుంది (చిత్రం, IV–13). ఒక్కొక్కసారి వానరాలుకూడా చూపబడినాయి.

**రాజ భవనాలు :** విజయనగర వర్ణచిత్రాలను పరిశీలించిచే నాటి రాజభవనాల గురించి చాలా ఆశక్తికరమైన విషయాలు తెలుస్తాయి. లేపాక్షిలోని సీతారాముల కల్యాణం వున్న వర్ణచిత్రంలో వెనుక భాగాన స్తంభాల భవనం చూపబడింది. ఆ భవనంలో ఋషులు క్రిందకూర్చొని వున్నట్లున్నారు. ఇంకొక వర్ణచిత్రంలో రాజభవనం చిత్రించబడివుంది (చిత్రం. III). ఈమందిరంలోని స్తంభాలను గ్రాపెట్లువున్నాయి. భవనం లోపల మరియు గోడల పైభాగాన వివిధ అలంకరణ సామగ్రి వ్రేలాడదీసినట్లున్నాయి. నాటి రాజభవనాలు ఏ రీతిలో నిర్మించినదీ పేయిస్ రచనలవల్ల కొంతమేరకు గ్రహించవచ్చు—"రాజభవనానికి పెద్ద ప్రవేశ ద్వారముండేది. ప్రవేశ ద్వారంపైన శిఖరాకారం లాంటిది కట్టబడి వుంటుంది. ఇక్కడ చాలా మంది ద్వారపాలకులుంటారు. పై అధికారినుండి అనుమతి పత్రం దొరికితే తప్ప అందులోకి ప్రవేశించడానికి వీలుపడేదికాదు. లోనికి ప్రవేశిస్తే ఖాళీగా కనిపిస్తుంది. దాని తర్వాత మరలా వొక ద్వారం వస్తుంది. ఇక్కడ ద్వారపాలకులు, కావలివారు వుంటారు. ఇక్కడ ప్రవేశించిన మరలా ఖాళీ స్థలం వుంటుంది. దీనికె లోపల చిన్నవరండాలాంటిది వుండి అక్కడ చాలా మంది అధిరాయు యుంటాయి. ఖాళీ స్థలానికి ఎడమ భాగాన (ఉత్తరంగా) వో అంతస్థుల భవనం వుంది. ఈ భవంతి ముందర స్తంభాలు మండపంలాగా వుండి పైకి రాతిమెట్లున్నాయి. దీనిని 'విజయ భవంతి' అని పిలిచేవారు. ఒరిస్సాపై విజయానంతరం నగరానికి రాగానే యీ భవనాన్ని నిర్మించారు. అందుకే దీనికి విజయ భవనమని పేరుపెట్టారు. దీనికెదురుగా గుండ్రని ఆకారంలో రెండు గదులున్నాయి. అందు నర్తకీమణులుంటారు. వీటి తర్వాత పై భవనం లాంటివే రెండు భవంతులున్నాయి. ఈ భవనాలలో విలువయిన దుస్తులు వ్రేలాడదీసి వున్నారు. ఇక్కడ రెండు పెద్ద వేదికలున్నాయి. ఇవి చాలా అందంగా తీర్చిదిద్దబడివున్నాయి. ఇక్కడ

[illegible], అందా సున్నమైన వారూ భోజనాలు చేసేవారు. రాజ [illegible] 12 వేలమంది వున్నారు" (Vasundhara Fillizot, Vijayanagara Empire, pp. 43, 45). కాని చిత్ర [illegible] చిత్రించేందుకు వీలుకాదు కాబట్టి పెద్ద పెద్ద [illegible], [illegible]లను, ఉద్యానాలను, స్తంభ మండపాలను మాత్రం [illegible]చినారు. పేయిస్ అంత గొప్పగా వర్ణించిన భవనాలు మట్టో [illegible] పోయినాయి. ముస్లింల దాడికి నాశనం కాగా మనకీనాడు [illegible] మిగిలాయి. అయినప్పటికీ హంపీలో పద్మమహల్, రాణుల [illegible], ఏనుగుల నుంచు భవనం నాటి తీపిగుర్తులుగా మనకు [illegible] మిగిలివున్నాయి.

**గృహోపకరణాలు :** విజయనగర వర్ణచిత్రాలలో గృహోపకరణ [illegible] చాలా అరుదుగా కనిపిస్తూవుంది. లేపాక్షిలోని ఒక వర్ణ చిత్రంలో చాలా అందమైన తలగడ చూపబడింది. ఇది గుండ్రని ఆకా రంలో వుంది. దీని మనుసును మనోహరమైన పుష్పాలంకరణంతో నింపి [illegible] యొమునుగుకు మృదువైన వెల్వెట్ గుడ్డను వాడివుండ [illegible] (చిత్రం. X-4). సోంపాలెంలోని విజయనగర వర్ణచిత్రాలలో [illegible] చిత్రించబడినాయి. ఈ పీటల కాళ్ళు కొంచెం వంగి [illegible] పీట పైభాగాన మెత్త అమర్చబడి వున్నట్లుంది (చిత్రం. X-5).

లేపాక్షి వీరభద్రస్వామి ఆలయంలోని చిత్రరేఖనాల్లో మనకు [illegible] కాలంనాటి నాగరికతా విశేషాలు, జీవన పద్ధతులు దర్శన మిస్తాయి. ఆ కాలంలో ధరించిన దుస్తులనుంచీ, ఆభరణాలనుంచీ, [illegible] ఉపకరణాలవరకూ పరిశీలిస్తే చాలా అభ్యున్నతి పొందిన పౌర [illegible], పద్ధతులూ ఆనాటికే వుండేవన్న విషయం వెల్లడవుతుంది. కొన్ని [illegible] పద్ధతులూ, ఆభరణాలూ నాటికీ, నేటికీ పెద్దమార్పులులేకుండా [illegible]గా వుండటం మనం గుర్తించవచ్చు. నాశికాభరణం, కర్ణాభరణం,

కేశాలంకరణకు సంబంధించిన కొన్ని పద్ధతులూ, ముఖ సౌందర్యాన్ని
యినుమడించే తిలకం....యిలా ఎన్నో వుదాహరణలు మనం చెప్ప
కోవచ్చు. రాజ సంబంధిత లాంఛనాలు, చిహ్నాలు, రవాణా సౌకర్యాలు
మొదలయినవి మినహాయిస్తే సామాన్య పౌర జీవనంలోని కొన్ని
అంశాలు నేటికీ పెద్ద మార్పులేకుండా కనిపిస్తున్నట్లు మనం తెలిసికో
వచ్చు. లేపాక్షి వర్ణచిత్రాల ద్వారా మనం విజయనగర సామ్రాజ్య
కాలంనాటి కొన్ని నాగరికతా విశేషాలను తెలుసుకోగలుగుతున్నాం.
ఈ వర్ణచిత్రాలు ఆ చిత్ర కళాకారుల సామాజిక జీవన సూక్ష్మ పరిశీ
లనకూ కళాభినివేశానికీ మచ్చుతునకలు.

# గ్రౌండ్ ప్లాన్ వివరాలు

1. ఉత్తర గోపురద్వారం
2. లోపలి ఉత్తర గోపురద్వారం
3. వెలుపలి ప్రాకారం — స్తంభాల వసారా
4. లోపలి ప్రాకారం
5. నాట్యమండపం
6. వీరభద్రస్వామి ఆలయ ముఖమండపం
7. రఘునాథాలయం
8. వీరభద్రస్వామి గర్భగృహం
9. దేవీ మందిరం
10. ఉపాలయం
11. మండపం
12. ఆంజనేయ మందిరం
13. కల్యాణమండపం
14. నాగలింగం
15. ఉపాలయం
16. వనివార మండపం
17. పవిత్ర ప్రదేశం



II. కేశాలంకరణలు, దుస్తులు



III. రాజభవనం

# పదవివరణ

అధః పద్మ : తలక్రిందులుగావున్న పద్మం

అధిష్ఠాన : ఉపపీఠానికిపైన, కుడ్యభాగానికి క్రిందిభాగం

అభయ : రక్షితహస్తం

అర్ధమండప : మహామండపమునకు ముందరిది

అర్ధోరుక : అర్ధవస్త్రం

అక్షమాల : రుద్రాక్షమాల

అంకుశ : ఏనుగును అదుపు చేసే సాధనం

అంజలి : రెండుచేతులు జోడించి నమస్కరించుట

అంతరాళ : గర్భగృహానికి ముందుండేది

అంతరీయ : క్రిందివస్త్రం

ఆలింగన : కౌగిలి

ఆలింగనపట్టిక : ఉపపీఠ, అధిష్ఠానాల పైభాగం

ఆసనపట్టిక : వేదిబంధంపైన అమర్చివుంచే పలక

ఉత్కుటికాసన : రెండుపాదాలు దగ్గరచేర్చి వాటి మీదే కూర్చొను విధానం

ఉత్పల : సంపంగిపూవు

ఉదరబంధ : నడుం పట్టీ

ఉపపీఠ : అధిష్ఠానానికి క్రిందిభాగం

ఉపాన : ఉపపీఠ, అధిష్ఠానాల క్రింది భాగం

ఊర్ధ్వజాను : ఒకకాలు భూమి మీదుంచి మరొక కాలును పైకి లేపి కిరీటం ప్రక్కన వుంచే భంగిమ

ఊర్ధ్వపద్మ : పైకి వున్న పద్మం

ఏకతల : ఒకేతలము (అంతస్తు)

ఏకవేణి : జడ

ఏకావళి : ఒకే సరముతోవున్న హారం

కటకహస్త : చేతివ్రేళ్ళ చివరలు వొకచోట చేర్చివుంచుట

కట్యవలంబిత : చేయిని క్రిందికి వొదలి నడుం మీద వుంచుకొనుట

కపాలం : పుర్రె

కపోత : కుడ్య,శిఖరాలకు మధ్యనున్న భాగం

కర్ణకూట : విమానమంచలి మూలగావుండే చిన్నగుడి

కర్ణకోష్ఠ : విమానమంచలి మూలగావుండే కోష్ఠం

కరండ మకుట : బోర్లించిన పాత్ర ఆకారంలా వుండే కిరీటం

కక్షాసన : సభామండప వేది బంధపైన అమర్చివుండే పలక

కిరీటమకుటం : అలంకరణ కిరీటం

కుచబంధ : స్తనాలు బిగించే వస్త్రం

కుడ్యస్తంభ : గోడపై వుండే అర్ధ స్తంభం

కుముద : వృత్తాలంకరణ పట్టిక

కుండల : చెవి ఆభరణం

కుంభపంజర : క్రిందిభాగంలో కుంభ (పూర్ణకుంభం) పైభాగంలో పంజరం కలిగి వుండేఅర్ధస్తంభం

కూట : చతురస్రశిఖరం వుండే చిన్నగుడి

కూటకోష్ఠ : శిఖరం కల గూడు

కేయూర : భుజాలంకరణ

కోష్ఠ : గూడు

ఖట్వాంగ : పుర్రె తగిలి వుండే పొడవైన ధ్వజం

గజపృష్ఠాకృతి : ఏనుగు వెనుక భాగం వలె

గజ–సింహ : ఏనుగు–సింహం సమ్మిళితమైన

గర్భగృహ : గర్భగుడి

గ్రీవ : విమానము నందలి తల,శిఖరముల మధ్యభాగం (మెడ)

గ్రైవేయక : మెడలో ధరించే ఆభరణం(కంఠాభరణం)

గోపుర : ప్రాకార ప్రవేశ ద్వారంపైన వుండేఎత్తైనకట్టడం

చతుర : కుడికాలు భూమిమీదుంచి ఎడమకాలిని కొద్దిగా పైకిలేపి వ్రేళ్ళను భూమికి తగులునట్లు నిలుపొనుట

చామర ధారిణి : వింజామర పట్టుకొని వుండే స్త్రీ

చిత్ర తోరణ : మనోహరంగ మలచబడిన తోరణం (ఇది సర్వసాధారణంగా కోష్ఠపై భాగమందు కను పించును)

చిన్ముద్ర : బొటనవ్రేలు, చూపుడువ్రేలు కలిపి మిగిలిన వ్రేళ్ళను పైకి వుంచటం

టంక : ఉలి

త్రిపట్ట : మూడుపట్టీలు

త్రిభంగ : మూడు వొంపులు

దండ : కర్ర

దండహస్త : చేయిని ముందుకుచాచి కర్రకలిగి వుంచుట

ద్రావిడ : ఆరు లేక ఎనిమిది పక్షాలు కలిగిన శిఖరం

ద్వారపాలకులు : ద్వార రక్షక భటులు

ద్వితల : రెండు అంతస్తులు

ద్విభంగ : రెండు వొంపులు

దేవకోష్ఠ : దేవతా ప్రతిమ నుంచే గూడు

ధ్వజ : జెండా

నకులపాద : ఉపపీఠ,అధిష్ఠాన,గ్రీవ భాగాంలో కనిపించే చిన్న స్తంభం

నాగపాశ : సర్పాకారం కలిగిన త్రాడు

నాగర : నాలుగు పక్షాలున్న శిఖరం

నూపుర : పాదవలయం

నేత్రకోష్ఠ : కర్ణకోష్ఠ,భద్రకోష్ఠల మధ్యలో వుండే గూడు (విమాన భాగంలో)

పత్రతోరణ : గూడులపైన వుండే ఆకుల సంబంధిత అలంకరణ

పరశు : గొడ్డలి

పంసాన : మెట్లాకారంలో వుండే శిఖరం

ప్రస్తర : స్తంభానికి, పైకప్పుకు మధ్య భాగం

పాశ : త్రాడు

ప్రాకార : ఆలయ ప్రాంగణం చుట్టూవుండేగోడ

ప్రాసాద : ఆలయం

పుష్ప పోతిక : స్తంభపై భాగంలో వుండే పుష్పమొగ్గ ఆకృతిలో వుండేభాగం (బ్రాకెట్టు)

పూర్ణఘట : నిండు కుండ

| | | |
|---|---|---|
| పూర్ణోరుక | : | పూర్తి వస్త్రం(ధోవతి) |
| భద్రకోష్ఠ | : | విమాన మధ్యభాగంలో వుండే గూడు |
| భ్రమరక | : | చుట్టు వెంట్రుకలు |
| భుజంగత్రాస | : | ఒకకాలు భూమిమీదుంచి మరొక కాలు మోకాలు వరకు, లేదా కొంచం క్రింది వరకు పైకి లేపి వుంచుట |
| భుజంగ లలిత | : | ఒకకాలు భూమి మీదుంచి మరొక కాలుమోకాలు వద్దవంచి పైకెలేపి మోకాలుపై భాగంలో వుంచుట |
| మకర | : | మొసలి |
| మకరతోరణ | : | కోష్ఠం (గూడు)పైన వుండే మొసలి అలంకరణ |
| మహామండప | : | ముఖమండపాన్ని ఆనుకొని వుండే పెద్ద మండపం |
| మంజీర | : | పాద ఆభరణం |
| ముఖమండప | : | మహామండపానికి లేదా అంతరాళకు ముందుండే మండపం |
| మృగ | : | జింక |
| మేఖల | : | నడుం యొక్క ఆభరణం |
| మోదక | : | అన్నం ముద్ద |
| లలాట బింబ | : | ద్వార బంధ మధ్య భాగం |
| వజ్ర | : | ఉరుము, మెరుపు (ఇంద్రుని ఆయుధం) |
| విమాన | : | గర్భగుడిపైన వుండే కట్టడం |
| విస్మయ | : | చేయిపైకెత్తి వుంచుట |
| వేది | : | ఎత్తైనభాగం (వేదిక) |

# ఉపయుక్త గ్రంథాలు

## A. ORIGINAL SOURCES

### 1. EPIGRAPHY :


ANNUAL REPORTS OF SOUTH INDIAN EPIGRAPHY

Rama Rao, M : Inscriptions of Andhra Desa Vol.II, Part II, TIRUPATI, 1968

Sastri, S.S : Tirupati Devasthanam Epigraphical Reports, MADRAS, 1930.

SOUTH INDIAN INSCRIPTIONS(TEXTS), VOLS IX, X


### 2. LITERARY WORKS :


Amuktamalyada, Madras, 1964

Manucharitra, Madras, 1968

Sivapuranam, New Delhi, 1969

Sri Kalahasthimahatmyamu, Hyderabad, 1968

Vasucharitra, Madras, 1926


## B. MODERN WORKS ON ARCHITECTURE, ART, ICONOGRAPHY AND PAINTING


Acharya, P.K : Architecture of Manasara, LONDON, 1934

Agrawala, R.C : Sculptures from the Udaipur Museum, JAIPUR, 1960

Agrawala, U : Khajuraho Sculptures And Their Significance, NEW DELHI, 1964

Agrawala, V.S : Evolution of Hindu Temple and other Essays, VARANASI 1965

,, : Indian Art, VARANANI, 1965

Balasubrahmanyam, S.R : Early Cho,a Temples, Parantaka I to Rajaraja I (A.D907–985), NEW DEHLI, 1971

,, : Middle Chola Temples

Banerjea, J.N : The Development of Hindu Iconography, 1956, CALCUTTA

Bhattasali, N.K : Iconography of Buddhist and Brahminical Sculptures in the Decca Museum, VARANASI, 1972

Brown, P : Indian Architecture(Buddhist and Hindu Periods) BOMBAY, 1956

Bussaglio, M & Sivaramamurthy, C : 5000 years of Indian Art, NEW YORK

Chandra, Moti : Jain Miniature Paintings from Western India, AHMEDABAD, 1949

,, : Studies in Early Indian Paintings, LONDON, 1970

Coomaraswamy, A.K : The Dance of Siva, BOMBAY, 1957

,, : Elements of Buddhist Iconography, HARVARD UNIVERSITY PRESS, 1935

| | | |
|---|---|---|
| Dhaky, M.A | : | The Vyala Figures on Mediaeval Temples of India, VARANASI, 1965 |
| Dhavalikar, M.K | : | Ajanta, A cultural Study,., POONA. 1973 |
| ,, | : | Sanchi, A cultural Study, POONA, 1965 |
| Dubreuil, G.J | : | The Pallavas Iconography of Southern India |
| Fergusson, James | : | The History of Indian and Eastern Architecture, Vol. II, NEW DELHI, 1967 |
| Ganguly, O.C | : | The Art of the Pallavas, CALCUTTA, 1957 |
| ,, | : | The Art of the Rashtrakutas, CALCUTTA, 1958 |
| Gopalakrishna Murthy, S | : | The Art of Lepakshi |
| Gopala Rao, A | : | Lepakshi, HYDERABAD, 1970 |
| Gopinatha Rao, T.A | : | Elements of Hindu Iconography, 2. Vols, VARANASI, 1971 |
| Gupte, R.S | : | The Art and Architecture of Aihole-A Study of the Early chalukyan Art through Temple Architecture and Sculpture, BOMBAY, 1967 |
| ,, | : | Iconography of the Hindus Buddhists and Jains, BOMBAY, 1972. |

Gupte, R.S. & Mahajan; B.D : Ajanta, Ellora and Aurangabad Caves, BOMBAY, 1962

Harle, J.C : Temple Gateways of South India

Kameswara Rao, V : The Lepakshi Temple, TIRUPATI, 1982

,, : Select Vijayanagara Temples of Rayalaseema, HYDERABAD, 1976

Khan' A.W : A Mon graphy on the Discovery of Mural Paintings of Kalyani Chalukyas at Alladurg, 1968

Khandalawala, Karl : Indian Sculpture and painting, An Introductory Study

,, : The Development of style in Indian Painting, CULCUTTA

Kiran Kranth Choudary, D : The Five Prominent Temples of Bhuvanesvar CHITTOOR, 1982

Kramrisch, Stella : The Vishnudharmottara, Part III, CULCUTTA, 1928

,, : The Art of India, LONDON, 1945

,, : A Survey of Painting in the Deccan, HYDERABAD, 1937

Krishnamurthy, K : Nagarjuna Konda, A Cultural Study, DELHI, 1977

,, : GandharaSculpture-aCultural Study, DELHI 1977

,, : Ancient Indian Furniture, NEW DELHI, 1982

,, : Hair Styles in Ancient India, NEW DELHI, 1975

Longhurst, A.H : Humpi Ruins-Discussed and Illustrated, NEW DELHI, 1981

Mahalingam, T.V : Administration and Social life in the Vijayanagara Empire, MADRAS, 1940

Mitra, R : The Antiquities of orissa, CALCUTTA, 1961

Nagaraja Rao, M.S : Kiratarjuniyam in Indian Art, NEW DELHI, 1979

Panigrahi, K.C : Archaeological Remains of Bhuvaneswar 1961

Pathy, T.V : Elura, Art and culture, NEW DELHI, 1982

Prasad, B.R : Temple Sculpture of Andhra Pradesh, HYDERABAD, 1978

,, : Art of South India-Andhra Pradesh, DELHI, 1980

Ram Raz : Essay on the Architecture of the Hindus, DELHI, 1971

Rama Rao, M : The Temples of Srisailam, HYDERABAD, 1969

,, : Early Chalukyan Temples of Andhra Desa, HYDERABAD, 1965

,, : Select Andhra Temples, HYDERABAD, 1970

,, : The Temples of Kalinga, TIRUPATI, 1965

,, : Select Kakatiya Temples, TIRUPATI, 1966

,, : Saivite Deities of Andhra Desa, TIRUPATI, 1960

,, : Eastern Chalukyan Temples of Andhra Desa, HYDERABAD, 1964

Rao, P.R.R : Alampur, A Study in Early Chalukyan Art, HYDERABAD, 1977

Rea, A : Pallava Architecture, Archaeological Survey of India New Imperial Series, Vol. XXIV, VARANASI, 1970

,, : Chalukyan Architecture, Archaeological survey of India New Imperial Series Vol.XXI, VARANASI, 1970

Sahai, B : Iconography of the Minor Hindu and Buddhist Deities, NEW DELHI, 1975

Sahay, S : Indian coustumes, Coiffure and ornaments, NEW DELHI, 1975

Saletore, B.A : Social and Political life in the Vijayanagara Empire, Vol. II, Madras, 1934

Saletore, R.N : Vijayanagara Art, NEW DILHI, 1982

| | | |
|---|---|---|
| Dhaky, M.A | : | The Vyala Figures on Mediaeval Temples of India, VARANASI, 1965 |
| Dhavalikar, M.K | : | Ajanta, A cultural Study, POONA. 1973 |
| ,, | : | Sanchi, A cultural Study, POONA, 1965 |
| Dubreuil, G.J | : | The Pallavas Iconography of Southern India |
| Fergusson, James | : | The History of Indian and Eastern Architecture, Vol. II, NEW DELHI, 1967 |
| Ganguly, O.C | : | The Art of the Pallavas, CALCUTTA, 1957 |
| ,, | : | The Art of the Rashtrakutas, CALCUTTA, 1958 |
| Gopalakrishna Murthy, S | : | The Art of Lepakshi |
| Gopala Rao, A | : | Lepakshi, HYDERABAD, 1970 |
| Gopinatha Rao, T.A | : | Elements of Hindu Iconography, 2. Vols, VARANASI, 1971 |
| Gupte, R.S | : | The Art and Architecture of Aihole-A Study of the Early chalukyan Art through Temple Architecture and Sculpture, BOMBAY, 1967 |
| ,, | : | Iconography of the Hindus Buddhists and Jains, BOMBAY, 1972. |

Gupte, R.S. &
Mahajan; B.D : Ajanta, Ellora and Aurangabad Caves, BOMBAY, 1962

Harle, J.C : Temple Gateways of South India

Kameswara Rao, V : The Lepakshi Temple, TIRUPATI, 1982

,, : Select Vijayanagara Temples of Rayalaseema, HYDERABAD, 1976

Khan' A.W : A Mon graphy on the Discovery of Mural Paintings of Kalyani Chalukyas at Alladurg, 1968

Khandalawala, Karl : Indian Sculpture and painting, An Introductory Study

,, : The Development of style in Indian Painting, CULCUTTA

Kiran Kranth Choudary, D : The Five Prominent Temples of Bhuvanesvar CHITTOOR, 1982

Kramrisch, Stella : The Vishnudharmottara, Part III, CULCUTTA, 1928

,, : The Art of India, LONDON, 1945

,, : A Survey of Painting in the Deccan, HYDERABAD, 1937

Krishnamurthy, K : Nagarjuna Konda, A Cultural Study, DELHI, 1977

,, : GandharaSculpture·aCultural Study, DELHI 1977

